శ్రీరస్తు.

శ్రీ శివాభ్యాం నమోనమః.

# సత్యవత్యుపాఖ్యానము

మల్లంపల్లి మల్లికార్జునారాధ్య విరచితము

బ్రహ్మశ్రీ పండిత పురాణము సూర్యనారాయణ తీర్థులవారిచే పరిశోధింపబడి

ఆంధ్రపత్రికా ముద్రాలయమున
ముద్రింపబడినది.

మొదటికూర్పు 1000 కాపీలు.

మద్రాసు.

1919

 [వెల. రూ. ౧-౦-౦.

# విషయసూచిక.



## ప్రథమాశ్వాసము



## ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము

### తీర్థయాత్రాఘట్టము.

## పంచమాశ్వాసము

శ్రీరస్తు

# సత్యవత్యుపాఖ్యానము

## అవతారిక



### కృతిపోషక వంశానుక్రమణిక

ఇలఁ గల పిల్లలన్ సతుల నేమియు ధైర్యము లేనివారి బా
ధలఁ గుడువంగఁ జేయుచును దక్షుల ప్రోవల వీడుచున్ బిశా
చుల మఱపించు దుర్జనుల శూలమునం గొలియించి, యుండు యో
గ్యుల నలరింప నీశ్వరుఁడు గూర్చుత లోకహితైకవృత్తులన్. ౧

సీ. కానుకొల్లునఁ గోటఁ గట్టిన యినుగంటి
పట్టాభిరామభూవరునివలన
యలకుర్తి నార్జించి యంకుఁ ద[illegible]కమ్ము
వనముఁ గూపమును దేవళము భూమి
ధననిధానమ్మును ధర్మగుప్తాభ్యుద
యమును భద్రాయురుదంత మనెడి
కృతులను సప్తసంతతు లొనర్చిన మేటి
విద్వత్కవియు మంత్రవేత్త యగుచు
నలరు కాళిపూస్సిద్ధరామయ్యచేత
గురువుగాఁ జేసికొనఁబడి పరమకరుణఁ
గళిక లుత్కళికలు కృతిఁ గాంచి చెలఁగు
నట్టి వీరనారాధ్యుఁ డెం దవతరించె. ౨

సీ. కమదన శోభనాద్రిమహీంద్రుఁ డిడె వృత్తి
యలమర్తి నల శోభనాద్రిపురముఁ

జల్లపల్లిధరణిజాని యా కోదండ
రాములు మల్లేశ్వరపుర మిచ్చె
మాహేశ్వరపురమ్ము మద్దాలిరెడ్డినా
యఁడు గారు బోడపాట్యన్వయాబ్ధి
చంద్రుండు గురురా జొసంగిరి నారయా
ప్పారా విడెను విరివాడవృత్తి
నే మహామహునకు నట్టి యిద్ధకీర్తి
నాదు మాతామహుని తాత నతసమస్త
భూమిపతి మల్లనారాధ్యపుణ్యరాశి
యే మహావంశమునఁ బుట్టె యెన్నికఁ గనె. ౩

సీ. * న్యాయసాహిత్యగౌతమావతారము గౌత
మారాధ్యుఁ డే వంశమందుఁ బొడమె
రాని విద్య యెఱుంగరానివాఁ డల కాళ
హస్తిలింగార్యుఁ డెం దవతరించె
నపరగౌరీశ్వరుం డైన బ్రహ్మయలింగ
బోద్ధ యే సద్వంశమున జనించె
నప్రతిమానమేధాబ్ధి యా భైరవా
నందవిద్వన్మణి యెందుఁ బుట్టె
సరసవాక్చాతురీజగజ్జయవిరాజి
చంద్రశేఖరార్యుం డెందు జనన మందె
నట్టి కాశినాథాన్వయమందుఁ బుట్టె
బుచ్చయారాధ్యచంద్రుండు పుణ్యమూర్తి. ౪

తే. ప్రథిత యివటూరిసోమనారాధ్యతనయ
శ్యామలాంబికాసాధ్వి యా యనఘు పత్ని

---

* ఈ గౌతమారాధ్యులు శ్రీరంగపురమునఁ బండితసదరామీన్ కోర్టులో మాసమునకు నాలుగువందల రూప్యముల వేతనము నందిన మహనీయుఁడు.

వారి సుతులు నాగేశ్వరపండితుండు
సాంబశివశర్మ భ్రమరాంబ యలఘుమతులు. ౫

సీ. వారిలో లోకోపకారపారీణుండు
స్తుతివిముఖుండు నిస్తులగుణుండు
విద్యాధికుండు జగద్విదితయశస్కుండు
ప్రథితాంధ్రపత్త్రికాప్రభుండు దాత
యమృతాంజనబ్రహ్మ శ్యామలాంబాధర్మ
పారశాలాకర్త పావనుండు
నాగేశ్వరమనీషి నా యీ కృతికిఁ బోష
కత్వమ్ముఁ గనుటఁ బ్రఖ్యాత మగును
సత్యవత్యుపాఖ్యానమ్ము చంద్రమౌళి
కావ్యమునకుఁ బోషకులకుఁ గర్త కెప్పు
డాయురారోగ్యకీర్తివృద్ధ్యభ్యుదయము
లొసఁగి కృతకృత్యులను జేసి యోముఁగాత. ౬

సీ. ఏ పతిదేవత కీ యాంధ్రపత్రిక
యే సవతి యగుచు నెలమిఁ గూర్చు
నే మాన్యకును మేనమామ రెంటాల వేం
కటసుబ్బరావు జగన్నుతగుణుఁ
డే ప్రాజ్ఞ తండ్రి మల్లాప్రెగడాన్వయ
రత్నంబు వేంకటరత్నమంత్రి
యే సతికిం దల్లి యాద్య వేంకటలక్ష్మి
రాజభాషాతిధురంధరసుత
యట్టి ధన్య నాగేశ్వరార్థాంగలక్ష్మి
యనఘ రామాంబికాసాధ్వి కయ్యలఘుల
యనుగుపట్టికిఁ గామాక్షి కాంధ్రపత్రి
కకు నొసంగుత గౌరి మంగళము లెపుడు. ౭

## కృతికర్తృవంశాద్యనుక్రమణిక

తే. కృతమునన్ రేవణాసిద్ధుఁ ద్రేత మరుళు
ద్వాపరమున నేకోరామపండితుఁ గలి
మల్లికార్జునపండితు మానవు లొగి
శివమతమునకు గురువులఁ జేసికొనిరి. ౮

క. అం దేకోరామాన్వయ
మం దుదయించిన మహాత్ము లార్జించిరి కీ
ర్తిం దగు మల్లమపలి, వా
రం దుండుట నింటిపేరు నదె యై చెలఁగెన్. ౯

సీ. అధిపుఁ డిచ్చిన యగ్రహారమ్ము గురునకుఁ
గానుకగా నిడిన శంకరమనీషి
తర్కశాస్త్రమున నద్వంద్వుఁడై తగు మల్లి
కార్జునారాధ్యవిద్యాపయోధి
హాలాస్యఖండంబు నాంధ్రీకరించిన
బుచ్చయారాధ్యవిబుధవిధుండు
శైవలీలలఁ బ్రౌఢశైలి రచించిన
మల్లికార్జునకవితల్లజుండు
మతపయోనిధిమందరమహీధరంబు
మనుగురుఁడు గురుమల్లికార్జునగురుండు
మొదలుగాఁ గల రత్నముల్ పుట్టిన గని
యలరు మల్లమపల్యన్వయంబు దాన. ౧౦

సీ. ఏ మహాత్మునకు వీరేశలింగారాధ్య
మణి తపఃఖని మహామహుఁడు తాత
ఏ సత్యసంధున కా సర్వవిషయప్ర
చండుఁ డక్షయదేశికుండు తండ్రి

ఏ ఘనునకు మనీషాఘనుల్ మంత్రమూ
ర్త్యాఖ్య వీరేశలింగాఖ్యు లనుజు
లే యనఘునకు విధేయులు రామలిం
గాభిధుఁడును మల్లికార్జునాఖ్యుఁ
డాత్మజులు నాత్మజలు భ్రమరాంబ సుంద
రాంబ యన్నపూర్ణ యనఘ లైరి యట్టి
వీరమల్లేశ్వరారాధ్య వీరశైవ
మతరహస్యజ్ఞు మా తండ్రి మదిఁ దలంతు. ౧౧

సీ. ఆత్రేయగోత్రజుం డనఘుండు నాగలిం
గారాధ్యుఁ డలఘుఁ డే యమ్మ తండ్రి
యనఘ లక్ష్మిదేవి యనఁ బేరు గాంచిన
తల్లి యే తల్లికిఁ దాను తల్లి
శ్రీరామలింగశాస్త్రియు మల్లనారాధ్యుఁ
డేయమ భ్రాతలై యెసఁగుచుండు
రన్నపూర్ణాబాపయారాధ్యు లే ధన్య
పాలకజనకు లై పరఁగుచుండు
రధికపతిభక్తి లక్ష్మమ యనుఁగునసుజ
యయ్యె నేయమ్మ కా భ్రమరాంబకు ననుఁ
గన్నతల్లికిఁ బతిభక్తి కరుణ కీర్తి
గల పురంధ్రికి మ్రొక్కెదఁ గరము భక్తి. ౧౨

తే. భావుకుల సాధువృత్తులఁ బరమగుణుల
మణులఁ బోలెడు నివటూరి మంత్రమూర్తిఁ
గాశినాథుని భైరవాఖ్యాకు మల్ల
యాహ్వయున్ గురువులఁ గడు నభినుతింతు. ౧౩

సీ. నా మామ నిగమాగమామేయవైభవుం
డగు ముదిగొండ లింగావధాని

నా స్యాలకుండు జనకుని మించిన ధన్యుఁ
డైన వీరేశలింగావధాని
నా షడ్డకుండు దుర్ణయమతదండి శి
వపురవంశ్యుఁడు వీరభద్రహోత
నా ధర్మపత్ని తనదు తల్లియగు హైమ
వతిఁ బోలి సాధ్వియై వఱలు దుర్గ
అంబ వీరమల్లేశ్వరాహ్వయుఁడు హైమ
వతియు రామలింగంబును బాలు ద్రావు
వాఁడు వీరేశలింగంబు వరుస నాకుఁ
బుత్త్రులు శతాయురరుజులు పొలుచుచుంద్రు. ౧౪

సీ. నిశ్చలైశ్వర్యులు నిరుపమభక్తులు
మంత్రిసింహులు నిడమర్తివారు
నఖిలదిగ్విదితు లనాదిసంపద్వంతు
లైన దారావారు ననుపమాను
లైన దుగ్గావారు నట్టి చెన్నావారు
మాజేటివారును మండవిల్లి
వారు నత్యంవారుఁ బత్తివారును బచ్చి
గోళ్లవారును గొనకళ్లవారు
మున్నుగాఁగల శిష్యులు మూఁడువంద
లేఁబది భవనములవారు నేకరీతి
భక్తిఁ బూజింపఁ బరఁగెడివాఁడ సాధు
జనవిధేయుఁడ 'మల్లికార్జునుఁడ నేను. ౧౫

## విజ్ఞప్తి

మ. శివతత్త్వానుభవామృతం బొసఁగి సచ్ఛిష్యప్రపంచాజనం
జవబాధల్ హరియించుచుం బరుల కష్టమ్ముల్ తొలంగింపఁ దా

మవకాశమ్ము కొలంది పాటుపడువారై కీర్తి నార్జించు శ్రీ
శివలెంకామృతలింగదేశికు కృపాశ్రీ ముక్తి మాకీవుతన్. ౧౬

సీ. పరహిరణ్యాహరణవైభవమ్మున మించి
నరసింహులై భువనములఁ గలఁచి
యకపటబలుల నన్యాయమ్ముగఁ గపట
వామనులయి తలల్ వంపఁజేసి
ప్రకటమహాలక్ష్మి వికచాస్యమును సదా
కాంక్షఁ గను విపతిగమను లగుచు
మాతృసగర్భ్యావమతిసురాదృతిపర
స్త్రీమానభంగాభిరాము లగుచు
బౌద్ధభావంబు నెనసి సభలను దూఱి
కల్కు లయి హీనకులజలఁ గలిసి ఘనుల
మనుచుఁ దుచ్ఛవేషమ్ముల మనెడు లోక
మోహనుల శమమ్ము జగమ్ముఁ బ్రోచుఁగాత. ౧౭

సీ. శ్రీపతిపండితాంచితవంశజుఁడు నాయ
నుంగును గవి నాగలింగసూరి
సహజగానకలావిశారదుం డగు కాశి
నాథుని భైరవానందబుధుఁడు
కలువలపల్లిసత్కులసింధుకల్ప మై
న ఘనుండు మా రంగనాథసుకవి
మన్మాతృవంశసంభవమణి కవి దాత
యై మించు వీరమల్లయ్యమంత్రి
యింక నెందఱో సత్కవు లీ ప్రబంధ
మణిని సానఁబెట్టిరి వారి గణుతిసేతుఁ
జెలఁగు బ్రహ్మపురాణప్రసిద్ధతఁ గథ
కలవు తగు మార్పు లందందుఁ గథను గృతిని. ౧౮

తే. కృతికిఁ బ్రేరకుల్ పోషకుల్ కృతిపతులును
గృతిపతిగురువు లీ కృతిఁ గీలితు లయి
మొదలఁ దుదల సర్వాశ్వాసములఁ జెలంగు
చుంద్రు కవులు తప్పులు దిద్దుచుంద్రుగాత. ౧౯

క. కృతిపోషకులకుఁ గృతిపతి
కతిమైత్రి యగుటఁ దదర్పితాస్మత్కృతి శా
శ్వత మయ్యెడు నా కిఁక సా
ర్థత గల్గున్ బోషకు లతిదక్షులు గానన్. ౨౦

---

అవిఘ్నమస్తు

శ్రీ పార్వతీపరమేశ్వరాభ్యాం నమః

---

# సత్యవత్యుపాఖ్యానము

## ప్రథమాశ్వాసము

---

### మంగళాచరణములు

శ్రీగౌరీముఖచంద్రమండలసుధాసేవాలలాటాగ్రక్తత
ద్యాభాగాలంకృతకుంకుమాయితసముద్యన్నేత్రుఁ డభ్రాపగా
యోగాంచత్తరుణాబ్జశేఖరుఁ డనంతోదారభాస్వద్గుణుం
డా గోరాజహయుండు మా కెపుడు నిత్యానందమున్ గూర్చుతన్.

చ. కరిముఖుఁ గన్నతల్లి గఱికంఠుని రాణి మురారి పేర్మి సో
దరి గిరిరాజు బిడ్డ వరదానవిశారద శారదాబ్జముం
దిర లొనరించు సేవలకుఁ దేఱెడి ధీర పురాణసాధ్వి మేల్
కరుణకుఁ బుట్టినిల్లు కలకాలము నయ్యుమ మమ్ముఁ బ్రోచుతన్. ౨

చ. కలశపయోధి గారవపుఁగన్నియ నక్కునఁ జేర్చి పేర్మి పెం
పలరఁగ మాటిమాటి కనయంబును దన్ముఖపూర్ణచంద్రమం
డలనయనోత్పలాలకఘనాఘనఖండములన్ స్పృశించి ము
ద్దులు గొను చక్రపాణి దయతో మము నేలుత నెల్లవేళలన్. ౩

ఉ. రాజు సహోదరుండు రతిరాజు కరుం డొకఁ డా సరస్వతీ
రాజుఁ దనూజులున్ భుజగరాజు మణీమయతల్ప మాపగా
రాజు గురుండు తేరు ఖగరాజు మరుద్యువరాజు రాజుగా
రాజిలు రాజ్ఞి మాకు ననురాగముతో నొనఁగూర్చుతన్ సిరుల్. ౪

చ. అలరులు గంధమున్ దములపాకులుఁ బోఁకలలంకరించి రా
చిలుకను గైనమర్చి యొకచేతను బుస్తకమున్ ధరించి సొం
పలరఁగఁ జేతి కచ్ఛపికి నబ్బెసముం బొనరించు వైఖరిం
బలుకువెలంది పాడిన సెబా సను ధాత వరంబు లీవుతన్. ౫

ఉ. అంచకు నెన్నడల్ గఱపి యంతటి కీరితిఁ గాంచు రీతిఁ గా
వించిన ప్రౌఢ బ్రహ్మకు లభించిన పుణ్యఫలమ్ము నమ్మి సే
వించినవారికిన్ దొరకు పెన్నిధి సన్నిధిఁ జేసి వాణి చే
యించుత నాపయిం గరుణ నించుక చిల్కుచు నీ ప్రబంధమున్. ౬

చ. కరివదనున్ భజింతుఁ గ్రతుఘస్మరుఁ గొల్తుఁ గుమారు వేఁడుదున్
శరభు నుతింతుఁ జిత్తజలజంబున నిల్పుదు దక్షిణాస్యునిన్
గరము గణింతు బాల మదిఁ గాపుర ముంచెద లంబనాసునిన్
వరము లొసంగి మ మ్మెపుడు వారలు ప్రోచెద రాదరమ్మునన్.

శైవకవిస్తుతి

సీ. బహుసంస్కృతాంధ్రప్రబంధవిద్వత్కవి
ముల్గుపాపారాధ్యముఖ్యు నెంచి
యుభయభాషాకవితోన్నిద్రు శివలెంక
మృత్యుంజయారాధ్యు నెద భజించి
విబుధోపభోగసువిహితామృతకృతి
నత్తలూర్పాపకవ్యబ్ధిఁ దలఁచి
పదపద్యరచనాప్రబంధబంధురు ముల్గు
వియ్యనారాధ్యకవిన్ నుతించి
ప్రథితు శివలెంక మల్లనారాధ్యుఁ బొగడి
ప్రాదివంద్యు సంస్కృతకవిప్రవరుఁ బూర్వుఁ
గొలుతుఁ జాగంటి మల్లేశకోవిదమణిఁ
జక్కఁగల శైవకవులను దలఁతు భక్తి. ౮

ఆ. బిచ్చగాఁడ ననుచుఁ బేరిడుకొని యాశ్రి
తులను ధనపతులను సలుపుచు ముది
గొండ శంకరులను గూర్మి మించెడి ముది
గొండ శంకరులను గొలుతు నెపుడు. ౯

## గురుస్తుతి

క. దీక్షాగురువులు దళితవి
పక్షులు శ్రీకాశినాథబ్రహ్మయలింగ
ద్వ్యక్షమహేశులు సదయక
టాక్షులు గురుకీర్తిభూషితాశులు నాకున్. ౧౦

సీ. కాశినాథాల్లమదేశికులును నివ
టూరి లింగారాధ్యసూరిమణులు
విదితతాడేపల్లి వేంకటకవివిభుల్
వక్కలంకజవీరభద్రబుధులు
శ్రీమదద్దేపల్లి సోమనాథర్షులు
గుమ్మలూర్సంగమేశకోవిదులును
దిరుపతి వేంకటేశ్వరులు సంస్కృతగురు
లాది నాంధ్రమ్మున నైరి గురులు
కాశినాథుని చినవీరదేశికులు క
విత్వమార్గదర్శులు బ్రహ్మవేత్త లగుచు
నొప్పు చాగంటి మృత్యుంజయులును మంత్ర
గురులు ముదిగొండ రామేశగురులు నాకు. ౧౧

చ. నిరుపమమై, సమస్తధరణీవరసంసదుపార్జితోజ్జ్వల
ద్విరుదకమై, విపక్షకవిక్షితిభృత్పటలీశతారవి
స్ఫురణకమై, యశేషబుధపుంగవమానితమై తనర్చు శ్రీ
తిరుపతివేంకటేశ్వరుల దిగ్విజయంబు జయంబుఁ గూర్చుతన్. ౧౨

సీ. భోగేశమాహాత్మ్యమున మున్ను నాచేతఁ
ప్రార్థింపఁబడిన రుద్రాక్షమణులు
భస్మము ల్బిల్వము ల్పంచాక్షరియుఁ బ్రమ
థులును మునులును భక్తులును గవులు
గురువులు పండితు ల్కులవృద్ధులును గూడి
నా చేయు నీ ప్రబంధము నవిఘ్న
ముగ శీఘ్రముగఁ బూర్ణమును జేయుదురుగాత!
సఖులు నాయెడఁ దమ సహజ మైన
ప్రేమఁ జూపుచు నిచ్చలుఁ బ్రేరణంబుఁ
జేయుచుందురుగాత! నా శిష్యు లెల్లఁ
గుశలులై నాకు ముద మొసంగుదురుగాత!
తనరుత గ్రంథ మాచంద్రతారకముగ. ౧౩

ఉ. మా కులభూషణంబు బుధమాన్యుఁ డఖండుఁడు లౌకికమ్మున
న్వ్యాకరణాబ్ధిమంథగిరి యైతమపూడినివాసి పేరయా
ఖ్యాకమనీషి మాకు గురుఁ డంతికమందున నుండు దేనికిన్
నైకకలార్థిసంఘయుత మేలెటిపా డది యొప్పు నెంతయున్. ౧౪

సీ. అనఘు నా మేనత్త యగు వీరలక్ష్మ్యంబ
వీరబసవనార్యు పేర్మి పత్ని
ఆయమ మేనత్త యైన యంబమ్మ గా
రంబనారాధ్యుల కయ్యెఁ బత్ని
ఆ యమ్మ మేనత్త యైన వియ్యాను బస
వారాధ్యులకుఁ బత్ని యయ్యెనఘుఁడె
యార్జించె నీ యగ్రహార మేలెటిపాడు
నాఱుపుట్లీనాము నలఘువృత్తి
నాదు మేనత్త కొడుకు చిన్నబసవేశ
గురుఁడు పంచాక్షరీజపపరుఁడు వామ

నావతారము గుడి నిల్పి యందు దేవి
భక్తిమైఁ బ్రతిష్ఠించిన పావనుండు. ౧౪

తే. వారి కూటస్థపురుషుండు సూరి రామ
నాథుఁడు ప్రతిష్ఠఁ జేసె నానాఁడు దేవు
రామలింగేశు నతనికిన్ రాణిఁ జేసె
దేవిఁ బర్వతవర్ధని న్భావనేఁడు. ౧౫

తే. వీరలక్ష్మి మహాలక్ష్మి విదిత సుంద
రాంబ భ్రమరాంబ మాకు మేనత్త లందు
నిచట ముప్పుర మా యక్క నిచ్చియుంట
బంధుగులె మాకు నిచ్చటివార లెల్ల. ౧౬

కృతినాయకవివరణము

ఉ. తాతలు తాతతండ్రులును దండ్రులు నేమును గొంత కాల మా
శీతమయూఖశేఖరుని సేవ లొనర్చుచు నిడ నుంట నా
చేతము రామలింగవిభుఁ జేరెను మత్కృతి కమ్మహామహున్
నేతగఁ జేసికొంటిఁ గరుణించి యతండును మమ్ముఁ బ్రోచుతన్.

తే. ఏక మయ్యు ననేక మై యెల్లవారి
భ్రాంతి నొందించు నర్థశబ్దంబు లరయ
భేద మేమియు లేకయె వెలయు దాని
నెట్లు లెవరు సేవించిన నేమి కొదవ. ౧౭

సీ. మెచ్చి యా శివలెంకమృత్యుంజయకవీంద్రుఁ
డే ఘనునకుఁ గన్నె నిచ్చె నట్టి
పెదమేనమామ పేర్వోట్టినందుల కొప్ప
నట్టిఁ డన్పించుకొన్నట్టి ఘనుఁడ!
మల్లికాంబాపూర్ణిమాచంద్రవదనకు
ననుగుణ మగు రూప మమరు వరుఁడ!

గగనగంగాఝురానుగ మైన సంస్కృత
ఫణితి భాషించెడి పండితుండ !
యనఘ! రామలింగకవి! మా యన్న! నీకు
శివునకును భక్తితోడ నా చేయు నీ ప్ర
బంధ మర్పించి నా జనిఁ బావనంబుఁ
జేసికొందును గరుణతోఁ జిత్తగింపు. ౨౦

## అహల్యాగౌతమ ప్రశంస

క. చేతోహారభూరుహములు
శీతలపరిలఘుజలసరసీతతులు మరు
త్పోతములు గల తపోవని
గౌతమముని విభు నహల్య కని కృతనతి యై. ౨౧

తే. దేవ! మరల మీ పాదాబ్జసేవఁ జేయు
భాగ్య మొసఁగెను శ్రీరామపాదధూళి
యనఁగ సాధ్వీశిరోమణి యనెడి గర్వ
మనఘ తరియించు తెరువు నా కానతీరె? ౨౨

క. నావుడు గౌతమముని యను
నో వెలఁదులమానికంబ! యువిదలలోనన్
నీవంటి సాధ్వి యున్నదె?
ద్యోవిభు దుర్ణయమ కాక, యొం డనఁదగునే! ౨౩

ఉ. ఆకృతి మంచి దెచ్చటనొ యచ్చటనే సుగుణంబు లుండు నన్
శ్లోకము లక్ష్యయుక్తమయి శోభిలె నీవలనన్ సతీమణీ!
లోకులు రూపయుక్తలు చెలు ల్పగవా రని వాడు వాక్యమే
నా కనుభూత మయ్యె నిది నా దురదృష్టమ యేమి సేయుదున్.

మ. అకటా! గౌతముసట్టిఁ డింకొకఁడు లేఁ డన్ రీతి వర్తించు నా
కె కళంకమ్ము ఘటించె దైవ మిఁక వేఱే చెప్ప నే మున్న దీ

ప్రకటత్వమ్మె యనర్థమై కలఁచు నా ప్రారబ్ధ మిట్లయ్యెఁ బు
స్తకము ల్సేయుదు రీ కథ న్గవులు సంతాపంబు వాటిల్లెడిన్. ౨౫

ఉ. చెందురుఁ డా సుపర్వగురు సన్నిధి విద్యల నేర్చు వేళఁ ద
త్సుందరి తార వాని సొగసుం గని మోహముఁ జెంది యాతనిం
బొందినఁ జంద్రుపైఁ గినుకఁ బూనిన తీర్పరి యయ్యె నాకు సం
క్రందనుఁ డిట్టు లింత యుపకార మొనర్చెడివాఁడె తెంపునన్. ౨౬

ఉ. పాదమునందుఁ గన్ను గల భర్గుఁ డఖండుఁడు శాస్త్రకర్త వి
శ్వాదరణీయదివ్యమహిమాన్వితుఁ డతఁడు నాఁ జెలంగి యీ
వాదును మోయఁగావలసివచ్చెఁగదా! యకటా! యటంచు నే
ఖేదము నొంద నింద్రుఁడు సుఖించెడినే? చెడఁడే మదాంధుఁడై?

చ. పతియెడ నీకుఁ గల్గు భయభక్తుల వెట్టివొ చాటు లోకవి
శ్రుత మగు నీదు కీర్తి బలసూదనునంతటివాని కిట్టి దు
ర్మతి యుదయింపఁగావలెనె? మాన్యవు నీయెడ నద్ది తప్పురా
కృత మగుఁగాక యాతనికి నెందఱొ సుందరు లందు రందఱున్.

చ. గతజలసేతుబంధనముగా నిపు డిట్టులు చింతిలంగ నే
ల తగిన రీతి నీపయి హిలంగిన మే లొనగూడు ముందు స
ద్గతికిని లోప ముండదు జగమ్మున నేరికి లోటు లేదు? ని
ర్గత మయిపోయె నీ దొసఁగు రామపదాబ్జరజమ్ము సోఁకుటన్.

శా. కన్నుం గానక కౌశికుండు ఖలుఁడై కామార్తుఁడై ధూర్తుఁడై
నన్నుం జూడక నిన్ను నా సతి జగన్మాన్య న్మహారూపసం
పన్నన్ బన్నము నొందఁజేసి, కొనె నాశ్వాభాగ్యమ్ము నద్దాన నీ
కెన్నండుం జెడ దున్న కీరితి భయ మ్మేలా పురంధ్రీమణీ! 30

చ. అన విని గౌతముం గని యహల్య కృతాంజలిబంధ యౌచు ని
ట్లను మహనీయమూర్తి! శరణాగతవత్సల! భర్తృసేవఁ జే

సినఁ దరియింతు రింతు లని చెప్పుదు రందఱు నందులోఁ దపో
ధను లగు మిమ్మె దైవ మని తద్దయు నమ్మియు మోసపోయితిన్.

చ. శచియును నచ్చర ల్దనకుఁ జాలరె? చాలినఁ జాలకున్న, మై
రుచి యిది తుచ్ఛ మట్టిదియె, రోఁచెలినే? నను మీ ద్వితీయఁ గో
రి చెడె శతక్రతుండు, చెలరేఁగి చరించిన నెవ్వరేని ని
ల్లి చెడక తప్ప దే యఘము నే నెఱుఁగం జెడిపోతి నక్కటా! ౩౨

తే. ఎంతవారిఁ జేపట్టిన నెంత బ్రదుకు
బ్రతికినను నేమి తుద కిట్టి వాదు మోయ
వలసివచ్చెను గద యెట్టివారి కేని
ననుభవింపక తీఱ దా యజుని వ్రాఁత. ౩౩

మ. అనఘా! మీకును నన్నుఁబట్టి కద యీ యఖ్యాతి నే మున్ను చే
సిన పాపం బది నాకె పండక తపస్విశ్రేష్ఠు లై యొప్పు మీ
కును బండం గత మేమి యక్కట! కృపాకూపార మీ పాదదా
సినిఁ జేపట్టితి రే! యసహ్యపడి ఛీ! ఛీ! పొమ్మనం జెల్ల దే? ౩౪

మ. అకటా! పృథ్విఁ బురంధ్రులం దొకతె నై యాత్మేశ్వరుం గొల్వ కీ
వికల మ్మైన మనమ్ముతో సతులలో వ్రీడావిహీనాత్మ నై
మొక మేలాగున నెత్తి వర్తిలుదు నా పూజ్యత్వ మిట్లయ్యె నీ
ప్రకటాపప్రథ తీఱు వైభవము సంప్రాప్తించునే నా కికన్. ౩౫

మ. అని యీరీతి ననేకరీతుల నహల్యాసాధ్వి ప్రాణేశు చెం
తను జింతింపఁదొడంగినం గని దయోదన్వంతుఁ డా గౌతముం
డనుఁ బ్రాణేశ్వరి! నీవు నేను నొకలెక్కా? చూడు మెవ్వారికై
నను గర్మానుభవంబుఁ దప్పెడినె? చింతం జెందఁగా నేటికిన్. ౩౬

తే. స్త్రీలకున్నట్లెఁ బురుషుల చిత్త మంత
గా వికృతి నొంద దందురు గద పురుషుల

నందఱన్ విచారణ చేయు టెందుల కిపు
డందు ముఖ్యుల మనము గైకొంద మరయ. ౩౭

చ. స్మరహరునంతవాఁడు శిరసా వహియించె సముద్రపత్ని; నం
బురుహభవుండు నాత్మసుత పొందొనరించెను భార్గవీమనో
హరుని చరిత్రల న్నుడువ నక్కఱ లే దిఁక వీరికన్న నె
వ్వరు ఘను లుందురో వికచపద్మముఖీ! పరికించి చూచినన్. ౩౮

తే. అయిన నా కిప్పు డొక సాధ్వి యనుపమాన
పుణ్యకథ జ్ఞప్తి వచ్చె నో పువ్వుఁబోఁడి!
వినుతు నద్దాని నీకు సవిస్తరముగ
సకలపాపహరమ్ము మోక్షప్రదమ్ము. ౩౯

క. అక్కథ శ్రుతులకు సుధ విను
మొక్క నరపతికి సుతుఁ డగు నురగమ్మున కిం
కొక్క ధరావరుఁ డెఱుఁగక
చక్కని సుత నిడిన సలిపె సతి నరవరుఁగాన్. ౪౦

తే. సత్యవత్యుపాఖ్యాన మన్ సంజ్ఞ దాని
కమరు నని గౌతముఁ డహల్య కాదరమున
నానతీయంగఁ గథ మొద లందికొనియె
వినఁదొడంగె నహల్యయు వీనులార! ౪౧

కథాప్రారంభము

క. శ్రీమల్లికాంబికాముఖ
సోమామృతలోల! సరససురుచిరలీలా!
కామవిజయశీలా! సు
త్రామార్చిత! రామలింగ! రమణీయాంగా! ౪౨

క. శ్రీకాశినాథవంశమ
హాకల్పశ్యామలాంబికాగ్రతనూజ
శ్రీకరనాగేశ్వరచి
త్తాకర్షణ! రామలింగ! యభిషంగా! ౨౩

తే. అవధరింపుము మాయన్న! యనఘ! కథను
గౌతమామృతనిధినుండి కదలు సుధను
ఘోరదురితాద్రిభంజనకులిశవిధను
నిహపరానందపరవశీకృతవిబుధను. ౨౪

## కాశ్మీరదేశవర్ణనము

క. శ్రీరుచిరపుణ్యకర్మ
ప్రారంభోచితమనోజ్ఞభారతవర్ష
క్ష్మారమణీముఖశశికా
శ్మీరము కాశ్మీరము విలసిల్లుచునుండున్. ౨౫

తే. భరతఖండమునకు వాయుభాగమందు
నంబరంబును నోరయుచు నతివిశాల
మగుచుఁ గొన్ని యంతస్తుల నలరు సౌధ
మట్లు కొండలు కోటగా నమరుచుండ. ౨౬

క. రెండవ యంతస్తుగ నిది
యుండును ఫలపుష్పమహీరుహోపవనశ్రీ
మండితమయి వాలాయముఁ
బండెడి సస్యముల మిగుల భరితం బగుచున్. ౨౭

తే. తప్తకార్తస్వరచ్ఛాయఁ దనరు మేను
లచ్చునం దీయు ప్రతిమల ట్లలరు రూపు

లమరఁ దద్దేశవాస్తవ్యు లమరులట్టు
లుండ్రు స్వర్గంబు నా నది యొప్పుచుండు. ౪౮

తే. మంచుగట్టుల భానుబింబంబు చిత్ర
భంగిఁ బ్రతిబింబితం బయి బహువిభాక
రేంద్రచాపంబులం గూర్చి ప్రేక్షకులకుఁ
గన్నువిం దొనరించుచుఁ గరము చెలఁగు. ౪౯

తే. ఇతరదేశముల కమర దింత సొగసు
సహజ మియ్యది దోహదజంబు వాని
దగుట వైభవం బెన్న శక్యంబు గాదు
చాల డౌపాధికము సహజమున కెందు. ౫౦

తే. అది సరస్వతీపీఠికాస్పదము మున్ను
జలమయం బయి గౌరికి సరసి యగుచు
ఖలజలోద్భవసంహృతి కారణముగ
గట్టు తెగఁగొట్ట మాతా నక్కరణి నండ్రు. ౫౧

తే. అరసితీరందగిన వగు నమరనాథు
దేవళంబును బసుపతి దేవళంబు
చెలఁగు మార్తండదేవు దేవళము నందు
నట్టి వెందును గానరా దవనియందు. ౫౨

తే. మంచి కుంకుమమునకు జన్మస్థలంబు
నుత్తమాశ్వములకు గని యురుధనమ్ము
లకు నివాసమ్ము సేలువలకుఁ బ్రసిద్ధి
యలరుఁ గాశ్మీరజనపదం బసదృశంబు. ౫౩

## కనకాపురవర్ణనము

క. కనకమయి గనుకఁ గనకా
ఖ్యను గని యలరారుఁ బుర మొకం డీ యవని

వనితకుఁ దోడవై పోడవై
తనరెడి సౌధములఁ బృథుపథముల రథములన్. ౫౪

తే. ముందు సొగసైన యాకుపసందుచెట్లు
పూలపందిళ్లు వెనుక సంపూర్ణమధుర
జలశిలాకూపములు నవి యలర నట్టి
భవన మొండేని దొరకక దప్పత్తనమున. ౫౫

తే. ఉన్న వన్నియు రథ్యలే యుభయపార్శ్వ
ములను నవ్వానికిని గాల్వ లలరుచుండుఁ
దఱచుగా నొప్పు దీపికాస్తంభరాజు
లిండ్ల పన్నులు లేవు గోహింస లేదు. ౫౬

క. తమతమ సతులకుఁ దమపైఁ
దమతమ పతులకుఁ దమపయిఁ దద్దయు ననురా
గము గలిగి చెలఁగుచుం ద్రను
పమసౌగుణ్యంబు కలిమిఁ బతులున్ సతులున్. ౫౭

తే. శిష్టులు నశిష్టులును గాక శిష్టజనులఁ
గష్టముల పాలొనర్చెడి దుష్టమతులు
ఖలులు విశ్వాసఘాతుకు ల్కలిపురుషులు
గాక ఘను లైన కరణము ల్గలరు పురిని. ౫౮

తే. కరులు ధిక్కృతసర్వదిక్కరు లగుచును
దురగములు మారుతాధికతురగము లయి
రథము లుద్ధురగతి నభోరథము లగుచు
భటులు బలసముద్భటు లయి పరఁగుచుంద్రు. ౫౯

తే. ఎంత వర్ణించినను గొంతకొంత కొఱఁత
యుండనే యుండు దానికి నొడయఁ డగుచు

నలరు ధర్మాంగదవిభుని యనుపమగుణ
ములను వర్ణింప నుత్కంఠ పొడము వినుము. ౬౦

మ. తన దేశమ్మున వేదశాస్త్రముల విద్వాంసుండు గానట్టి వి
ప్రునిఁ గానంబడనీఁడు దేశికులతోఁ బోర్గోరి నిందించు తు
చ్ఛుని దేశమ్మున నిల్వనీఁడు తనకున్ సూఁ డెందుఁ గాన్పించిన
న్మననీఁ డర్థులఁ బోవనీఁడు కడు సన్మానింప కెప్పట్టునన్. ౬౧

శా. చాడీకోరుల మాటల న్వినఁడు లంచం బెవ్వఁడేఁ బట్టినం
జూడం డాతని మోము నాయ మెటు దోఁచుం దీర్చు న ట్లేయెడ
న్వీడం డాశ్రితులన్ భుజిష్యులను సంప్రీతిం గటాక్షించి కా
పాడున్ దీనులఁ బ్రోచు శిష్టులను సంభావించుఁ దా నెంతయున్.

తే. పంటచెఱువులు కాలువ ల్బావు లన్న
సత్రములు దేవళంబులు చదువుసాల
లగ్రహారము ల్మాన్యంబు లా నరేంద్రు
దేశమం దెందుఁ జూచినఁ దేజరిల్లు. ౬౩

శా. ఆ ధర్మాంగదు పత్ని సువ్రత తదీయాస్యంబు చంద్రుండు వా
క్మాధుర్యంబు సుధారసంబు నడ సమ్యఙ్మాద మిందీవర
ప్రాధాన్యాపహరంబు లక్షులు జగత్ప్రఖ్యాత మా యంద మే
వేధస్సృష్టియు కాని యట్టి దెచటన్ వీక్షింపరా దేరికిన్. ౬౪

శా. సౌందర్యం బది యట్టు లుండ విలసత్సౌభాగ్యము న్భాగ్యమున్
మందాక్షంబు నసూయ లేమి యనుకంపాస్ఫూర్తియున్ శాంతియు
న్విందు ల్మే లను రీతిమై మెలఁగుటల్ విద్వత్త సత్యంబు ని
స్సందేహంబుగ నాపె సొమ్ము లనియే చాటింపఁగా నయ్యెడిన్.

ధర్మాంగదుఁడు పుత్త్రకామేష్టి యొనర్చుట

క. ఆ దంపతులకు సంతతి
లే దనునది యొకటి తక్క లే దే లోపం

బేదియొ లోపం బుండక
పో వెంతటివారి కేని భూభాగమునన్. ౬౬

తే. పుత్త్రకామేష్టిఁ జేసినఁ బుట్టుఁ బుత్త్రుఁ
డందు రది చేసి చూత మటంచు నృపుఁడు
పూనెఁ బూనెనో లేదో యా పుడమిఱేనిఁ
దెలిసియో యనఁ జైత్రుండు గొలువ వచ్చె. ౬౭

## వసంతఋతువర్ణనము

సీ. ఏవంకఁ గాంచిన నెఱ్ఱఁగాఁ బుష్పించి
చెలఁగెడి కింశుకక్షితిరుహంబు
లేమూలఁ జూచిన నామోదములు గుప్పు
విరివిగాఁ బూచిన వేఁపచెట్టు
లేచాయఁ గనుఁగొన్న వాచాలశుకపిక
వాఙ్మాధురీఝురీప్రాభవంబు
లేయెడం గనినఁ బుష్పాయుధోత్సవకల
కంఠకంఠీజనగానసభలు
నెచటఁ గనుఁగొన్న సవనంబు లెందుఁ గన్న
సాధుజనులకుఁ జేయు వైశాఖపూజ
లనిలశిశువుల ముఱిపెంబు లభినుతింప
వశము గాదు వసంతుని వైభవంబు. ౬౮

మ. మధువుం గూల్చిన మేటికిం బొడమియు న్మారుండు నిర్లజ్జుఁడై
మధుపశ్రేణిగుణంబుఁ గైకొనుచు నున్మాదంబు పెంపొంద ని
మ్మధువుం జెంది రహించె నా మధుపసంబంధంబు గాకుండునే
మధుసంసక్తికిఁ గారణంబు మధుపు ల్మత్తుల్ భువి న్నిల్తురే? ౬౯

తే. మధుఁడు క్రతుకాల మగుట మన్మథుఁడు తన్మ
ఖాఖ్య నిజనామకలనచే నమరి యుంట

దక్కెఁ బుత్త్రోపలబ్ధికై ధరణిపతికిఁ
జేసినది లేదు ముం దేమి సేయఁగలరో! ౭౦

క. జన్నమునకుఁ గావలసిన
వన్నియు నొనగూర్చుకొనుచు నవనీతలమం
దున్నట్టి సురల నెల్లరఁ
గ్రన్నన రావించి నృపతి కడు ముద మమరన్. ౭౧

తే. తోడునీడగ సువ్రత తోడరి కొలువ
విభుఁడు విధ్యుక్తముగ నిష్టి వెల్లివిరియఁ
జేసి యవభృథస్నానంబుచేఁ జెలంగ
దశరథుని మాడ్కిఁ, దనిసిరి ధరణిసురులు. ౭౨

తే. పుత్త్రకామేష్టి సేయుట పొలఁతికి నెల
తప్పుటకు మొదలగు మొదల్ ధరణిపతికిఁ
దప్పె సంతానలోపచింతాభరమ్ము
సంతసించిరి దానికే సకలజనులు. ౭౩

యజ్ఞాభినందనము

సీ. ఇట్టియజ్ఞంబున కెట్టి పుత్త్రుం డుద
యం బందునో యని యనెడివారు
నెట్టివాఁడో యన నేల? యీ భూభార
మంత మోసెడివాఁడె యనెడివారు
నట్టిఁడే కాఁడు మహాభోగవైభవం
బడుగు క్రిందను బెట్టఁ డనెడివారు
నంతె కా దనుపమ మైన శిరోమణి
నలరుచుండెడివాఁడు ననెడివారు

గానవిద్యారసజ్ఞుం డసమానదేహుఁ
డరినరేంద్రుల సైరింపనట్టివాఁడు
నవతరింపఁగాఁగలఁ డని యనెడివారె
యవని నెచ్చోట నరసిన నగపడుదురు. ౭౪

తే. నీరు మోసినయం మొయిల్ నెలఁత యేమొ
యెప్పుడెప్పు డటంచునే యెదురుచూచుఁ
బుత్త్రునకు దైవ మే క్షణమునకు నెద్ది
కూర్పఁగలఁడో యది తెలిసికొనఁగ వశమె ? ౭౫

శా. ఏయేవారికిఁ బుత్త్రుఁ డన్న విని తా నెంతే ముదం బంది నా
థా! యవ్వారికిఁ బుత్త్రకుండఁట! బళా దైవం బదే వేళ నే
శ్రేయస్కాముఁ గుమారు సద్గుణుఁ గటాక్షింపంగ నున్నాఁడో దు
ర్జ్ఞేయం బన్నఁ జెలంగి సువ్రతను రంజింపించు నాథుం డొగిన్.

తే. తన్ను సేవింప వచ్చిన ధరణిపతుల
సతులతోఁ గూడ వచ్చిన సుతులఁ గాంచి
సువ్రతాదేవి తా నట్టి సొగసుపట్టి
ముద్దుగొను టెన్నఁడో యని ముచ్చటపడు. ౭౭

క. ఈరీతిని ధర్మాంగద
భూరమణుని ధర్మపత్ని పుత్త్రోదయమున్
గూరిచి మనమున నువ్విళ్
లూరుచు నొకకొన్ని దినము లోర్చిన పిదపన్. ౭౮

భోగిరాజావతరణము

సీ. భుజములు లేకున్న భుజగుఁ డన్పేరుచేఁ
బుడమిఁ బ్రశస్తినిఁ బొందువానిఁ

గనరాని కాళులున్ గదు వడి నడ కృష్ణ
పాదంబు లౌదలఁ బరఁగువానిఁ
జెవులు గన్పడకున్నఁ జెవు లున్న చెలువునఁ
గుండలియై వినుచుండువానిఁ
బాడ లేకున్నను బాడెడి పాటల
కుత్సాహపడి తల యూఁచువాని
ఘనశిరోమణిఘృణిజితదినమణి స్ఫు
మారు సుకుమారు మారుతాహారు ధీరు
సువ్రతాదేవి కనె నొక శుభముహూర్త
మందు నవరోధజన మరు దంది కుంద. 28

సర్వజననమునకు అవరోధజనము చింతిలుట

ఉ. సంతతి లేక లేక మన క్ష్మాపతి చింతిలి పెద్ద లెల్ల సి
ద్ధాంతము సేసి చేయు మసి రంచు నొనర్చిన యిష్టి సువ్రతా
కాంతకు నిప్పుడీ ఫలము వచ్చె దుదయించుట కాయె నక్కటా!
యెంతటి కష్ట మేమి తెరు వెవ్వరు దిక్కు సహించు టెట్లగున్?

సీ. అక్కరో! చక్కని చుక్క యౌ మన రాజ్ఞి
కీ దుష్టభోగి తా నెట్లు పుట్టెఁ
జెల్లెలా! యట్లనఁ జెల్లదే మన భాగ
ధేయ మిట్టిదె యని తెలియవలయు
నమ్మరో! మన మట్టు లనుకొన నేల యీ
భోగి సాధారణభోగి కాఁడె
ఔనె యో కొమ్మ! నీ వన్న మాటే యౌఁగి
కాని చిత్తమునకు శాంతి లేదె
యైన మన ముచితవిధుల నాచరింప
వలయు నధిపునకుం దగువారిఁ దగిన

పగిది వేవేగ విన్నవింపంగఁ బంప
వలయు జా గేల? యను కలకలము వొడమె. ౮౧

## సువ్రత సర్పశిశువుం జూచి దుఃఖించుట

క. ఆ కలకలమునఁ బ్రసవ
వ్యాకులయై సొమ్మసిలిన యా సువ్రతయున్
వ్యాకోచనయనసరసిజ
యై కాంచెన్ దనకుఁ బుట్టినట్టి కుమారున్. ౮౨

తే. కాంచి తల వంచి యశ్రువుల్ గనుల నించి
చేయి యెద నుంచి నే మున్ను చేసినట్టి
పాప మాతయు నీరీతిఁ బండె నకట!
దైవమా! యింక నే నెట్లు తాళఁగలను. ౮౩

మ. అకటా! యింతటి పాపమా! యవనిలో సజ్జనుల్ లేరె! వా
రికి నెల్లన్ గడుపుల్ ఫలింపవె! ధరిత్రీనాథు నెయ్యంపు రా
జ్ఞికి నా కిట్లు ఫలించెనే కడుపు ఛీ! ఛీ! యేమి జన్మంబు! చా
వక జీవించితి నేల భూజనులు నవ్వన్ మొండినై యక్కటా! ౮౪

మ. కడఁకన్ సంతతి కేడ్చి కల్గెను ననంగాఁ బొంగి యే వేళనో
కొడుకే పుట్టఁగలం డటంచు మదిలోఁ గొండంత యాసన్ దగు
ల్పడియుండెన్ దుదకీ మహోగ్రతరసర్పం బుద్భవించెన్ గదా
చెడె నా జన్మఫలంబు దీని నెటు రక్షింతున్ గటా దైవమా!

మ. కడుపా తీపి త్యజింపలేను నిను నీ కాయం బటున్నన్ భయం
పడు నీలోకము శోకయుం దలయు గొప్పల్ పాదము ల్లేవు క
న్పడ దేహాకృతియు నార్జవంబు నడ జిహ్వల్ రెండు కాన్పించు నె
వ్వడు బుస్సంచు విసంబుఁ గ్రక్కెదవు నిన్ పోషించు టెట్లో సుతా!

మ. ఖలసర్పం బిది కంటఁబడ్డ నెవఁడేఁ గైకొంచు దండంబు నా
దలపై మొత్తెడి మొత్తకుండ నెటు లిద్దానిన్ నృశంసంబు ని
చ్చలుఁ గాపాడుదు దైవమా! యనుచు నే సంతాపమున్ బొందఁగా
వలసెన్ బుత్త్రుఁడు పుట్టనప్డె సుఖమున్ భావంబులోఁ దట్టెడిన్

మ. అని యీతీరున సువ్రతాసుదతి చింతాక్రాంతయై కుందుచుం
డిన నాలో నొక ఫకిరురాలు నగు మూడ్కిన్ తేనకిన్ దెల్ప నేఁ
డును నీరీతినిఁ జింతిలంబోఁడఁగాఁ గొడుకుల్ పుట్టకున్నట్టి చిం
తను మీ రాజాంగట! యీ విపజ్జలనిధిన్ దాఁటంగ నెట్లయ్యెడిన్.

ధర్మాంగదుఁడు విచారించుట

ఉ. బూరుగపూఁత చూచి కడుఁ బొంగి ఫలించిన నెట్టి పండ్లు సే
కూరును దీని నింక విడఁగూడ దటంచు ననన్యచిత్త మౌ
కీరము చంద మాయె మదిఁ గల చింత యనంత మాయె ని
తీరున నాయె నా దురదృష్టము దృష్ట మిఁక నేమి సేయుదున్.

రాజును మంత్రియు సంభాషించుట

మ. అని ధర్మాంగదభూవిభుండును విషాదాక్రాంతుఁడై మంత్రివ
ర్యుని రావించి సమస్తమున్ దెలిపి సీ యూహాప్రభావంబుఁ గ
న్గొను కాలం బిదె వచ్చెఁ జూపు మన నాకున్ మీ కృపాదృష్టిఁ దోఁ
చినదాని న్వివరింతు నట్లె సలుపన్ శ్రేయంబు గల్గున్ దమిన్.

క. అని మంత్రి విన్నవించిన
విని నరపతి మేను లలర వేగిరపడుచున్
దన వైపుఁ జూచినం గనుఁ
గొని సచివుఁడు చెప్ప మొదలుకొనె నీరీతిన్. ౫౧

తే. ఈ రెఱుంగని ధర్మమ్ము లెందు లేవు
ధైర్యమును వీడఁగూడదు ధరణినాథ!

దైవఘటితంబుఁ గుడువక తప్ప దెట్టి
వారికిని దుఃఖపడిన లాభమ్ము లేదు. ౯౨

తే. ఒక్కరొక్కరి తేజ మొక్కొక్క రీతి
భిన్నజాత్యంగనలఁ జేరి పెంపు చెడక
కారణానుగుణం బగు కాయ మూని
వెలయుటలు గాంచమే! పృథివీతలేంద్ర! ౯౩

సీ. మును బాదరాయణముని శుకి కతన శు
కునిఁ గనె ననునది వినుట లేదె?
హనుమాను తేజంబు నాహారించిన మీను
గనె మత్స్యవల్లభు ననుట వినమె?
యమునలో వసుని తేజము లోఁగొనిన చేఁప
మత్స్యగంధినిఁ గన్న మాట వినమె?
యశ్వనీసంజ్ఞకు నమరవైద్యులు వుట్టి
రన్నది వినలేదె? యంతె కాక
కద్రువకుఁ బుట్టియే గద కాద్రవేయ
సంజ్ఞఁ గాంచిన వఖిలభుజంగమంబు
లైన నిదియును నట్టిదే యనఁగ వలను
కాదు కనరాదు చర్చింపఁ గారణంబు. ౯౪

ఉ. ఐనను మీ రొనర్చినది యప్రతిమంబు సుతార్థయజ్ఞ ము
ద్దానికిఁ దుచ్ఛ మౌ ఫలము దైవము గూర్చునె యెంత మాట యీ
మానవజాతికిన్ భుజగమాణవకం బుదయించు టన్న దె
చ్చో నయినన్ వినంబడుట చోద్యము గాదు తలంచి చూచినన్.

క. ఆలోచింపఁగ మన కీ
లేలీహనరాజువలన లేశంబును గీ

డే లే దని తోఁచెడి నది
మేలే వెఱవకుఁడు మనకు మే లగును దుదిన్. ౯౬

మ. తలపైఁ బొల్చెడి రత్నపున్ రుచుల చందమ్ముల్ విచారించినం
గల గాంభీర్యముఁ జాకచక్యమును వక్కాణింపఁగా విన్ననున్
ఖలకాకోదర మంచుఁ దోఁప దతఁడీ క్ష్మాభారముం బూని వి
మ్ములఁ రంజింపఁగఁ జేయఁగాఁ బొడము నా భోగీంద్రుఁడై యుండెడిన్

చ. ఉరగము పుట్టెనన్న నుడి యొక్కటి మాత్ర మెఱుంగనీక మా
ధరణితలాధినాథున కుదారుఁడు శూరుఁడు కుంభిసింధురం
ధరుఁడు నరేంద్ర దుర్లభుఁడు ధర్మగుణాంచితమూర్తి కుండల
స్ఫురదురురత్నశోభితుఁడు పుట్టె సుతుం డని చాటఁగా నగున్.

ఉ. ఎప్పటి కేది యుక్తమొ యదే యొనరించిన మేలు కానిచో
ముప్పు ఘటిల్లుఁ గాన మన మోముల నేమియుఁ జింత గానసి
కెప్పటికన్న సంతసమె హెచ్చుగఁ దోఁప సుతోత్సవమ్ములన్
గొప్పగఁ జేయఁగావలయు నొబ్బునఁ జాటఁగ నానతీవలెన్. ౯౯

క. నావుడు ధర్మాంగదధా
త్రీవల్లభుఁ డట్ల యానతిం గావింపన్
గావలసిన పను లెల్లన్
వేవేగమ సచివుఁడు నెఱవేర్చెఁ గడంకన్. ౧౦౦

## పుత్త్రోత్సవము

తే. పుడమితేనికి జన్మించెఁ బుత్త్రుఁ డనుచుఁ
బొంగి జను లెల్ల నుత్సవంబుల నొనర్పఁ
దొడఁగి రే యిండ్లఁ జూచినఁ దోరణములుఁ
బసుపులుం గుంకుమంబులుఁ బరిఢవిల్లె. ౧౦౧

తే. విప్రసంతర్పణంబులు వెలవెలఁదాల
యాటలున్ పేరి పాటలు నాటకములు
హరిహరాద్యుత్సవమ్ములు నతిశయిల్లె
నపుడు ధర్మాంగదప్రభు నవనియందు. ౧౦౨

తే. బుద్ధిసాగరుఁ డా మంత్రి భూమిభర్త
చేతఁ గాలోచితంబుగా క్షితిసురులకు
భూరిదానముల్ సేయించి పొలుపు మీఱ
జాతకర్మంబు నాదట సలుపఁజేసె. ౧౦౩

మ. తమ యాస్థానపు జోస్యు లందఱును దత్తజ్జాతకోద్యద్విశే
షములన్ దెల్పిన దేనికిం దెలిపి యుత్సాహంబు సంధించి సో
ద్యముఁడై మంత్రియు భోగిరాజను నభిఖ్యన్ భూమిభృత్సూతికిన్
క్రమ మొప్పార ఘటించి యుత్సవములం గావింపఁగాఁ జేయుచున్.

మ. జను లెల్లన్ గని సంతసించిరి మహోత్సాహంబుతో బంధుగుల్
విని మోదించిరి రాజ్ఞి రాజును జగద్విఖ్యాతుఁ డిమ్మంత్రి చె
ప్పిన చొప్పంతయుఁ దథ్యమౌ ననుచు సంప్రీతాత్ములై యాదృతిం
గనుచుం బెంచుచునుండి రా శిశువు నిస్ఫూర్త్యస్థితిన్ వర్ధిలెన్.

క. చినబసవేశ్వరమానస
వనరుహబాలార్క! భద్రవాహన! కరుణా
ఖని! యేలెటిపాట్పురపా
లనదీక్షా! రామలింగ! లలితసితాంగా! ౧౦౬

క. శ్రీచల్లపల్లిసురపతి
వాచస్పతికాశినాథ భైరవవిద్వ
ద్ధీచోర! కవనరసజిత
మోచాఫల! రామలింగ! బుధజనసంగా! ౧౦౭

క. శ్రీనిడమర్తికులాబ్ధిసు
ధానిధిభూతేశ్వరప్పతనుజబసవరా
జ్ఞానసహంస! దయాంబుని
ధానా! శ్రీరామలింగ! దర్పకభంగా! ౧౦౮

తే. కని రహిం బెంచుకొనిన నా కైతఁగన్నె
నీకు నిచ్చితి నో యన్న నెనరుతోడ
నెట్లు పెంచెదవో చుమీ యేమఱకుము
మమ్ము సంతోషపెట్టు నమస్కరింతు. ౧౦౯

## సీసము

హరితగోత్రోద్భవుం డైన మల్లమపల్లి యతుయగురునకు నగ్రిమాత్మజుండు
గణార్చావ్రతస్థుఁడు సాధు నా హీరమల్లయాఖ్యారాధ్యతల్లజునకు
భ్రమరాంబకును దనూభవుఁడ విద్వత్సింహుఁ డౌ రామ
లింగయ కవరజుండ మల్లికార్జునుఁడ శ్రీమల్లికార్జున
కృపాయత్తకవిత్వుండ నైన నాదు సత్యవత్యు
పాఖ్యానసంజ్ఞాలసత్ప్రబంధమందున
మొదటి యాశ్వాస మిట్లు ముగిసె
నాచంద్రతారకముగఁ దనర్చు
నట్లు సేయుత దీనిఁ
జంద్రార్ధమౌళి.

---

శ్రీరస్తు

# సత్యవత్యుపాఖ్యానము

## ద్వితీయాశ్వాసము



శ్రీమల్లికాంబికాముఖ
తామరసరసజ్ఞషట్పదా! పూజ్యపదా!
కోమలకవనానందిత
ధీమజ్జనరామలింగ! ధిక్కృతభంగా! ౧

క. శ్రీరామాధవ జగదుప
కారకవిదితాంధ్రపత్త్రికావిభుబుచ్ఛ
య్యారాధ్యతనుజనాగే
ద్ధీరంగా రామలింగ! దివ్యనిజాంగా! ౨

తే. అవధరింపుము మాయన్న! యవలి కథను
గౌతమసుధాంబునిధినుండి కదలు సుధను
ఘోరదురితాద్రిభంజనకులిశవిధను
నిహపరానందపరవశీకృతవిబుధను. 3

భోగిరాజు వినోదములు

మ. అటు లా భోగిమహీవిభుండు దన కత్యంతమ్ము సౌఖ్యమ్ము న
క్కటికమ్మౌనుచుఁ దల్లిదండ్రు లెపుడుం గావించుచుండఁగఁ జెం
గట గారా మలరంగ నాడుకొనుచుం గాఁగింటికిన్ జేరుచున్
గిటుకున్ వీడుచు ముద్దువెట్టుచును సంగీతమ్ములన్ జొక్కుచున్. ౪

శా. లీలాపుష్పవనీవిహారముల నోలిం జేయుచున్ స్వర్ణపుం
డోల లూఁగుచుఁ గోకిలాదిసుఖగోష్ఠుల్ గాంచి శ్లాఘించుచుం
గేళాకూళులఁ గుల్యలందును జలక్రీడల్ రహిన్ సల్పుచుం
బాలం గ్రోలుచు గాలి సోఁకుచుఁ బూపాన్పుల్ ప్రవేశించుచున్

సీ. తన హాజారమ్మునన్ దరుణీవతంసముల్
లలి మీటు వీణె పాటలను వినుచు
దన సన్నిధినిఁ జేరి వనితామణు లొనర్చు
మృదుసపర్యల కెద మెచ్చికొనుచుఁ
దనముందు మణిపీఠి నునిచిన సురభివ
స్తువుల వాసనలను జూచికొనుచుఁ
దనచుట్టు నిలువుటద్దములలోఁ దనరారు
తన రూపమును గనుంగొని చెలఁగుచుఁ
జిత్తవృత్తికిఁ దగినట్లు చిన్న పెద్ద
మేను లూనుచు శిరమున మెఱయు రత్న
మబ్రపుం గాంతు లీనుచు నఖిలదిశల
నలరఁ జేయంగ నిచ్చలు నమరుచుండు. ౬

సీ. మౌనియై యెన్నండు మాటలాడఁడు గాని
యాడెడు మాటల కర్థ మెఱుఁగు
భోగియై స్త్రీలతోఁ బ్రొద్దు పుచ్చునె కాని
భోగమే యెఱుఁగఁ డే బోటివలనఁ
గోపియై యేవేళఁ జూపట్టునే కాని
యపకారబుద్ధి రవ్వంత లేదు
జ్ఞానియై యెవరినో ధ్యానించునే కాని
యొక్క నిముసమైన నూఱడిలఁడు
తప్పకుండంగఁ దాఁ ద్రిసంధ్యలను బద్మ
బాంధవునకు నమస్కృతుల్ భక్తితోడ

సలుపుచుండును సతతంబు సవిధవర్తి
మీనసేత్రల భక్తిని మెచ్చుచుండు. ౭

ఉ. సుస్వర మొప్పఁగా నవలఁ జోద్యముగా నెవ్వరేని గాని నా
గస్వర మెంత దూరమునఁ గానియు నూఁదినయేని వేమణీ
భాస్వర మైనయాపడగ బాయగ నెత్తి నిమీలితాక్షుఁడై
అస్వధికుండు మైమఱచి యాడును జూపఱ సంతసిల్లఁగన్. ౮

తే. పాముస ట్లించుకేని యపస్వరంబు
వచ్చెనేనియు నేలపైఁ బడగ గొట్టి
జను లనెడి " వేత్తిగానరసంఫణీ " తి
వాక్యమును నిక్కువము సేయు బాలకుండు. ౯

తే. ఇట్టు లా రాజు పట్టి యా పుట్టమునికి
పట్టు దిట్టరి తన కున్న గుట్టు చెడని
యట్టు లంతిపురిని గనిపెట్టి యుండ
నెట్టి నిరువదేనేండ్లు లప్పట్టునందు. ౧౦

రాజులు తమ కుమారికల చిత్రపటముల నంపుట

క. తమతమ కొమారితల కుప
యమ మొనరింపంగఁ గడఁగు నవనీపతు లు
త్తమగుణఖని యని యవ్విభు
కొమరునకై పటము లంపుకొనఁ దొడఁగి రొగిన్. ౧౧

క. ఆ పటముల రాకన్నెల
రూపమ్ముల వారివారి రుచిరేంగితముల్
రూపించెడి శ్లోకమ్ముల
భూపతి గని యిట్టు లనియెఁ బొక్కుచు సతితోన్. ౧౨

మ. అకటా! ప్రేయసి! నీకు నాకుఁ గల పుణ్యం బెల్ల నీరీతిగాఁ
బ్రకటం బయ్యె నటంచుఁ జింతిలెద మా ప్రారబ్ధ మట్లుండ నిం

కొకఁ డే రీతిని సంభవించినది యెట్లో దీని లంఘించు టిం
చుకయుం దోఁచదు దారి మానసము సంక్షోభించెడిన వింటివే.

శా. ఆయా రాజులు పంపుకొన్నయపి యెూ యజ్ఞాక్షి వీక్షించితే
యీాయా చిత్రపటంబు లాత్మజలవం నేమేమొ వ్రాయించినా
రాయావ్రాంతల రీతు లా మొకుపు లాయాయీా విలాసంబులున్
హా! యే మంచుఁ దలంచుకొన్న మెయి నిర్రై పోవు వే యేటికిన్.

మ. అనినన్ సువ్రత దుఃఖ మాపికొని ధైర్యం బూని ప్రాణేశ్వరుం
గని మీారే యిటు లింత దుఃఖపడినన్ గర్జం బిఁ కే ముందు మా
కును మీారే కద ధైర్యము న్నడున మీాకుం జెప్ప వే యున్న దే
మన మంత్రిం బిలిపించి చెప్పుఁ డితఁడే మార్గంబుఁ జూపించెడిన్.

క. నావుడు ధర్మాంగదధా
త్రీవిభుఁడును దనదు మంత్రి ధీసాగరునిన్
గోవిదమణి నుచితగతిన్
రావించి సదసి నుపహ్వారమ్మున ననిమెన్. ౧౬

తే. బుద్ధిసాగర! మాకు నీ బుద్ధి కన్ను
దాని విడిచిన నేదియుఁ గానరాదు
వసుమతీశుల కన్నెల పటము లెల్లఁ
గాంచుచుం డివి కర్జమ్ముఁ గాంచినావె? ౧౭

సీ. నెల యించుమిం చయ్యె నేఁటికిఁ జోళభూ
కాంతుఁ డంపెను గన్యకాపటంబు
మొన్న మొన్న నె కదా ముఖ్యబంధుం డైన
కర్ణాటవిభుఁ డంపెఁ గన్నె పటముఁ
నాఁటు మొన్నఁ గాఁబోలు వంగదేశాధీశుఁ
డసమానుఁ డంపెఁ గన్యాపటంబు
నిన్న ప్రొద్దున నె కా! కన్నువిం దొనరించె
నేపాళుఁ డంపు కన్నియ పటంబు

ప్రొద్దుననె చేరె సౌరాష్ట్రభూమిజాని
పంచియున్నట్టి కన్యకాపటముఁ జూడు
వీనికిం జాబు లేఁదగు వీలుఁ జూడు
మున్న గౌరవ మూఁడిపోకుండ నేఁడు. ౧౯

## రాజకన్యల జన్మపత్త్రికలఁ బరిశీలించుట.

మ. అనుడు న్మంత్రి మహీతలేశ్వరుల కన్యాజన్మపత్త్రంబు లె
ల్లను దెప్పింపుఁడు జోస్యు లందఱను బిల్వంబంపుఁ డందందుఁ దే
లిన యంశంబుల సావధానముగ నోలిం జూత మామీఁదటన్
మన మూహింతము కర్జ మన్న నృపుఁ డమ్మాడ్కిన్ రహిన్ స
క. జ్యోతిర్వేత్తలలో వి [ల్పెఁడున్.
ఖ్యాతిని గన్నట్టివార లందఱు నా భూ
నేత యొనర్చిన హ్వాతికి
నేతెంచి యుచితబహుమతు లెనసి ముదితులై. ౨౦

శా. తా మా రాజకుమారికాజననపత్త్రమ్ముల్ గనుంగొంచు లో
నేమేమో యనుకొంచు నంగుళులచే నేమేమొ లెక్కించుచున్
యూమం బొక్కటి పుచ్చి సక్రమముగా నాయా విశేషమ్ములం
భూమీంద్రుం గని చెప్పఁగాఁ దొడఁగి రామోదంబుతో నీగతిన్.

సీ. కర్ణాటరాజన్యకన్య యీ కనకాంగి
సౌభాగ్య మన్న నీ చాన సొమ్ము
నేపాళవిభుని కన్నియ నీలకుంతల
నిఖిలవిద్యలయందు నిరుపమాన
అంగభూమీజాని యాత్మజ మోహినీ
దేవి రూపమున దేదీప్యమాన
చోళదేశాధిపు సుత యీ విశాలాక్షి
మెట్టినచోటెల్ల మేరు వగును

సాధ్వి సౌరాష్ట్రవిభుతనూజాత సత్య
వతి మహాద్భుతపూతచరిత మనోజ్ఞ
సకలశుభదలక్షణసముజ్జ్వలలు వీర
లధిప! యందులఁ గల విశేషాంశము లివి. ౨౨

క. అని విన్నవించి జోస్యులు
జనపతిచే నుచితరీతి సన్మానితులై
చని రాదట సచివుం డి
ట్లను ధైర్యము మీఱ నోలి నధిపునితోడన్. ౨౩

రాజకన్యలకుఁ గానుక లంపుట.

సీ. కనకాంగికిన్ రత్నకంకణంబులు మంచి
వంపించి ప్రేమఁ జూపింపవలయు
మోహినీదేవికి మొన్నటి మంచి ము
త్యాలహారమ్ముల నంపవలయు
నీలకుంతల కొక్క మేలైన మణివీణ
నంపించి కడు గారవింపవలయు
నల విశాలాక్షికి ననుకూలమై తగు
బన్నసరం బొండు పంపవలయు
సత్యవతి కభిజ్ఞానలసన్మణి యువ
రాజముద్రిక నంపి విరాజమాన
మైన శుభలేఖ యొకటి రత్నాంగదునకుఁ
బంపనగు నని తోఁచు నో పార్థివేంద్ర! ౨౪

భోగిరాజవివాహప్రయత్నములు.

ఉ. నావుడు మానవేంద్రుఁడు మనమ్మున నాతనిధైర్యసాహసే
హావిభవప్రపత్తులకు నచ్చెరు వొందుచు నిట్లు పల్కె నో

కోవిద! మంత్రిగీష్పతి! యకుంఠితబుద్ధిబలప్రభావ! నా
కీ వొక నావవై తనర నిట్టి విపత్తుల దాఁటు టబ్రమే! ౨౫

శా. నీ వేవేవి యొనర్చు మందువో యవే నేఁ జేయుచున్నాఁడ నా
దేవుం డెన్నఁటికీ సుదుస్సహవిపత్తిన్ దీర్చ నున్నాఁడో యీ
నా వైకల్య మడంగు టెన్నఁటికొ యన్నా! యిట్టి కష్టమ్ము నెం
దేవారుం గనకుండ్రుగాత మిఁక ముందేనిన్ సుఖ మ్మబ్బుతన్.

క. అని నుడువుచు సచివుఁడు సె
ప్పిన పగిదిని జేయఁబూని పృథివీపతు లం
పినవారిని గౌరవముగ
ననిపి తలంచుకొనిన పను లన్ని సలుపుచున్. ౨౬

శుభలేఖ.

తే. తమ పురోధల రప్పించి తగిన శుభము
హూర్తమందున శుభలేఖ నొనర మంత్రి
వరుఁడు సెప్పుచుండంగ వ్రాయునట్లు
చేసె శ్రీరస్తు శుభమస్తు చెలఁగుచుండ. ౨౭

సీ. శ్రీకరసౌరాష్ట్రసింధుమేఖల నేలు
చేవకానికి సాధుసేవధికిని
శ్రితజనావనసుదీక్షితునకు నిత్య స
త్యవ్రతునకు మహోదైర్యగిరికి
ననుపమానప్రతాపాదిత్యమూర్తికి
నరినరవరకరిహరణహరికి
అఖిలావనీశదత్తాఖిలబిరుదున
కప్రతిహతునకు ననుపమునకు
శ్రీయుతునకు రత్నాంగదక్షితిపతికి న
నామయప్రశ్నపూర్వక మగు పగిదిని

వ్రాయు శుభలేఖ కాశ్మీరవసుమతీశుఁ
డతులబిరుదాంకితుండు ధర్మాంగదుండు. ౨౯

శా. బావా! మీరలు "మాతనూజ"నని పంపన్ జన్మపత్త్రంబు సం
భావింపం దగుఁ జిత్రపుంబటము సమ్యఙ్మోదముం గూర్చె నే
వేవో వ్రాయఁగఁ జేసినా రవి యెంతేఁ బ్రేమఁ గల్పించు మా
భావ మ్మొక్కటి చెప్పనున్న యది సంబాధమ్ము సిద్ధాంతమే. ౩౦

మ. మణులం బోలిన రాకొలమ్ములను జన్మం బెత్తి పై సర్వస
ద్గుణసంపన్ను లటంచుఁ బేరువడు మీకు న్మాకు సంబంధమే
గణనీయం బగు నందులోన వరుఁడుం గన్యాలలామంబు స
ద్గుణసంపన్నులు చెప్పనేటి కిఁక మీకున్ మాకు మేలయ్యెడున్.

మ. అనుచారమ్ములు మీకురా దనుచు మా యాచార్యవర్యుల్ పునః
పునరాజ్ఞల్ ఘోనరించుచుండిరి మనస్స్ఫూర్తిన్ వివాహోత్సవం
బును జేయంగను మాకు వేడుకయు; పూర్వుల్ కత్తికిం బాసిక
మ్మును గట్టించిరి పెండ్లినాఁటి మురిపెమ్ముల్ ముచ్చటల్ నూనుచున్.

మ. ఇపు డారీతుల నెల్ల నొల్లరు కదా! యీనాఁటి కాంతామణుల్,
నృపులై పుట్టియు లొంగి రంగనల కం చేవాగు వాక్రుచ్చినన్
ద్రప చూడఁ గాదె? యదెట్టులైనఁ గులమర్యాద న్విడంగూడ ద
న్న పదం బొక్కటి నిక్కమౌను బయిసన్మాహంబుఁ జూడందగున్.

ఉ. ఇంకొక మాట మా కొమరుఁ డెన్నఁడు నేరికిఁ గానరాఁడు మీ
నాంకుఁడు మీకు రూపున మృగాంకుని గేరుఁ దనూవిభూతిఁ జ
క్రాంకవిరాజితుండు గరుడాంకపదాంబుజశేఖరుండు లో
శంక దొలంగి మీరుఁ దగు సన్నహవం బొనరించుకొం డొగిన్.

తే. మేము పంపిన పెద్దల మీ పురోహి
తులను నొకచోటఁ జేర్చి సంతుష్టి గూర్చి
శుభముహూర్తంబు వెట్టించి సొబగు మీఱ
మాకు శుభలేఖ నంపుఁడీ మరల మీరు. ౩౫

తే. మా చిరంజీవి సూర్యసమస్కృతులను
జేయు ముఖ్యప్రద్దులను బస ల్సేయునెడల
శుద్ధజలపూర్ణసరసులఁ జూచి చుట్టు
దడులఁ గట్టింపవలయును దాన మాడ. ౩౬

శా. మా యేనుంగులకుం దురంగములకున్ మా సేనకున్ మాకు మీ
రే యాయా బసలందు మార్గములయం దేర్పాటుగా నన్నియున్
జేయంగావలె మంచిమంచి ప్రపలన్ సిద్ధమ్ములం జేసి పా
నీయమ్ముల్ తగు రీతి నుంచవలెఁ జుండీ పెండ్లికిన్ వచ్చుచోన్.

తే. తప్ప కీ రీతి సల్పుఁడు తరలి వత్తు
మఖిలబంధులు మిత్త్రులు నాశ్రితులును
గోవిదులును సైన్యంబులుఁ గొలువ మేము
మీరు పెట్టెడు లగ్నంబు మీఱకుండ. ౩౭

క. శ్రీరస్తు శ్రీరస్తు
శ్రీర స్తని వ్రాసి చదువ సేబా సనుచున్
జే రత్నాంగుళిముద్రిక
చే రంజిలఁ జేసి పసుపుఁ జల్కించి వెసన్. ౩౮

తే. ఘుమఘుమంఘుమలాడంగ గుంకుమంబు
నత్తరువుఁ గల్పి కై సేసి యనుపమాన
రత్నయువరాజనామవిరాజమాన
మైన యూర్మికతో దాని నమరఁ గూర్చి. ౪౦

తే. మణికరండమ్మునం దుంచి మహిసురాగ్ర
గణ్యు లొ నిర్వురం బిల్చి గారవించి
యనఘులార! శ్రీరత్నాంగదావనీశ్వ
రునకు నిద్దానిఁ గరుణింపుఁ డనుచు నిచ్చి. ౪౧

తే. భటులు తోడుగ గుఱ్ఱంపుబండి నిచ్చి
పండ్లు మొదలగునవి నింపి పంపె నపుడు

శకునములు మంచి వాయెను సంతసించి
రచటఁ బటముల నంపిన యవనిపతులు. ౪౨

ఉ. అందని పండ్ల కాసవడి హస్తము లెత్తిన పొట్టివార లే
చందమొ యంతె కాక తనుజాతలకుం దగు కాన్కలంపి రం
చందఱు రాజులున్ ముదము నందిరి వారి తనూజ లందఱున్
డెందములందు సిబ్బితి మునింగి ప్రసన్నతఁ జెంది రాదటన్. ౪౩

క. రత్నాంగదుండు కన్యా
రత్నం బగు సత్యవతియు రాకొమరు శిఖా
రత్నోదయమును సద్గుణ
రత్నౌఘంబును దము ననురక్తిని ముంపన్. ౪౪

శా. ఆ రాజన్యుఁడు వాని సోయగము ధైర్యం బా మహాశౌర్య మ
య్యారే! తియ్యనివింటివాఁడొ! కనకాహార్యంబొ! క్రౌంచారియో!
యా రాజార్ధవతంసుఁడో! కరుణ నాహా! యిట్టి సౌగుణ్య మే
మే రాజాగ్రణులందుఁ గాన మతని న్వీక్షించు టెట్లబ్బెడిన్. ౪౫

శా. వీరున్ వారును వాని సద్గుణములన్ వేనోళ్ళ మా సన్నిధిన్
దోరంపుంగతిఁ జెప్పఁగా వినుచు సంతోషించుటే కాని యా
కారమ్ముల్గని యే మెఱుంగుదుమె! విఖ్యాతాఖ్యులే యంచు నే
వారుం జెప్పరు రింతకున్ ఘటన దైవం బెట్లు కావించునో. ౪౬

మ. అని లోలో ననుకొంచు భూవరుఁ డమాత్యజ్యేష్ఠు రావించి యి
ట్లను నో మంత్రిబృహస్పతీ! మనము కన్యాజన్మపత్త్రమ్ముఁ బం
పిన దెన్నం డిది యేమి నేఁటికిని దద్వృత్తాంతమే లేదు పో
యినవారేనియు రారు కారణము నూహింపఁ వలె న్నానృపుఁడున్.

మ. విని యా మంత్రి యొకింత చూచి యధిపా! విన్నారె! యీనిన్న మొ
న్ననె యాయా యవనీశకన్యలకుఁ గాన్కల్ మంచి వంపించినా
రని విన్నాఁడ విలంబ మియ్యెడల శ్రేయం బంచుఁ గాన్పించు మీ
రనుమానింపఁగ నేల? సత్యవతి కల్యాణంబు చేకూరెడిన్. ౪౮

## సత్యవతి భోగిరాజుగుణముల కలరుట.

చ. అన విని సంతసించి మనుజాధిపుఁడున్ సచివుండు నిష్టగో
ష్ఠిని సదసిన్ వసింపఁగ నశేషసుదృగ్జనసార్వభౌమి యా
చును జెలువొందు సత్యవతి సోయగపుంగను లైన నెచ్చెలుల్
తనుఁ గొలువంగ నంతిపురిఁ దద్దయు రాకొమరుం దలంచుచున్.

తే. చెలులు తన సన్నిధినిఁ జేరి చేయుచున్న
సేవలను జిత్తగింపదు చేసి శ్రుతిని
మీటఁ బట్టిన వీణియ మీట దెవరు
పలుకరించిన నొక పల్కుఁ బలుక దపుడు. ౧౦

తే. ఎంత చిత్రంబొ చిత్త మా యింతి కెపుడుఁ
గాంచనట్టి రాకొమరునిఁ గానుపింపఁ
జేసి మోహంబుఁ గల్పించి చింతిలంగఁ
జేసె నిఁక నేమి సేసినన్ జేయఁగలదు. ౧౧

తే. లోకు లనుకొనఁగా విన్న రాకొమరుని
కొన్ని గొనములతో మఱికొన్ని యూహఁ
గూర్పఁగా నాత్మగతమునఁ గోమలాంగి
పరితపింపంగఁ దొడఁగె నిప్పగిది నపుడు. ౧౨

తే. కడిఁది తలకట్టు గుప్పెఁడై నడుముపట్టు
కనులు వీనులు నొకటిగాఁ గలిసికట్టు
చందురుని నెట్టు మే నొర చక్కఁదనము
పొం దటన్నను నీతోడి పొందె పొందు. ౧౩

శా. ఔరా! రాజకుమార! నీదు సుకుమారాంగమ్ము చిత్తమ్ములోఁ
జేర న్నా మెయి పుల్కరించు వణఁకున్ స్వేదమ్ముతోఁ గూడి చె
న్నారుం గన్నులవిం దొనర్చుఁ దటి నే మానో సమాశ్లేషసా
ఖ్యారంభమ్మున నేమి కాఁగలదొ! యోహో! చెప్పఁగా శక్యమే?

శా. ఏ కాలంబును స్నానసంధ్య లొకయుం జేయన్ దలంచ స్త్రీలకున్
కే కావించెదవంట! సేవకులయం దే లోపమేనిం దయా
శ్రీకంఠుండ వనంగఁ బ్రోతువఁట! నిన్ సేవించు కాలం బెఁకన్.
జేకూరంగల భాగ్య మెన్నఁటికొ! గాసి న్నెట్టుటె నాఁటికో! ౫౫

శా. గాన మ్ముండిన నన్నపానములలోఁ గర్జింబు లే దంత్రు నే
వీను ల్సంతసిలంగ నేర్పుమెయి నీ వీణ న్రహిన్ మీటినన్
మే నుప్పొంగునొ బస్సనే యునునొ తా మిన్నందు చూఁగాడునో
గానాభ్యాసము సేసినంతులకుఁ గల్గంజెల్లు నీ భాగ్యముల్. ౫౬

మ. సరసంపుంగతిఁ గైత మల్లఁగల నే శబ్దాంబులో నేమిత
స్వరయంగల్గునొ యంచు భీతి యగు ధైర్యం బంతలోఁ గూర్చు నే
సరసుల్ తప్పులు పట్ట నెన్న నుడి శాస్త్రం బెల్ల శోధించు నా
గురుతేజున్ గొలువంగ నేరుతును కోర్కుల్ మీరల స్మితశీన్. ౫౭

క. ఈరీతిని సత్యవతీ
నారీరత్నంబు తన మనమ్మున నా భూ
మీరమణకుమారుని నిడి
తీరని మోహాబ్ధి మునిఁగి తేలుచునుండన్. ౫౮

క. గావారికుఁ డొకఁ డా ధర
ణీవరు సభ కేఁగుదెంచి నిలువంబడి యో
దేవా! ధర్మాంగదపృ
థ్వీవరు కడనుండి యరుగుదెంచిరి విప్రుల్. ౫౯

క. అనవుడు జనపతి మన మా
పినవారలొకో యనంగ విని వారే కా
రని యతఁ డనినను నెమ్మన
మునఁ బొంగుచు వారి నిటకుఁ బుచ్చు మనంగన్. ౬౦

క. చని గావారికుఁ డవ్వా
రినిఁ గొనివచ్చెను విభుఁ డలరెను మనమున వా

రును మహీపతికినిఁ దగు దీ
వన లిడుచును మెఱయు రవల బరిణ నొసఁగినన్. ౬౧

చ. అలరి ధరాతలేంద్రుఁ డుచితాసనము ల్గనుసన్న నిచ్చినన్
జెలఁగుచుఁ గూరుచుండి యటఁ జేసిన సత్కృతు లెల్ల తేనికిన్
దెలిపి బహూకృతు ల్వడసి దేవరవారి యనుజ్ఞ యేని నిం
డులకడ కేఁగి వత్తు మనుడున్ నృపుఁడుం దలయూఁచె నాదటన్.

మ. చని రా విప్రులు రాజు మంత్రిఁ గని యుత్సాహంబు దీపింప నీ
వనిన ట్లామెను రత్నపుంబరిణెఁ దీయన్ వచ్చు నం దేమి యుం
డును మూడన్వల నన్న మంత్రియును దోడ్తో నట్లు చేయం గనుం
గొనన య్యెన్ శుభలేఖయున్ నవయువత్యోణీమ్రణీముద్రయున్.

తే. వారియందలి మోహానుబంధమునవో
యవి నిజమ్ముగ నట్లు యున్నవియొ కాని
యెంత చూచినన్ దృష్టి యొకింతయేనిఁ
గొలుప వంతటివారికిన్ గూడ నహహ! ౬౪

తే. ఒండొరులు గూర్మి మీఱంగ నూర్మికాశు
భోత్తరోత్కృష్టసుగుణసంపత్తు లెల్లఁ
జెప్పుకొనుచునె యొకకొంతసేపుఁ గడపి
సంతసమ్మునఁ జనిరి శుద్ధాంతములకు. ౬౫

ఉ. అంతట గుప్పు మంచుఁ బుర మంతయు నుక్కట నిండె నీ శుభో
దంతము రత్నపుంబరిణ దాఁగి నడల్చిన హెచ్చు సౌరభం
బంతటఁ గ్రమ్మినట్లు విభుఁ డంతిపురిం గల కాంత లందఱున్
సంతసిలంగఁ జేసి యొక చక్కని మూర్తమునందుఁ గన్యకన్. ౬౬

తే. విహితరీతినిఁ గూర్చుండఁ బెట్టి మంగ
ళస్వనంబులు పరిఢవిల్లంగఁ గుంకు
మంబుబొట్టుంచి యువరాజమణిమయాంగు
ళీయకము కన్నె వ్రేలఁ గై సేయఁ జేసి ౬౭

తే. కన్నులారంగఁ గాంచుచుఁ గన్నె చేతఁ
బుణ్యవిప్రాంగనలకుఁ దాంబూలగంధ
ఫలసువర్ణంబు లిప్పించి పరమహర్ష
మునఁ జెలంగుచు నా దినమ్మును గడపుచు. ౧౮

తే. తమకు శుభలేఖఁ దెచ్చినధరణిసురుల
విందు లరయుచు నుపయమవిధికిఁ దగిన
శుభముహూర్తంబు యోజింప జోస్యులకును
వారికిని సమావేశంబుఁ గోరి చేసి. ౧౯

క. చక్కనిగానములచే నుతి
కెక్కుచు నవగుణ మొకింతయేని నెమకినన్
జిక్క కిలరు సుముహూర్త
మ్మొక్కటిఁ బెట్టించి వారి నోలిఁ దనుపుచున్. ౨౦

సీ. అటనుండి వచ్చిన యవనిదేవతలకు
నధికసత్కారంబు లాచరించి
వారితో వచ్చినవారికి వేర్వేఱ
బహుమతు లిప్పించి వారికోన
తమ పురోధలచేతఁ దగు రీతి శుభలేఖ
ధర్మాంగదావనీధవున కనిపి
శ్రీమతియును జిరంజీవిని యహా సత్యవతి
వివాహ మ్మని ప్రచురపఱచి
బంధుమిత్రవర్గముల కాహ్వానపత్రి
కలను బంపించి పురి నలంకారవిధులఁ
దీర్చి పెండ్లివా గేతెంచు తెరువునందు
వారు గోరిన తీరున భద్రపఱచి. ౨౧

మ. తమ యేనుంగులు గుఱ్ఱముల్ రథము లుద్యద్యోధవర్గమ్ము సి
ద్ధము సేయించి శతఘ్నికల్ సముచితస్థానంబులం దుండఁజే

సి మహామోదము మీఱ బాంధవహితశ్రేణీయుతుం డౌచు గా
నముచేఁ గాలము పుచ్చుచుండె శుభలగ్నమ్మున్ బ్రతీక్షించుచున్.

మ. అట ధర్మాంగదభూమిభర్తయు నమాత్యప్రౌఢి యీదారి సం
ఘటియించెన్ దుద కేమి కాఁగలదో వక్కాణింపఁగాఁ జెల్ల ద
క్కట! రాకన్నెకుఁ బాప మెంత వెతఁ గల్గం జేయఁగా నాయె న
క్కౌశికం బన్నది వీడఁగావలసె నా కర్జంబుకై నేఁటికిన్. ౭౩

సీ. పాడమక పాడమక పుడమిఱేఁడుల కొల
మున నొంపెయఁడ నోచుఁ బొడము టేల
పొడమిన నేమి నా పూర్వకర్మం బేమొ
యొక బిడ్డఁడును గల్గకుండు టేల?
కల్గకుండిన నేమి కాంతతోఁ బొక్కుచుఁ
బుత్త్రకామేష్టికిఁ బూను టేల?
పూని చేసిన నేమి పుత్త్రుఁడై నాకు నీ
భోగిరా జిమ్మెయిఁ బుట్టు టేల?
పుట్టినను నేమి భోగిని బుట్ట విడిచి
పెట్టకుండంగ గుట్టుగాఁ బెనుచు టేల?
పెనిచినను నేమి సాటి భూవిభులు నాకు
నాత్మజల చిత్రపటముల నంపు టేల? ౭౪

తే. అంపిరే చూడు మఖిలధరాధినాథ
కన్యలకుఁ బోలెఁ గాక యీ కన్య కేల
కలితయువరాజముద్రికఁ గాన్క నంపి
యుంటి సచివుండు నుడివెనే నోడ కకట! ౭౫

తే. తమకుఁ గల్గెడి నిఖిలకష్టముల నోర్చి
యితరులకు మేలు చేసెద రెల్ల సుజను
లేమి యెఱుఁగని రాకూన కిట్టి కష్ట
మెఱఁగి నేఁ జేయఁబూనితి నేటి బ్రదుకు. ౭౬

తే. అనుచు లోఁ గుందుచుండ రత్నాంగదావ
నీంద్రు కడనుండి బ్రాహ్మణు లేఁగుదెంచి
రధిప! యని మ్రొక్కఁ డేతెంచి యనిన వినుచు
విభుఁడు గనుసన్న వారి రప్పింపు మనుడు. ౭౭

తే. అతఁడు చని వారి నంపిన నవనినాథుఁ
డుచితగతి గౌరవించె నా యుర్వీసురలు
పొంగి దీవించి శుభలేఖ భూవిభునకు
నొసఁగి సత్కృతులై సెల వొంది చనిన. ౭౮

క. మనుజాధీశుఁడు తన సచి
వునితో శుభలేఖఁ జూచి పూనిన పనికిన్
వెనుగొసిన లాఘవ మగు
నని గాంభీర్యం బమరఁగ నను నాతనితోన్. ౭౯

తే. బుద్ధిసాగర! నీవు నీ బుద్ధి కొలఁది
నరసి నా కేమి సెప్పెదో యట్ల చేయ
సిద్ధముగ నున్నవాఁడ సంసిద్ధ మయ్యెఁ
జింతితార్థంబు ముందేమొ చెప్పు మనుడు. ౮౦

శా. దేవా! మీకు నెఱుంగరానియది ధాత్రిం గల్గునే నన్నుఁ బ్రే
మావేశంబున నిట్లు పల్కెదరు సత్యం బాను మీ మాట మీ
సేవం జేసిన నేమి తక్కువ జగజ్జేగీయమానప్రభా
వావాసంబు కళత్ర మబ్బె యువరాజాదృష్ట మింతింతయే?. ౮౧

తే. పొందవలసిన కష్టముల్ పొందినార
మింక మన కిట్టి కష్టంబు లెపుడు రావు
వచ్చినను వెంటనే తీఱు వసుమతీశ!
సంతసముఁ జూపఁదగినట్టి సమయ మిదియు. ౮౨

సీ. మన మానతిచ్చిన మాదిరి నగరంబుఁ
గైసేసిరో లేదో కాంచవలయుఁ

పెండ్లికి నిటనుండి వెడలునాఁటికి నేని
జుట్టపక్కములు రాఁ జూడవలయుఁ
గవుల వైణికులను గాయకులను వార
వనితల బ్రోత్సాహపఱుపవలయు
నిఖిలమంగళతూర్యనివహంబుతోఁ గూడ
విప్రదంపతుల రావింపవలయు
నేనుఁగులు గుఱ్ఱములు తేరు లెలమి భటులు
గొలువ గుఱ్ఱపుబండిలోఁ గుట్టు సెడని
యట్టు లవరోధజనములు చుట్టు నుండఁ
బెండ్లికొమరునిఁ గూర్చుండఁ బెట్టవలయు. ౧౩

తే. తరలి పోవలె శుభముహూర్తంబు గూడ
వ్యవధి లేకుండఁ బెద్ద లేర్పఱచినారు
నెల వొసంగిన నన్నియు సిద్ధపడును
క్షితిప! యన విభుం డట్టులె చేసె నంత. ౧౪

సీ. ఏ వీథు లరసిన నింతింత యనరాని
శృంగార మమరఁ గైసేసినవియె
ఏ యిండ్లు చూచిన నెంతయో చక్కఁగాఁ
బసుపుగుంకుమలచేఁ బరఁగునవియె
ఏ వంకఁ గాంచిన నీవివాహమహోత్స
వప్రయత్నంబుల వఱలు నరులె
ఏ చోటఁ గనుఁగొన్న నీ యుత్సవమునకు
వచ్చిన వసుమతీశ్వరుల భటులె
ఏడఁ గనుఁగొన్న నేనుంగు లెందుఁ గన్న
నుత్తమాశ్వంబులు రథంబు లుర్వీసురలు
కవులు వైణికుల్ గాయకుల్ గణిక లఖిల
వాద్యములు వైభవం బెన్న వశము గాదు. ౧౫

తే. ఇట్లు కొలఁది దినములకు నెన్నరాని
విభవ మమరంగ మంత్రి సెప్పిన విధమున
నన్నియును సిద్ధపడి యుండ నవనిభర్త
యుత్తమోత్తమ మగు సుముహూర్తమందు. ౧౬

## వివాహోత్సవము.

సీ. సకలబాంధవమిత్రసచివసమేతుఁడై
చతురంగసైన్యమ్ము సరవిఁ గొలువ
నిఖిలమంగళతూర్యనివహముల్ మ్రోయంగ
విప్రదంపతులు దీవించుచుండ
వందిమాగధులు కైవారము ల్సేయంగ
నాస్థానకవులు పద్యములు సదువ
గణిక లాడుచు ముందు గానంబు సేయంగ
బృథివి నభము మ్రోయఁ బెల్లు మనుచు
జోడుగుఱ్ఱాల బండిపై సొబగు మీఱఁ
బెండ్లికొమరునిఁ గూర్చుండఁబెట్టి తనరఁ
బత్తనం బెల్ల నూరేఁగి పయన మౌచు
వెడలెఁ బెండ్లికిఁ జూపఱు వినుతి సేయ. ౧౭

ఆ. నడుమనడుమ బసల బడలిక లేకుండఁ
బెండ్లివారు సేయు విందు లెల్ల
నారగించి మిగుల నానంద మొందుచు
వీణపాటఁ బాట విని చెలఁగుచు. ౧౮

తే. కతిపయప్రయాణముల కఖండవిభవ
మైన రత్నాంగదవిభుపురాంతికోప

వనము సేరిరి సుముహూర్తమునకు ననువు
గాఁగ జయభేరికల్ మ్రోయఁగాఁ దొడంగె. ౮౯

క. ఆ జయభేరీధ్వని విని
రాజును గజహయరథభటరాజులు గొలువన్
రాజిలు మర్యాదలతో
నీ జనపతి గౌరవించె నెలమి దలిర్పన్. ౯౦

తే. పట్టనం బెల్లఁ జక్కఁగాఁ బరిషవమ్ము
తోడ నూరేఁగి విడిదికిం దోడి తెచ్చి
యందు వారికి నన్నియు ననువుపఱచి ముందు
కర్జంబులను జేయ మొదలువెట్టె. ౯౧

తే. జోడుగుఱ్ఱాల బండ్లపై జోడు గూడి
చుట్టు గుఱ్ఱపుబం డ్లెక్కి సుదతు లెల్లఁ
గొలువఁగా వధూవరులు సేనలకు నడుమఁ
బరఁగ నూరేఁగుచుందురు పరిషవమున. ౯౨

తే. బండ్లపై నెక్కి యూరేఁగు పట్టునందు
వనితలును వధూవరులును బరుల కంటఁ
బడరు వారికిఁ బరు లగపడుదు రధిపు
లేనుఁగులపైని నంబారు లెనసియుంద్రు. ౯౩

తే. ఎట్టి నిఱుపేదలకు నేని నెచటనైనఁ
బెండ్లి యని తలపెట్టినఁ బెద్ద పరిష
వంబు లేకుండ జరుగదు వాసి గనిన
యధిపులకు నన్న నద్దాని నడుగవలెనె? ౯౪

సీ. మన సత్యవతి పుణ్యమునసె కా మనమును
భోగిరాజవిభావిభూతిఁ గనుట
మన రాజకన్యక మాన్య యోటనె కదా
మన పుర మీ శోభఁ గని చెలఁగుట
మన యధిపు నదృష్టమునసె కా యిటువంటి
గొప్ప చుట్టఱికమ్ము తప్ప కగుట
మన మొనర్చిన పున్నెమునఁ గదా మన కీర్తి
ఘనవైభవమ్ములు కంటఁ బడుట
యహహా! రాకన్నియకుఁ దగినట్టి వరుఁడు
వరునకుం దగు మన జనపతి తనూజ
బ్రహ్మ తగినట్లులే కూర్చె భళిర! యనుచు
జనులు వారిలో వా రనుకొనఁ దొడఁగిరి. ౯౫

సీ. అద్దిరా! యిందఱా యవరోధకాంత లీ
భోగిరాజున కను పూవుఁబోణు
లీ భోగిరాజు గా రేమి యేలునో కదా
మన సత్యవతి నను మచ్చెకంటు
లితఁ డిట్టిఁ డని జనపతి యెఱుంగఁడే కన్నె
నెడఁ జుట్టె నితని నన్ మించుఁబోణు
లెఱుఁగకుండిన నేమొ యెఱిఁగిన మనరాచ
కన్నె వీడం డను కల్కిమిన్న
లట్టులే యగు మన రాచపట్టి పుట్టి
నట్టి సుముహూర్తమును బట్టి యనుపవాస
భాగ్యసౌభాగ్యకీర్తులు పడయు ననెడు
పడఁతు లందందుఁ గొందఱు పరఁగి రెలమి. ౯౬

ఉ. కత్తికి బాసిక మ్మొకటి కట్టి వరస్థలి నిల్పి దానితోఁ
దత్తదశేషకృత్యములు దామె యథోచితరీతిఁ దీర్చుచున్
వేత్తలు తత్పురోహితులు పేరులు గాంచిరి పెండ్లిలోన నా
పత్తన మెల్ల వీణియల పాటలు బాటలుఁ నాటలై తగెన్. ౯౭

తే. కవన మల్లంగ నేర్చిన కవులు దమకు
మనసు తీరంగ మితి లేని మంచి మంచి
కల్పనలు వానిఁ గనిపెట్టి కరము నలరు
రసికు లౌ రాజు లమరుట రహిఁ జెలఁగిరి. ౯౮

క. రత్నాంగదావనీంద్రుఁడుఁ
బత్నియుఁ దమ సుతకు నుచితభంగి విరాజ
ద్రత్నాలంకృతులు సుదృ
గ్రత్నమ్ములు మంచి యూళ్లు రక్తి నొసఁగుచున్. ౯౯

శా. అమ్మా! నిన్ గని పెంచి యీవఱకు విద్యాబుద్ధుల న్నేర్పియు
క్త మ్మౌ చుట్టఱికమ్ము నేఁడి తగు నేతం గూర్చినా మెమ్మెయి
న్నమ్మున్ సాటి మహీతలేశ్వరులలోనన్ మాన్యులం జేసెదో
చుమ్మా నిన్విడి యెట్టు లుండఁగలమో చూ! మా బహిఃప్రాణమా.

శా. బొమ్మల్ నీయవి చూచికొన్న మఱి నీ పొత్తమ్ము లీక్షించినన్
సొమ్ముల్ గాంచిన నీవు పెంచిన లతల్ సొం పొందుటల్ గన్నఁ జి
త్త మ్మే తీరున మాఱునో యకట! సంతానమ్ము చింతాసము
ద్రమ్మున్ జేర్చెడి నీకువేళ నిఁక నే దారిం దరిం గాంతుమో.

సీ. నీవు చక్కెరఁ బెట్టి నేర్పునం బల్కించు
చిల్క లుండెడి సౌధసీమ లరసి
నీవు తాళము వేసి నీటుగా నాడించు
నట్టువపిట్టల పట్టు లరసి

నీవు గురులయొద్ద నిరుపమాసక్తి వి
　　ద్యల నేర్చుకొనెడి గృహమ్ము లరసి
నీవు బొటులఁ జేర్చి నెమ్మిమై వీఁశియ
　　మీటుచుఁ గూర్చుండు చోటు లరసి
తోడి చెలులతోఁ గూడి సంతోష మొప్పఁ
నాట లాడుచుండెడి పుష్పవాటు లరసి
నీవు గన్పడకుండిన నిలువఁగలమె
కనకపుంబొఁతబొమ్మ మా కన్నయమ్మ.　　౧౦౨

అమ్మ! మేము గా మమ్మయు నయ్య నీకు
నమ్మ యత్తమ్మయయ్య మామయ్య చుమ్మి
మాయెడ న్నీకుఁ గలయట్టి మమత వీడు.
దేవుఁడే యని భర్తను దెలిసికొనుము.　　౧౦౩

సీ. అత్తమామలయెడ నణఁకువ మెలఁగుట
　　నాఁడుబిడ్డలకడ నడఁగి యుంట
బావల మఱఁదుల పనులు వే సలుపుట
　　బంధుగులను గౌరవముగఁ గనుట
యనుచరవర్గంబు ననువుగాఁ జూచుట
　　కడు భక్తి పతియెడఁ గలిగియుంట
సవతు లున్నను వారిఁ జలమునఁ గనకుంట
　　సాటివారి సిరికి సహన ముంట
దయయు సత్యంబు శౌచంబుఁ దప్పకుంట
మొరు లొనర్చెడి నుతులకు నుబ్బకుంట
మొదలుగాఁ గల సద్గుణములను గాంచుఁ
పడఁతి పతిదేవత యనంగఁ బరఁగుఁ బట్టి!　　౧౦౪

తే. ఎట్లు నీ వట్టి సుగుణంబు లెనసి పుట్టి
నింటికిని మెట్టినింటికి నెన్న రాని
ఖ్యాతిఁ గూర్చెదవో మమ్ముఁ గన్నతల్లి!
మమ్ము మఱచిన మా మాట మఱవకమ్మ. ౧౦౫

తే. అనుచుఁ గన్నెకు బోధించి యత్తమామ
లున్న కడ కేఁగి వారికి నుచితరీతిఁ
జెప్పఁదగిన మాటల నెల్లఁ జెప్ప మొదలు
వెట్టి రఱచేతిలోఁ గన్నెఁ బెట్టి యిట్లు. ౧౦౬

మ. కని కష్టంపడి పెంచి యిప్పటికి నిక్కన్యం గలాధన్యఁగా
వినయాలంకృతఁగా నొనర్చి జగతీవిఖ్యాఁతుఁ డౌ మీ తనూ
జున కర్పించి కృతార్థతం గనుచు నీ క్షోణీస్థలిన్ వీరిఁ బో
లినవా రుండ రనంగఁ బేర్వడితి మోలిన్ మీ కటాక్షమ్మునన్.

క. ఈ కన్నియ మీ కన్నియ
మా కన్నియ కాదు సుండీ మమకారమునన్
జేకొని సాకన్ గావలె
మా కామోదమ్ముఁ గూర్చి మాన్యులు మీరల్. ౧౦౭

తే. అనుచు నీరీతిఁ గన్నియ నప్పగించి
యల్లునకుఁ దా మొసంగిన వన్నె తెలిపి
యందఱకుఁ దగు కానుకల నరసి యొసఁగి
మన్ననలు సేయఁ జూచి ధర్మాంగదుండు. ౧౦౮

తే. మాకుఁ గోడలే స్గాఁతురే స్మీ కొమరిత
వేఱు లేరు మీకన్నను బేర్మి మీఱఁ
జూచికొందుము మీకు మీ సుతకు నింక
బెంగ నొందంగ నేటి కనంగఁ బొంగి. ౧౦౯

క. అమ్మహితాత్ములు దమ కను
దమ్ముల నానందరసము దద్దయుఁ గురియన్
నెమ్మదిఁ గల పరితాపభ
రమ్మును విడి కన్నె సేయు ప్రణతులు గొనుచున్. ౧౧౦

తే. తగిన పగిదిని దీవించి తనయ నంపి
రంత ధర్మాంగదప్రభుం డలరి సపరి
వారుఁడై తదనుమతిని బడసి నిజపు
రమ్మునకుఁ జేరెను బరిణయమ్ము గోడ. ౧౧౧

తే. పౌరసతు లెల్ల మేడలపైకి నెక్కి
లాజలను జల్లుచుండ నా రాజదంప
తులు చెలంగుచు నూరేఁగి లలి గృహప్ర
వేశ మైరి భూసురులు దీవించుచుండ. ౧౧౨

తే. విప్రసంతర్పణమ్ములు వీణ పాట
లాటవెలఁదుల యాటలుఁ బాటలు హరి
కథలు కైతలు నానందకారణములు
గాఁగఁ జెలఁగుచుండిరి జనుల్ కనకయందు. ౧౧౩

తే. తమకుఁ దా మిచ్చు నుపధ లందంగవచ్చు
నత్తమామలఁ గట్నమ్ము లడుగరాదు
వరులు వరులకు శక్తినిఁ బట్టి గౌర
వంబు సలుపంగవలయు నెవ్వారు నెపుడు. ౧౧౪

క. పాలంకరామనాథబు
ధాలంబన ! చిన్నబసవయారాధ్యనుతా
యేలేటిపాడుపురపరి
పాలా శ్రీరామలింగ భవభయభంగా. ౧౧౬

క. శ్రీమల్లమపలివంశయ
శోముక్తాచ్ఛత్రశబ్దశోధనఫణిరా
ట్ఛ్రీమత్పేరయగురుహ్రా
త్సీమగతా రామలింగ ధీమత్సంగా. ౧౧౭

క. శ్రీనిడమర్తిబసవరా
ణ్మానససారసవిహారమధుకర! కవితా
శ్రీనిరత! రామలింగ! సు
ధీనుతగుణభూమ! మహితదివ్యచరిత్రా. ౧౧౮

తే. కని రహాని బెంచుకొనిన నా కవితఁగన్నె
నీకు నిచ్చితి నో యన్న! నెనరుతోడ
నెట్లు పెంచెదవో చుమీ యేమఱకుము
మమ్ము సంతోషపెట్టు నమస్కరింతు. ౧౧౯

సీసము

హారితగోత్రోద్భవుం డైన మల్లమపల్లి యతుయగురునకు నగ్రిమాత్మజుఁడు
గణాగ్ర్యాచవ్రతస్థుఁడు సాధు వా వీరమల్లయాఖ్యారాధ్యతల్లజునకు
భ్రమరాంబకును దనూభవుఁడ విద్వత్సింహుఁ డౌ రామ
లింగయ కవరజుండ మల్లికార్జునుఁడ శ్రీమల్లికార్జున
కృపాయత్తకవిత్వుండ నైన నాదు సత్యవత్యు
పాఖ్యానసంజ్ఞప్రబంధమందునన్ ద్వితీ
యాశ్వాస మమర నిట్లు ముగిసె
నాచంద్రతారకముగఁ దనర్చు
నట్లు సేయుత దీనిఁ
జంద్రార్ధమౌళి.



శ్రీరస్తు

# సత్యవత్యుపాఖ్యానము

## తృతీయాశ్వాసము



శ్రీమల్లికాంబికాహృ
త్తామరసపతంగ! సుకవితారసభృంగా!
మామకహృద్రంగా! యభి
రామాంగా! రామలింగ! రంగదపాంగా! ౧

క. శ్రీయలకుత్రిపురీస్తవ
నీయస్థిరతరనిజజననీనాయకవి
ద్యాయతనదనాగేశ్వర
గేయ శ్రీరామలింగ! కితవవిభంగా! ౨

తే. అవధరింపుము మా యన్న! యవలి కథను
గౌతమామృతనిధినుండి గదలు సుధను
ఘోరదురితాద్రిభంజన కులిశవిధను
నిహపరానందపరవశీకృతవిబుధను. 3

తే. అట్లు నిత్యోత్సవమ్ముల నవనిభర్త
కాలముం బుచ్చుచుం గడు గారవమ్ము
మీఱఁ గోడలికిం దగు మేడ యొకటి
యమరఁ గట్టించి యిడి కృప నరయుచుండె. ౪

మ. పతికన్న న్మితిలేనిగారవ మెలర్పం బేర్మి పెం పొంద సు
వ్రతయుం గోడలిఁ గూర్మిఁ గూఁతు పగిదిన్ భావమ్ములో నెంచి సం

తతము న్వచ్చి పురాణగోష్ఠి నొకకొంతం గొంత గానాదులా
బతిమాట న్మఱపించి కాలమును లేవం బుచ్చుచుండెన్ రహిన్.

సత్యవతీగుణప్రశంసనము

సీ. వందిమాగధుల కైవారంబు లవి యేడ
రాజ్ఞి య య్యాదె యువరాజుమేడ
అంతగా హెచ్చె నా హాయహేష లవి యేల
యయ్యా జలక్రీడ కరుగువేళ
అబ్బురం బది యేమి మబ్బు లేనియుఱుము
మద్దెల సూర్యనమస్య యిపుడు
ఆనగారామ్మోత్ర కవసరం బెయ్యది
యమ్మ! రాకొమరువాహ్యాళిపిలుపు
అనుచు వచ్చిన క్రొత్తలో నడిగి తెలిసి
కొనుచు నద్దిరా! వైభవం బనుచు మెచ్చి
కొనుచు సత్యవతీసతి కొన్నినాళ్లు
కనుల మొగిడిచి కాలమ్ము గడపుచుండె. ౬

సీ. తల్లిదండ్రులకన్నఁ దనయెడన్ దయఁ జూపు
నత్తకు మామకు హర్ష మొసఁగుఁ
దనయందు భక్తితత్పరు లౌచు వర్తించు
ననుచరులను గృప నరయుచుండుఁ
దాఁ బురాణముల శ్రద్ధాయుక్తయై విని
తెలిసి యారీతి వర్తించుచుండుఁ
దనపతికృపకుఁ బాత్రతఁ గను విభవమ్ము
తన కెప్పుడో యనుకొనుచునుండుఁ
బతిహజారమ్మునం దున్నఁ బడతు లన్న
నెంత యుబలాటమో పడు నెప్పు డైనఁ

దనకు నాపాటివిభవ మే న్దక్కునా య
టంచుఁ జింతించుచుండు నయ్యంబుజాస్య. ౭

సీ. ఎప్పుడు చూచిన నేదియో వ్రత మని
విప్రకాంతల గారవించుచుండు
నడుగకుండనె నిచ్చు లర్థుల కిడుచుండు
నడుగువారికి నాస్తి యను టెఱుఁగదు
తన కింతసిరి యున్న దని విఱ్ఱవీఁ గదు
కలచితిఁ గల లని గర్వపడదు
తప్పుఁ జేసినవారి దండింప నొల్లదు
మునుపటివలె వారిఁ గనదు పేర్మిఁ
బరులమేలుకు నానందపడును దనదు
కష్ట మొరులకు నెన్నండుఁ గానీదు
కీర్తి నార్జించు దేవసంకీర్తనంబుఁ
జేయు సత్యవతికి సాటిచేడె లేదు. ౮

సత్యవతికిఁ గలావతి సఖియగుట.

గీ. ఇట్టు లొకకొన్ని యేఁడులు గుట్టుచెడని
యట్టు లాసత్యవతి కాలయాపనమ్ముఁ
జేయుచునె యెట్టకేలకుఁ జెలిమిఁ జేసెఁ
జెలువరాఁ గొల్చుచదువరి చెలువతోడ. ౯

గీ. ఎట్లు కనిపట్టెనో మంత్రి యీవిషయము
నుచితగతి యువమహిపతి యూడిగంపుఁ
గలికి రావించి తాఁ గొన్ని కట్టుపాటు
లొనర నొనరించి, యువరాజ్ఞి యొద్ద నుంచె. ౧౦

గీ. ఆ యువతి కలావతి యనునది తదాది
యధికగౌరవమున నిచ్చు టచటఁ గూడ

మిగుల జాగ్రత్తతోడఁ దా మెలఁగి సత్య
వతినిఁ దద్దయు సంతోషపఱచుచుండె. ౧౧

భర్త యగపడమికిఁ జింతిలు సత్యవతినిఁ గలావతి యూఱడించుట.

సీ. ఘుమఘుమంఘుమలాడు కుంకుమం బొకదినం
బొకదినం బలరారు వికచపద్మ
మరిదితావులదొంతి విరిబంతి యొక్కనాఁ
డొకనాఁడు క్రొత్తమల్లికలదండ
సకలదిగ్వ్యాదిత మహా సాంకవం బొకనాఁటి
యొకనాఁటి శ్రీచందనోరుపంక
మత్యుత్తమం బైన యత్తరు వొక్కమా
ఱొకమాఱు పన్నీరుహాన్ను బుడ్డి
యువవసుంధరావరయథేచ్ఛోపభుక్త
శేషము లటంచుఁ దాఁ దెచ్చి స్వీకరింపుఁ
డని కలావతి విన్నవించిన నలరుచుఁ
గనుల నద్ది సేవించును గరము భక్తి. ౧౨

తే. ప్రత్యహముఁ బతిమధ్యాహ్నభాస్కరార్చ
మ్రాయువాద్యము ల్వినకుండ భోజనంబు
సేయ నొల్లదు తానును దోయజాప్త
పూజ లతిభక్తిఁ బతిరీతిఁ బూని సేయు. ౧౩

తే. తనకుఁ దనచెలు ల్పూజకుఁ దగిన వెల్లఁ
జక్కఁగాఁ గూర్చుపగిదిని సత్యవతియుఁ
దాను దనపతిపూజకుం దగిన వెల్లఁ
గూర్చి పంపించు నిచ్చలు గోర్కి మీఱ. ౧౪

క. దినదినమును దన కనులకు
వనువుగఁ గనుపట్టుపూల నన్నింటినిఁ జ

క్కని దండలుగను బంతులు
గను నేరుపు మీఱఁ గూర్చి కాంతున కనుపున్. ౧౫

క. చందన మనినను నాపతి
కిం దగ్గయుఁ బ్రియ మటంచుఁ గీర్తింతురు స్త్రీ
లంద అనుచుఁ దనశక్తికొ
లందినిఁ దాఁ దీసి రహిఁ బెలుగుచు ననుపున్. ౧౬

క. సుందరు లగువిద్యావతు
లెందఱొ తనుఁ జుట్టి కొలువ నెలమి దలిర్పన్
మందానిలవీజనసుఖ
మందెడివిభుఁ గొలువ నేర నని చింతించున్. ౧౭

క. వీణియ మీటంగల యలి
వేణులలో నెల్ల మిగులఁ బేర్వడితిని గీ
ర్వాణాదికవితలందుఁ బ్ర
వీణను ఫల మేమి యనుచు బెగ్గిలుచుండున్. ౧౮

తే. ఎన్నివిద్యలు నేర్చిన నెట్టి వినయ
మున్న, నెంతటి సోయగం బున్న నేమి?
యన్నిమిన్నకు వల్లభుం డున్నఁ గాని
వన్నె కెక్కదు వైరాగ్యవసతి లేని. ౧౯

తే. ఒల్లనీ కొల్లకుండని యువిద కెందు
నొకఁడు మగఁ డంచు లేకున్న యోగ్యత గనఁ
బడుట దుర్ఘట మతఁ డున్న పడఁతి యోగ్య
యైనఁ దద్యోగ్యతం జెప్ప నలవి కాదు. ౨౦

తే. అట్టు లాసత్యవతి నిచ్చ లంగలార్చు
చుండుటం గాంచి తెన్ను వేఱొండు లేమి

నెట్టు లోఁదార్పఁగల నని యెంచి తుదకు
నా కలావతి తా నిట్టు లనియెఁ జెలికి. ౨౧

శా. అమ్మా! యిమ్మెయిఁ జింతిలంజను నె మాన్యాం బైనభూనాథవం
శమ్మందుం జనియించి ధైర్యమును లేశమ్మేనిఁ గాపాడవే
కొమ్మల్ దేనికి వేనవేలనుచు నీకుం జెప్పనే నీయదృ
ష్ట మ్మేవేళ ఫలించునో తెలియునే చాలించు మీ దుఃఖమున్.

శా. నే నేవేళను వీలుఁ జూచి పతికి న్నీసంగతు ల్సెప్పి స
న్మానం బందఁగఁ జూచుచుంటిఁ దటి యమ్మా నేఁటికిం గానరా
దీ నీదుస్స్థితిఁ జూడలేక యిటుపై నే నెట్లుగా నుంటినో
మానం జాలితి వేని దుఃఖమును సీమంతాను జుమ్మన్నిఁటన్. ౨౩

శా. వీర ల్వారలు వో లెఁ గాదుచుమి పృథ్వీభర్త వారాశిగం
భీరుం డాతని మోము చూడఁగఁ గడున్ భీష్మంబుగాఁ దోఁచునే
వారు న్నోరు మెదల్పలే రచట దుర్వారంబు కోపంబు నే
నేరీతి న్నిను నాతనిం గలిపి నీ యీ కష్టము ల్దీర్తునో! ౨౪

శా. కానీ! యిట్టు లొనర్తు నోసకియ! సఖ్యం బున్న దాంపత్యసం
ధానోద్యోగముకన్నఁ జేయఁదగు కృత్యం బింక వే యున్నదే
నే నెచ్చోటికి నెప్డు రమ్మనెదనో నీ వప్పు డచ్చోటికిం
దో నేతెంచుచునుండు వేని నటుపైఁ ద్రోవ న్విచారించెదన్. ౨౫

వ. అనుచు.

సీ. యువకుంభినీపతి యుద్యానమున కేఁగఁ
జూచి హజారంపుసొంపుఁ జూపు
సభఁ జేసి కూర్చున్న సమయమ్ముఁ గనిపట్టి
యుద్యానవన మెల్ల నోలిఁ జూపు
డోలావిహారానుకూలకాలమ్మున
జలకేళికామహాస్థలులు సూపు

జలకేళిఁ జేయుఁగాఁ జనుజూడఁ గని క్రోలి
కాఖేలనము సేయు కడలు సూపు
సత్యవతి వానిఁ గని మది సంతసించుఁ
దాను దనపతితోఁగూడఁ ౯త్తదఖిల
సౌఖ్యముల నందలేనైతి జన్మ మేల
యనుచు నేవేళ నెంతయు నంగలార్చు. ౨౯

ఇట్లు లోకకొంత గడపి తాఁ దుట్టతుదకుఁ
దెలిసియొ తెలియకయొ గాని తెలివ సత్య
వతిని యువరాజు గల యుపవనిఁ జేర్చె
వింతగాఁ దోఁచె నానాఁటి విధము సఖిక. ౨౭

సత్యవతి భోగిరాజును దర్శించుట.

సీ. ఉద్యానవీథుల నుభయపార్శ్వముల ని
ల్పినగుఱ్ఱములబండ్ల పెంపుఁ గనుచు
నవరోధకాంతాజనాన్యోన్యనిశ్శబ్ద
సంభాషణమ్ముల శైలిఁ గనుచు,
నాప్యాయనముగ నే యబలయో పిణియ
మీటుచుఁ బాడెడిపాట వినుచు
నీవేళ నీతోఁట యిట్టు లుండుట కేమి
కత మని తాఁ గలావతి నడుగుచు
నంతలో బండి నిలిచిన నామె నుడువు
నుత్తరము వినుచునె దిగి తత్తరపడి
యడుగు తడఁబడ, మెయి వడవడవడంక
నకియ సాహాయ్యమునఁ జని స్తబ్ధయయ్యె. ౨౮

తే. స్తంభభావంబు నొందిన సత్యవతినిఁ
గాంచి యవరోధకాంత లక్కజముపడిరి

భోగివిభుఁ డేఁగుదెంచి యా పొలఁతిమెడకుఁ
జుట్టుకొని పూలహారంపుసొంపు నింపె. ౨౯

తే. స్తంభభావమ్మె లేకున్న సత్యవతిని
భోగిరాజు పైకొన్న నే పొలఁతు లేని,
బట్టఁజాలుదురే మీఁద నెట్టు లైన
నంతకష్టమ్ముగాఁ దోఁప దంతె చాలు. ౩౦

తే. అనుచు నొకరితో నొక రనుకొనుచు నువిద
లుచితరీతిని వేవేగ నుపచరింపఁ
దెలివి వచ్చి యా సత్యవతి యిటు లంగ
లార్చి వక్షమ్మునం జేయిఁ జేర్చి యపుడు. ౩౧

తే. అకట! యెన్నండు నే నిట్టు లగునటంచు
నెఱుఁగ లే నైతి నెఱిఁగిన నేమి యగును
భోగిరా జాయెనే నాకుఁ బురుషుఁ డయయొ
దైవమా! యెంత సేసితే దయ తొలంగి. ౩౨

తే. అనుచుఁ గనువిప్పి చూచి సింహాసనమున
భోగిరాజు లేకున్న నా పొలఁతి మిగులఁ
బొగుల వగవకు మగువ నీ మగఁడు మెడనె
తగిలి యున్నవాఁ డని యొక తరుణి తెలుప. ౩౩

సత్యవతి భోగిరాజును వేఁడికొనుట

క. తత్తరపడి సాధ్వీమణి
మెత్తఁగ విభుఁ డపుడు తనదు మెడఁ దోఁపఁ గడున్
బత్తియు భీతియు వెలి దళు
కొత్తఁ గరమ్ములను గూర్చి యూనెను వేఁడన్. ౩౪

శా. దేవా! నీకు నమస్కృతు ల్గరుణ నా ధీహీనతం గాంచి మో
హావేశమ్మున నేవి పల్కితినొ లో సన్యంబుగా నెంచ కీ

వా వానిన్ సయిరింపఁగావలె శరణ్యా! నాకు నీకన్న నిం
కేవారుం గనరారు రక్షకులు నీవే దిక్కు రక్షింపవే. ౩౬

శా. నే నెన్నండు నెఱుంగ నీసహజమాణిక్యప్రభల్ గాంచితిన్
హా! నాజన్మము సార్థ మాయె మెయి యన్నన్నా! నెలన్ గేరెడిన్
వీను ల్గన్నులు నేక మా భళిర! పృథ్వీచక్రము స్గెలమైఁ
బూనం జాలు శిరమ్ము బాపురె! నినుం బోలంగలే రెవ్వరున్.

శా. ఔరా! గానరసజ్ఞతావిభవ మాహా జ్ఞానసంపత్తి య
య్యారే! సారసమర్చనాపరత యన్నా శౌర్య మీ నిన్ను నె
వ్వా రేన్ బోలఁగలారె! నా యదిమెచూ భాగ్యమ్ము భోగీశ్వరా
కారుం డైనవిభుండు నీకురునె! యీతన్మచక్రము దేఱికేన్. ౩౭

తే. అరుదుగా మున్ను నాగకన్యలు మనుష్య
దేవసుతులను వరియించి స్థిరయశస్క
లైరి గాని రాజన్యకన్యకల కెచటఁ
బురుషనాగమ్ముతోడుతఁ బొందు వినము. ౩౮

తే. అదియు నా కిప్పు డెట్టులో కుదిరె దీన
నెట్టిమే లొనఁగూర్చునో యీశుఁ డనుమి
నమ్మహాపతివ్రత పతి నతివినీత
యగుచు సేవించుచుండె దా ననునిమిషము. ౩౯

## దంపతుల పరస్పరానురాగము

తే. సత్యవతితోడఁ గలిసిన క్షణమె మొదలు
భోగిపతి కగి యేమొ యే పోలఁతి సేయు
సేవయే నంత మదికి రుచింపదాయె
సతి తనదుమేడ వీడియు సలుపు సేవ. ౪౦

తే. పొలఁతిపొం దెన్న నెఱుఁగని పుట్టుభోగి
పురుషుఁ డెట్టిఁడో యెఱుఁగని పువ్వుఁబోణి
యొక్కనిముసమ్ము విడఁజాల రొకరి నొక్క
రనను రూపతను గుణము లక్షగించు. ౮౧

సీ. సతి వీణవాయించినఁ బతి తల యూఁచును
బతి తల యూఁచిన సతియుఁ దనియు
సతి రక్తిగాఁ బాడఁ బతి తృప్తిమై నాడుఁ
బతి తృప్తిమై నాడ సతియుఁ దనియుఁ
బతి జలకము లాడ సతి జలకము లాడు
సతి జలకము లాడఁ బతియుఁ దనియుఁ
బతి పాలు గ్రోలిన సతి పాలు గ్రోలును
సతి పాలు గ్రోలినఁ బతియుఁ దనియుఁ
నెట్టి వైరూప్యవంతు లే నిట్టు లుండ
వలయు నెచ్చోట నైన దంపతు లటంచు
జగమునకు బుద్ధి సెప్పెడి చందమునను
వఱలుచుందురు జాయయుఁ బతియు నిట్లు. ౮౨

సీ. సతి కురూప యనుచుఁ బతి వీడఁగూడదు
పతి వెఱ్ఱిఁ గని సతి పాయఁజనదు
పతి యనాజ్ఞకుఁ డని సతి రోయఁగూడదు
సతి మూఢ యని రోయఁజనదు పతియు
సతి యయోగ్య యటంచుఁ బతి వీడఁగూడదు
పతి ఖలుఁ డని సతి పాయరాదు

పతి కోపనుం డని సతి దూఱఁగూడదు
సతి చండి యని పతి సణఁగఁదగదు
పూర్వజన్మకర్మభోగంబు తప్పదు
పుడమి నేరికేని బుద్ధి కలిగి
సతులుఁ బతులు నెల్లొ సఖ్యమ్ము నార్జించి
కాఁపురమ్ము సేయఁ గలుగు సులు. ౪౩

తలిదండ్రులు కొడుకుం గోడలిం జూచుట.

తే. ఇట్లు కొడుకుఁ గోడలు నూడు చుఱెఁగి సువ్ర
తయును ధర్మాంగదుండుఁ జిత్తములఁ గొంకు
శోకమును వెనుకకును ముందునకు లాగఁ
జూడఁగా వచ్చి వారలశోష ననిరి. ౪౪

మ. కొడుకా! కోడల! మీసహస్థితికి నూకం దృప్తి నాకిల్లె ని
క్కడకున్ రాముగ మోడి మిమ్ముఁ గనుకాంక్ష న్బానియౌ నెంచి యు
ప్పుడు మీరున్న నెఱుం గెఱింగతిని సమ్మోదమ్ము సాఁగాని యి
మ్మిడుమ లొ్వట్టిన యమ్మహాదురిత మే మేరిని వీక్షింతుమో.

శా. చెడుగు ల్వీరని పేరు మోసి యుఁక నిస్సీ మొట్లు జీవింతు రి
ప్పుడు ప్రాణమ్ములు పోవునో! యకట! యాభోగమ్ము చేకూడునే
కడు పాపాత్ముల కెట్టికష్టములకుం గానుం మొకొ్కౌ భయం
పడ నే నూను! పురాకృతమ్ముల కిలం బద్ధమ్ము గా జంతువుల్.

శా. మీ కష్టమ్ములు నేఁడుఁగాత యిటుపై మీకౌ మనోభీష్టముల్
శ్రీకంఠుం డొసఁగూర్చుఁగావుత యశశ్శ్రీ మిమ్ము సేవించుతన్
మా కీదుష్పృథ వోవుఁగావుత జగన్మాన్యాగ్రగణ్యాస్ఫుర
ద్ధీరుం డైనయమాత్యశేఖరుఁడు కీర్తిన్ గాంచి వర్ధిల్లుతన్. ౪౭

ఉ. కోడల! నీ యపూర్వ మగుకోరికకుం బ్రతి సెప్పలేక మో
మోడితి మమ్మ! యే పగిది నోరిచి తీర్థములన్ భజించి మీ
కీడకు నప్డు వచ్చితిరొ యేమియుఁ దోఁపదు మిమ్ముఁ గన్నులన్.
జూడనినాఁడు మా కెపుడు చూచిన నిట్టులె వచ్చు నన్నియున్.

మ. అకటా! యిట్టి నె యే తనూజవిషయవ్యామోహ మే దేని నిం
చుక చిత్తమ్మున నాటునాఁ - తెలియున్ జూ నిన్ను నీవార లీ
డకు నీ పాపపరీతజీవవరులంతోడన్ బంపునాఁ టెట్టిబా
ధకు లోనై రొకొ! చెల్లరే! యనుచుఁ జింతం జెంది యామీఁదటన్

తే. ఎంతపొరపాటు మన మిప్డు డిట్లు చింత
నందఁగాఁ గూడ దని తామె యంతలోనఁ
దెలిసికొని కోడలింగూర్చి ధీరవృత్తిఁ
బలుకఁ దొడఁగి రీ రీతిని వార లపుడు. ౬౧

తే. ఇచటినుండి గూఢమ్ముగా నేఁగవలయు
నీ కలావతి తోడుగా నేఁగుదెంచు
బంధి లేకున్న ముందుగా వలనుపడదు
శుభము లగుఁగాత జాగ్రత్త సుండి యనుచు. ౬౨

తే. సంతసము మీఱ వారికి సత్యవతియు
వినతు లర్పించి వారి దీవనలఁ గొనుచు
నరిగె విభుమందిరమున కను, నవనిపతియు
సతియు సచివునినుడి నమ్మి సంతసిలిరి. ౬౩

క. సర్వాభీష్టఫలప్రద!
శర్వా! యేలేటిపాడుశరణ! మహాత్మా!

పర్వతవర్ధన్యధిప ! వృ
షార్వా ! శ్రీరామలింగ ! యబ్ధినిషంగా ! ౬౪

క. శ్రీమల్లమపల్యంబుధ
సోమాయితతార్కికేంద్రసుబ్రహ్మణ్యా
త్మామరగురుహృత్సరసిజ
ధామా ! శ్రీరామలింగ! ధవళియశోంగా ! ౬౫

క. నిడమర్త్యన్వయజలని
ధ్యుడురాడ్బసవేశ్వరహృదయోపాస్యాంఘ్రిధా !
జడిమమహీధరవిదళన
బిడౌజ! శ్రీరామలింగ ! విద్వద్వినుతా ! ౬౬

తే. కని రహింపఁ బెంచుకొను నాదు కవితఁ గన్న
నీకు నిచ్చితి నో యన్న నెనరు తోడ
నెట్లు పెంచెదవో చుమి యేమరకుము
మమ్ము సంతోషపెట్టు నమస్కరింతు. ౬౭

సీసము

హారితగోత్రోద్భవుండైన మల్లమపల్లి యాతుయగురునకు నగ్రిమాత్మజుండు
గణార్చావ్రతస్థుఁడు సాధు శా వీరమల్లయాఖ్యాగాధ్యతల్లజునకు
భ్రమరాంబకును దనూభవుఁడ విద్వత్సింహుఁ డౌ రామ
లింగయ కకరజుండ మల్లికార్జునుఁడ శ్రీమల్లికార్జున
కృపాయత్తకవిత్వుండనైన నాదు సత్యవత్యు
పాఖ్యానసంజ్ఞప్రబంధమందునన్ తృతీ
యాశ్వాస మమర నిట్లు ముగిసె
నాచంద్రతారకముగఁ దనర్చు
నట్లు సేయుత దీనిఁ
జంద్రార్ధమౌళి.

---

శ్రీరస్తు.

# సత్యవత్యుపాఖ్యానము

## చతుర్థాశ్వాసము.



(తీర్థయాత్రాఘట్టము)

శ్రీ మల్లికాంబికాహృ
త్ప్రేమశ్రీచిహ్నానయనవిభ్రమసీమా!
సోమకలాభరణా! గుణ
ధామా! శ్రీరామలింగ! ధరణీశతాంగా!

క. ఏతత్కృతిపోషకవి
ఖ్యాతయశఃప్రదమహామృతాంజనకామా
క్ష్మీతనయాంచితనాగే
ద్రీతచరిత! రామలింగ! కృతయమభంగా! ౨

తే. అవధరింపుము మా యన్న! యవలికథను
గౌతమసుధాంబునిధినుండి కదలుసుధను
ఘోరదురితాద్రిభంజనకులిశవిధను
ఇహపరానందపరవశీకృతవిబుధను. 3

తే. అంత నొకనాఁడు ఱేఁడు రహస్యముగను
పురుషవేషప్రవీణ లౌ పొలఁతుకలను
గుట్టుపుంబండిఁ గోడలిం గూర్చి పంపఁ
దగువిధమ్మున వారలు దరలి చనుచు. ౪

వ. కతిపయప్రయాణమ్ముల బదరీకేదారనాథుల సేవించి కొనుచు హరిద్వారపరిసరారణ్యమ్మునకుం జేరి యచట నొకవినిర్మలజల సరోవరమ్మును గాంచి తత్తీరస్థరసాలసాలవిశాలచ్ఛాయామూలమ్మున విడిసి కృతకృత్యులై కొంతవడి విశ్రమించి తీర్థయాత్రోచితవేషంబులం దాలిచి విడిచిన తమ యమూల్యాభరణాంబరంబులం బరిజనమ్మును సంతోషపెట్టి తత్కృతనమస్కృతులం గొని తగువిధమ్మున వారిం బంచి. ౫

## హరిద్వారము, మాయాక్షేత్రము

సీ. నడుమఁ బన్నగరాజు నడువ జాపల సత్య
వతి వలపలఁ గలావతియు నడువ
హరిఁ గూర్చియును బురహరుఁ గూర్చి రక్తిగా
భక్తిమైఁ బాడెడు పాట లలరఁ
దముఁ గన్నవార లందఱుఁ బరవశు లౌచు
వినుచు దూరమ్ముగా వెంబడింప
మోములఁ గుంకుమంబును భూతి తనరార
మేనుల వల్కము ల్మెఱయుచుండ
నట్టులం దక్షమాలిక లమర మెల్ల
మెల్లఁగా హరిద్వారసమిద్ధదేవ
గృహమునకుఁ జేరి కృతనిజకృత్యు లగుచు
విడిసి రం దొకమంటపవిపులసీమ. ౬

సీ. గాన మిట్టిది వీరు గంధర్వకాంతలా!
కారు కండ్లు కదలికలనె యలరు
సౌందర్య మబ్ర మప్సరసలా! వీరలు
కారు పాదము లాను క్ష్మాతలమును

దివ్యతేజం బొప్పు దేవాబ్జవదనలా!
కారు స్వేదంబు మొగములఁ జెలఁగు
నహోపతిం గొల్చెద రహియోమలా! వీరు
కారు మేనుల వారిటీరు తోఁచ
దార! యెన్నంఁగ గాంచ మీ యఖిలలోక
పావనాద్భుత తేజః ప్రభావ మనుచు
భక్తిఁ దత్పురవాసులు పాలుఁ బండ్లు
శర్కరయుఁ దెచ్చి యిచ్చిన సంతసిలుచు. ౭

తే. వారిభక్తిని గొనియాడి వలయువానిఁ
దాము దేవున కర్పించి తక్కఁగలవి
యచటిసాధుల కిప్పించి యారగించి
మొదల సుఖ మబ్బె శుభ మని పొంగి యంత. ౮

తే. కొంత సద్గోష్ఠి సలిపి యనంతరమున
సత్యవతి కలావతిఁగూడ సర్పరాజు
సాధుసంఘంబు విన ననె స్తోత్రలమ్ము
సకలపురుషార్థసిద్ధికి సాధనమ్ము. ౯

తే. ఎన్ని భువనమ్ము లేనియు నీ జగమ్ము
సాటి రా దని నమ్ము నిజమ్ము సుమ్ము
సకలసుకృతమ్ములకు నిమ్ము సౌఖ్యదమ్ము
పాపసంహారకరణమ్ము భవహరమ్ము. ౧౦

తే. పూర్వసుకృతదుష్కృతఫలభోగములకు
సుకృతముల నొనర్చుటకును జుమి ధరిత్రి
యిట్టిలోకమునం బుట్టినట్టినరులు
భుక్తియును ముక్తిఁ దప్పక పొందఁగలరు. ౧౧

సీ. ధన మున్న నన్నసత్రములను బారశా
లలఁ దటాకాదుల నిలుపవచ్చు
చదు వున్న సచ్ఛిష్యసంఘమ్ములకుఁ జెప్ప
వచ్చు సత్కృతు లొనర్పంగవచ్చు
గోవులుఁ భూములుం గామరత లుండిన
నెలమినిఁ దగువారి కీయవచ్చు
నవి లేనియెడఁ దీర్థయాత్రకుఁ బోవచ్చు
దేవుని భక్తిఁ గీర్తింపవచ్చుఁ
బున్నె మార్జింపవచ్చును బుడమిలోన
నితరలోకమ్ములందు లే దింతవీలు
కన్నుఁ దెఱచిన నేంతేనిఁ గలదు ఫలము
గాన నుండంగవలయు జాగ్రత్త మనకు. ౧౨

తే. ఎన్ని తీర్థముల్ క్షేత్రమ్ము లెన్ని యెన్ని
పుణ్యనదు లెన్నిపావనభూధరమ్ము
లెన్నశక్యంబె యవ్వాని నెల్ల నెట్టు
లెవరు సేవింపఁజాలుదు రీ ధరిత్రి. ౧౩

తే. అయిన మనము యథాశక్తి నఖిలముఖ్య
పుణ్యతీర్థస్థలినగమ్ములకుఁ బోవు
చుండవలె యథోచితముగ నుండవలయు
వాంఛితార్థమ్ము సిద్ధించువఱకు నియతి. ౧౪

వ. ఇట్లు సత్యవతి కలావతితో వక్కాణించి, నిజసద్గోష్ఠీసుధానుభవ పరవశులగు తత్రత్యతైర్థిక సాధుజనంబులచే సహాగమనాంగీకారమ్మునకుఁ గాఁ బ్రార్థింపంబడి సాదరమ్ముగాఁ బరస్పరసాహాయ్యంబునం బోవుద మని నుడివి, సహాయలబ్ధికిఁ బరితుష్టాంతరంగ యై నిద్రించి చరమరాత్రంబున నేచి నిత్యకృత్యంబులందీర్చికలావతితో

క. మాయాదేవీనిలయము
మాయాక్షేత్రంబు దీనిమహిమ నుతింపన్
వేయాననముల చిలువల
రా యేనియు నోపు హరుఁడు రహి నింపొంపున్. ౧౬

తే. శ్రీహరిద్వార మన నిదె చెలఁగు నిందు
గంగలోఁ దాన మాడుచు గరళగళునిఁ
గొల్చుచుం దైర్థికులఁ గూడి కొలఁదిదినము
లుంద మిట నని నుడివి య ట్లుండి వెడలి. ౧౭

## నైమిశము

సీ. బ్రహ్మ మనమ్ముఁ జక్రముఁ జేసి ద్రోలిచిన
నేమి పడి య దయ్యె నైమిశంబు
ద్వాదశవర్ష సత్త్రమఖమ్మను జగమ్ము
శ్లాఘింప నెటఁ జేసె శౌనకుండు
మును లందఱును నెందు ముందు సూతుని నుంచి
కొని మంచికథల నూఁకొని చెలఁగిరి
ఖ్యాత మహాపుష్కరిణీతీర్థరాజమ్ము
ముక్తిద మై యెందుఁ బొలుచుచుండు
బుణ్య మగునట్టి నైమిశారణ్యభూమిఁ
జేరి పుష్కరిణీతీర్థసేవఁ జేసి
యుచితగతిఁ గొన్ని దినము లం దుండి వెడలి
చేరి రొగి సుఖముగఁ గురుక్షేత్రమునకు. ౧౮

## కురుక్షేత్రము

సీ. తల్లిని నన్నలఁ దండ్రియానతిఁ జంపి
మరల వారిఁ గొనిన మాన్యవృత్తి

బలిమి ధేనువుఁ గొన్నఁ బరశువుచేఁ గార్త
వీర్యుఁ గూల్చిన మహావీర్యశాలి
పొంచి తండ్రినిఁ జంప బూని తత్పుత్త్రులఁ
బట్టి వధించినయట్టిదిట్ట
అలుక నంతటఁ బోక నవని నిర్వదిమొక్క
సారు లక్షత్రియన్ సలిపిన బలి
పరశుధరుఁడు శమంతకపంచకమున
రక్తతర్పణ మొనరించి క్రతువు సల్పి
ధరణి నెల్ల బ్రాహ్మణులకు దారవోసి
అవభృథము సరస్వతియందు నాఁడె నిందు. ౧౯

సీ. గురుభక్తిభరితుఁడై గురు వగుపరశురా
మునితోడ నెంచు భీష్ముండు పోరె
నాహవప్రారంభమం దెందు నరునకు
గీతలు బోధించెఁ గృష్ణమూర్తి
శరతల్పగతుఁడైన శాంతనవున కెందుఁ
బాతాళజల మిడె ఫల్గునుండు
కురుపాండుసుతులు దీకొని పోరి కలహాభో
జనునకు నెంచు నొసఁగిరి విందు
పుణ్య మగునట్టి యక్కురుభూమియందు
కొలఁదిదివసములు తగఁ దైర్థికులను గూడి
సత్కథలను జెప్పుకొనుచు సంతసమ్ము
తనర వసియించి యటనుండి తరలి చనుచు. ౨౦

సీ. కురుసుతు ల్పాంచాలికోక నొల్చెడివేళఁ
గృష్ణుఁ డక్షయపటం బిచ్చినాఁడు
సంధి సేయఁగ వచ్చి శత్రులు మూఁగఁగ శౌరి
విశ్వరూపమును జూపించినాఁడు

అర్థి యై వచ్చినయుంతను సౌరి
సహజ మాకవచ మ్మొసంగినాఁడు
ఆయోధనాంతమం దశ్వమేధము యుధి
ష్ఠిరుఁడు శ్లాఘ్యమ్ముగాఁ జేసినాఁడు
హస్తినగరి దాని నభినుతింపఁ దరమె
యానగరికి నిలహార మగుచు
నలరు నబ్ధిపత్ని యమునకు సైదోడు
యమున నీలవర్ణ యర్కకన్య. ౧౧

వ. మఱియు

సీ. సాంబుండు వలచి లక్షణకుఁగాఁ జెఱఁబడ్డ
హాలి హస్తిపురి నెంకాఁ గెలఁకు నెత్తె
నెం మున్న మడుఁగులోఁ గృష్ణుండు కాళియ
ఫణిఫణావళిఁ దాండవ మ్మొనర్చె
వనది సైకతం బెనసి గోపికలతోఁ
గృష్ణుండు చిననాఁడు క్రీడ సలిపె
ఏ యేటితోఁటల నెప్రొద్దు రాధతోఁ
గలసి మెలసి కృష్ణుఁ డెలమి నుండె
నట్టి దా యమునానదియందుఁ దాన
మాచరించుచు నం దుండి యమునొడ్డు వాసి
కృష్ణుజన్మస్థలంబు ముక్తిప్రదమ్ము
మథురఁ గనుఁగొని సంతసంపడిరి మిగుల. ౧౨

కుబ్జ దివ్యవిగ్రహము గైకొనినచోటు
కంసునకు రాజధాని జగత్ప్రసిద్ధ
సప్తపురములలో నొండు సర్వపాప
హారము మథురాపురముఁ గొనియాడఁ దరమె. ౧౩

వ. దానికిఁ బ్రాగాగ్నేయముగా సమీపమునందు బ్రవహించుచున్న
గాళిందీనదినిఁ దాన మాడుచు,

## శ్రీకృష్ణక్రీడాస్థానములు.

సీ. గొల్లపిల్లలతోడఁ గులుకుచుఁ గృష్ణుండు
గోవులఁ గాచినగోకులమ్ము.
నందసూనుఁడు గోపసుందరు లుబ్బఁగ గా
నము చేసినట్టి బృందావనమ్ము
చిన్నతనఁపుబనుల్ సేయుకృష్ణుని యులూ
ఖలమునందు యశోద గట్టుచోటు.
గొల్లచేడెలు కట్టుకోకలఁ గొనిపోయి
చెట్టెక్కి కృష్ణుండు చెలఁగునెలవు
కేల గోవర్ధనము నెత్తి మాలఁ గంస
వైరి కాచిన పట్టు నక్రూరుఁ డెలమి
విశ్వరూపధరుం డైన విష్ణుఁ గనిన
తావు సేవించి వా రయోధ్యకు వెడలిరి. ౨౮

## అయోధ్య

మ. సరయూశైవలినీసమీరశిశిరసంచారమ్ములం గొల్చుమం
దిరముఃల్పత్యనురాగభోగవిలసద్దేహప్రభ ల్గల్గుసుం
దరులుఁ సూర్యకులప్రభు ల్సగరిగంధర్వంబులు స్సాధసిం
ధురము ల్గల్గు నయోధ్యఁ గన్గొనిరి సంతుష్టాత్మపద్మమ్ముగన్. ౨౯

సీ. కుశికసుతుఁడు సేయుఘోరసత్యపరీక్ష
జయము గాంచిన హరిశ్చంద్రవిభుఁడు
గోత్రారిధైర్యమ్ముఁ గోలుపుచ్చినదిట్ట
సవనపూర్తి సగరచక్రవర్తి,

తనదుపితరులసద్గతికి మందాకినిఁ
క్షితికిఁ దిగిచినభగీరథుండు,
మృత్యుత్రచేఁ స్వర్గ మిడియుఁ గౌత్సునిమనో
రథముఁ దీర్చినమేటి రఘునియంత,
అసురసంహారమందు స్వర్గాధిపతికిఁ
దగినసాహాయ్య మొనరించి ధరణి కెల్ల
యశముఁ దెచ్చినశూరుండు దశరథుండు
జనన మొందిన యభ్యుదయమ్ముఁ గనినచోటు. ౨౬

శా. శ్రీరాముం డుదయించినట్టిపట్టి జయశ్రీకి న్నివాసంబు సీ
తారాకేందునిభాస్య మెట్టినది నిత్యఖ్యాతి ముక్తిప్రద
మ్మారామోజ్జ్వల మప్రమేయమహిమమ్మద్వాద్వదహా నాయమో
ధ్యారత్నాకర సుఖలాభరణ మత్యానందముం గూర్చెడున్. ౨౭

వ. సరయూనదీస్నాన మాచరించుచు నందుఁ గొన్నిదినము లుండి.

ప్రయాగ

తే. గంగ యమున సితాసితభంగచాతు
రముల నిరుపక్కలం గొల్చి రాఁగ నక్ష
యవటవృక్షంబు గొడుగుగా నలరుతీర్థ
రాజమును బ్రయాగమ్మును రహిని గనిరి. ౨౮

తే. అది విధిక్షేత్ర మచ్చట యమున గంగ
కలిసెను ద్రివేణి మకరసంక్రాంతియందు
నందఱును దీర్థమాడుదు రందు దాని
యాగముల కెక్కు డౌటఁ బ్రయాగ మండ్రు, ౨౯

తే. అందుఁ గలమాధవస్వామి కందొవలకు
విందుఁ గూర్చును దేహాంతమందు మరల

బొందిఁ గననీఁడు కనువారి నందు మాధ
వేశ్వరియు నుండుఁ బీఠస్థ యెలమి మీఱ. 30

సీ. అటనె యల్లాబాదు నందె ధారాగంజు
నందలికోట కన్వెందు సేయు,
నం దొక్కసమభూమియందు గంగాపుత్రు
లను గూడి కొన్ని మెట్లను దిగి పది
బారలు పెద్దదీపపుకాంతిఁ జని చూడ
నక్షయవటవృక్ష మగపడుఁ
బడమర దానికి వాయుభాగంబున
నలరు భరద్వాజనాశ్రమంబు
రావణునిఁ జంపి సపరివారముగ వచ్చు
రామునకు విందు జరిగినసీమ యచట
నుండి కాశికిఁ జనుత్రోవ నుండుఁ గృష్ణు
మాయ వింధ్యవాసినిపేర మహీధరమున. 31

కాశి

తే. దక్షిణమ్మున నసియు నుత్తరమునందు
వరణ పూర్వన నుత్తరవాహిని యగుచు
ధనువువలె గంగ తనరెడితావు క్రోశ
పంచకమితంబు ముక్తికిఁ బట్టు కాశి. 32

వ. అందఱువదినాల్గుఘట్టంబు లుండు.

సీ. అనిశమ్ము శివులచే నవి ముక్తమై యుక్కి-
నవిముక్తసంజ్ఞిక మగుచు నలరె
శివుల కానందంబు చేకూర్చునది గాన
నానందకానన మైమ్మ చెలంగె

సమయుజంతువు లెల్ల శంకరు లయి నివా
సము సేయుట మహాశ్మశాన మయ్యె
వరణాసివాహినీద్వయమధ్యగత మౌట
వారణాసీసమాహ్వాక మయ్యెఁ
గడు ప్రకాశించుకతమునఁ గాశి యయ్యె
విశ్వనాథుండు నాథుండు బిందుమాధ
వుండు సచివుండు క్షేత్రపాలుండు భైర
వుండు పట్టమహిషి యన్నపూర్ణ యైరి. 33

తే. ఐసుపదు లార్వురు గణేశు లఱువదార్గు
రావరణదేవతామణు లాఱుపదుల
నైని నల్వురు పురపరిపాలికలును
గల రల విరాట్టు భ్రూమధ్యతలము కాశి. 3౪

సీ. ద్వాదశార్కులు సప్తభైరవులును సప్త
వసువులు నవదుర్గ లెసఁగుచుండు
రష్టలింగమ్ములు సప్తవినాయకుల్
గౌరులు తొమ్మండ్రు గ్రాలుచుండ్రు
పదిరెండు వేలు నల్వదిరెండు లింగమ్ము
లెసఁగుచుండ్రు నవగ్రహేశ్వరులును
రుద్రులు పదునొకండ్రును సప్తపురములు
వారణాసీపురి న్వఱలుచుండ్రు
జంగమస్థావరప్రపంచంబు శివుని
యందుఁ జెలువొందుగతి నందు నఖిలపుణ్య
తీర్థములుఁ బరిశీలింపఁ దేజరిల్లు
నీ రహస్యమ్ము గానలే రెల్లవారు. 3౫

సీ. శ్రీశైలేశ్వరాదికేశవసమీపమ్మున
మధుమాససేవ్య మై మధుర తనరు
రామేశ్వరస్వామి సామీప్యమున గ్రీష్మ
మందున సంసేవ్య మగు నయోధ్య
నెగడు శంఖోద్ధారనికటమందున వర్ష
కాలసేవ్యము ద్వారకాపురంబు
నీమ్యఁ జౌవృద్ధకాళేశ్వరుసన్నిధి
శరదృతుసేవ్య ముజ్జయిని తనరుఁ
దగు నసీసంగమేశుప్రాంతమున మాయ
వేంకటేశ్వరు సన్నిధి వెలయుఁ గాంచి
లలితమొద్దను గాశి చెలంగుచుండు
శిశిరహేమంతమధుబుతుసేవ్యము లయి. ౩౭

సీ. కాళరాత్రియలరఁ గాలభైరవుఁడు తాఁ
డవ మాడి కడు డస్సి డప్పిగొనుచు,
సప్తలోకంబుల స్వాదూదకంబులు
గానక తపసి యై కాశిఁ జేరి
యీశానుఁ డన నొప్పి యీశునకు సహస్ర
కలశోదకాభిషేకంబుఁ జేసి
తత్తీర్థమును గ్రోలఁ దనత్రిశూలమ్మున
ధాత్రినిఁ బొడువఁ బాతాళఝురము
వెడలి మిన్నంట నద్దాన విశ్వనాథుఁ
డలర నభిషేచనముఁ జేసి యతనివలన
నా జలము జ్ఞానదంబుగా నందె వరము
గాన నయ్యది యయ్యెను జ్ఞానవాపి. ౩౮

సీ. మును హరస్వామి నాఁ దనరువిప్రుఁడు గాశి
నతనికన్య సుశీల యనఁగఁ బరఁగు

దాని మోహించి విద్యాధరుం డొకఁడు ముం
గిట సుప్తయై యుండఁ గీ లెఱింగి
గగనమార్గంబునఁ గన్యను మలయాద్రిఁ
జేర్చి విద్యున్మాలి చెడుదనుజుఁడు
చెలువకై యుద్ధంబు చేయ నాతనిఁ గూల్చి
తద్గదాహతుల విద్యాధరుఁడును
గూలి ప్రాణము ల్వీడుచోఁ గోమలాంగి!
నిన్ను వనుచు నర్థోక్తితో నీల్గెఁ జెలియు
నతనిభావంబుఁ గని పతి యతఁడె యనుచు
సతులు మెచ్చంగ నతనితో సహగమించె. ౩౮

తే. అట్లు సమసినయట్టి విద్యాధరుండు
మలయకేతుభూపతి యయి మహి జనించె
నా సుశీల కళావతి యగుచు నతని
భార్య యై సుతత్రితయంబుఁ బడసె నంత. ౩౯

సీ. చిత్రకేతుండు కాశినిఁ బటమ్మున వ్రాసి
ధాత్రీశునకు నిడ దానిఁ బేర్మిఁ
జూపెఁ గళావతీసుదతికి నది చూచి
కను మూసి యోజించి కరముఁ జెలఁగి
తనవిభునకు నొగిఁ దద్విశేషంబులు
సూపుచు నద్దానిఁ జూచి మూర్ఛఁ
జెందిన భూపతి శిశిరోపచారముల్
సేయుచుఁ జెలిచెవిం జేరి జ్ఞాన
వాపిక యటంచు ముమ్మాఱు పలుక నపుడు
కన్ను విప్పి నాథా! నాకుఁ గలిగెఁ బూర్వ

భవపరిజ్ఞాన మీ జ్ఞానవాపిమహిమ
ననుచు నంతయుఁ జెప్పిన నలరి విభుఁడు. ౮౦

తే. ప్రౌఢు లౌ తనపుత్త్రులపైని రాజ్య
భార మిడి కాశికిం జని భార్యతోడ
జ్ఞానవాపికయొద్దనుఁ బూని తపము
సేయుచు వసించి ముక్తినిఁ జెందె నిందు. ౮౧

తే. చక్రమున విష్ణు వొక్కపుష్కరిణిఁ ద్రవ్వి
తన్నుఁ గూరిచి తపియించుతఱిని మెచ్చి
శివుఁడు తలయూఁచ దాపలచెవివిభూష
వడుట నది మణికర్ణికాఖ్యక మయ్యె. ౮౨

తే. ఐదుక్రోసులలోఁ జచ్చునఖిలజంతు
వులకుఁ బ్రణవోపదేశంబు సలుపు శివుఁడు
తారతమ్యంబుఁ జూడక తనకుఁ దానె
ముక్తి సమకూర్చుఁ గాశినిఁ బోల వెవియు. ౮3

## గయ

సీ. ఏమహాత్మునినీడ నెనసిన ప్రాణులు
శాశ్వతం బైనమోక్షంబు గాంచి
రద్దాన లోకమ్ము లన్ని శూన్యము లైనఁ
గని తత్తదధిపులు కపటవృత్తి
నదయు లై మఖమున కని యేఘునుని వేఁడి
తత్తనువున నతిదారుణముగ
నగ్నుల నిడి వ్రేల్వ నల్లనఁ గదలిన
నీశానవిష్ణ్వాదు లెక్కి త్రొక్క

నక్రమము సేతురే యన నడలి యాఁగు
మీవు గోరినవరముల నిత్తు మన్న
లోకహితముగ వరము లనేకములను
బడయునాగయాసురు శిరోభాగ మిద్ది. ౨౮

సీ. ఋతుమతి యై సీత యెనసి ఫల్గుని నందు
స్నాత యై యిసుకపిండములు లీలఁ
జేసి యొడ్డున నిడ్డ క్షేత్రమహిమఁ బితృ
దేవతల్ దానికే తృప్తు లగుచు
శ్రీరాముఁ డిడు వేళఁ జేరి చేకొనకున్నఁ
జింతించి ప్రార్థింప సీత యిడిన
యిసుకపిండములతో నే తేర రాముండు
గని క్షమాపణపూర్వకముగ నిడినఁ
బిండములు గొని పరితృప్తిఁ బితరు లేఁగ
సిగ్గువడి కిన్కఁ ఫల్గునిఁ సీత యీవ
హేతు వింతకు నని శపియించె నాఁటఁ
బట్టి ఫల్గుని యంతఃప్రవాహ యయ్యె. ౮౯

సీ. మగధదేశం బది మధువనంబందె చె
న్నగుఁ జంపకారణ్య మందె గిరికఁ
గన్నకోలాహలక్ష్మాధరమును నొప్పు
నగు గదాధరుఁ డి యందె దాని
కిం బశ్చిమముగఁ గనంబడెడిని శిలా
గద నైరృతాశను బొదలు దాని
కందె గాయత్రీమహాశైల మచటిగా
యత్రి దర్శించి గాయత్రినిఁ బది

సార్లు జపియించినఁ బురశ్చరణతుల్య
మగు గయాపిండదానంబ యఖిలజనుల
కౌఁ బితౄణవిమోచకం బాదినందుఁ
గర్తకుఁ బునఃపునానదీక్షౌరము విధి. ౮౪

తే. కల దలపునఃపునానది గయకు రెండు
క్రోసు లదె గయాముఖ మయి కొమరుమీఱు
వెలయు నదియు నష్టాదశపీఠులందు
నుండు మాంగళ్యగౌరియు నొప్పుమీఱి. ౮౫

గంగాసాగరసంగమస్థానము

క. పొంగుచు గంగానది యు
త్తుంగతరంగముల భర్తతోఁ బేర్మి మెయిన్
సంగమ మొనరించెడి సీ
మం గనినఁ గలుగు సర్వమంగళము లిలన్. ౮౬

కాళీఘట్టము

క. కాళీఘట్టంబు మహా
కాళీసాన్నిధ్యవిభవకలితము లక్ష్మీ
కేళీవాసము ప్రేక్షక
పాళీనేత్రోత్సవైకపద మై పరఁగున్. ౮౭

వ. దాని గుల్ఫపీఠ మందురు.

మహానది

సీ. ఆదిఁ గృష్ణజలమయం బైనతను వయి
కీర్తిఁ గాంచినయట్టి కృష్ణ యుండఁ

పార్వతీప్రీతికై భవుని మెప్పించి గౌ
తముఁడు వఱపిన గౌతమియు నుండ
నల భగీరథుఁడు భూస్థలికిఁ బితరులకై
కష్టించి తెచ్చిన గంగ యుండఁ
గృష్ణుండు చెలులతోఁ గ్రీడలు సలుపుట
సార్థమై యలరిన యమున యుండ
నెన్నియో పుణ్యనదు లింక నెసఁగు చుండ
నేదియది మహత్త్వమును బృథ్వి నెనసి చెలఁగు
న మహానదిమాహాత్మ్య మభినుతింప
నజమడానశేషుల కలవి కాదు. ౫౦

భువనేశ్వరము

క. భువనేశ్వర మహాక్షేత్రము
భువనేశ్వరనామమయమున రాజిలుచున్
శివలింగమ్ములు లాపై
భువిఁ దనరున్ లింగరాజు ముఖ్యు లోసఁగుచున్. ౫౧

తే. బిందుసరసీశిరోరత్నమంచుఁ జెలఁగుఁ
గలదు బ్రహ్మాలయమ్ము ప్రాక్తనము కరము
విశ్వకర్మ నిర్మితములు వేనవేల
గుడులునున్ గోపురమ్ములు గొనుచు మీఱు. ౫౨

జగన్నాథక్షేత్రము

సీ. ఉదధితీరమున యథోచితోన్నత మయి
యలరు మోక్షద్వార మైన నీల
గిరిఁ బురుషోత్తమక్షేత్ర సమాహ్వయం
బున జగన్నాథంబు పొలుచు నందు

స్వర్ణాంగి యైనసుభద్ర యామెకు వల
పల ధవళాంగుఁడు బలభద్రమూర్తి
దాపల శ్రీజగన్నాథుండు కృష్ణుండు
దారుమూర్తు లగుచుఁ దనరు చుండ్రు
స్యందనోత్సవానుగుణవిశాలపీర్ఘ
సకలవీథీమహోన్నతసౌధరాజి
రాజమానంబు ముక్తికి రాజధాని
దానిఁ బొగడంగఁ దగఁడు విధాత యేని. ౫౩

క. ఇంద్రద్యుమ్నమహీభృ
చ్చంద్రుఁడు గట్టించినట్టిసౌధములు తదీ
యేంద్రదిశఁ గ్రోసునం గల
వుం ద్రాపాడ మట మూర్తు లొకపదిదినముల్. ౫౪

క. గంగాజల మబ్లివ్వ రొ
సంగినఁ గైకొనవలెను బ్రసాదము శూన్యం
బెంగిలి యెల్లకొలమ్ములఁ
కుం గనఁబడ దట వ్యవస్థ గోరంతేనిన్. ౫౫

క. కల దైంద్రద్యుమ్నము ని
ర్మలజలము సరోవరంబు రాజులు నచటన్
జలకములాడిన ధర్మము
సలిపిన నరులకు ఫలించు సకలేష్టంబుల్. ౫౬

సీ. తనచక్కఁదనమును గని సుభద్రాదేవి
మనమున మోహంబుఁ గనిన శౌరి
సర్వజ్ఞుఁ డౌట నా జాడఁ గనుంగొని
యనుకంప బుద్ధుఁ డై యవతరించెఁ

గల్యాది నట నన్నగారిని విడ నోడి
బలభద్రుతోడ సుభద్రతోడ
నచటిపంఛాలతో నాస్థగోష్ఠిని దేవుఁ
డుండుట విని హరిద్యుమ్నవిభుఁడు
సపరివారంబుగాఁ జూడ సంతసమున
వచ్చి దేవుండు గనరామి వనటఁ జెంది
బహువిధమ్ములఁ బ్రార్థింప స్వప్నమందుఁ
గానఁబడి యిట్లు లనియె భూజానితోడ. ౫౭

సీ. ప్రాకృతజనదృష్టిపథమునఁ బడ నోడి
యంతర్హితుఁడ నైతి నబ్ధినుండి
కొలఁదిదినముల రాఁ గలవు దారువులు వా
నిని మమ్ముఁ గాఁ జేసి నిలిపి పూజ
సేయుము పగవకు చేకూరు మోక్షంబు
మా దర్శనంబున మా ప్రసాద
మున నెల్లనరులకు ననవుకు ముద మంది
యతఁడు వేచి యటులె యబ్ధినుండి
కొలఁదిదినములలో దారువులు దొరకినఁ
బొంగి యంతకు మున్న తాఁ గొలుపు మీఱ
సిద్ధపఱిచిన మందిరసీమ విశ్వ
కర్మగూఢవేషుం డౌచుఁ గాచి యున్న. ౫౮

సీ. ఆదారువులఁ దెచ్చి యాతని కిచ్చి వి
గ్రహములఁ గడుఁ జక్కఁగా రచింపు
మని యాతనికిఁ జెప్పి యతఁ డన్నపగిది నా
తఁడు దారువులు నున్నగుడులు మూసి

బిగువుగా బీగముల్ వేసి యుంచినఁ బది
దినములు సనుడుఁ దజ్జనని మూ_ర్తి
విశ్వాత్మఁ బ్రాకృతునిఁగ నెంచి యతని ని
రాహారసృష్టికి నబ్బురపడి
నగచి యాహారవిధికిఁ గా వసుమతీశుఁ
బుత్త్రు గుడి బీగములు దీయఁ బురికొలిపినఁ
దల్లి యానను మీఱఁగాఁ దగ దటంచు
నాత్మలో నెంచి యవ్వసుధాధిపుండు. ౫౯

మ. తలుపుల్ తీసిన విశ్వకర్మ యపు డంతర్ధానముం బొందె మూ
ర్తులు గాత్మేతులు పూ_ర్తి గాకునికి కెంతో రాజు చింతించి వే
తలుపు ల్మూసి క్షమింపు త ప్పనుచుఁ జింతాక్రాన్తుఁడై వేఁడినన్
ఫల మొక్కింతయుఁ గానరామిఁ బృథివీపాలుండు భక్త్యున్నతిన్.

సీ. పరమేష్ఠికడ కేఁగి ప్రార్థింప నిట నీవు
వచ్చినకాలంబు వత్స! దేవ
మానంబునన్ స్వల్ప మైన మానవమాన
మునఁ జాలకాలంబు సనియె నిపుడు
నీవంటిభక్తుండు దేవళమ్ములు గట్టి
వానిఁ బ్రతిష్ఠించె వైభవంబు
మీఱ నుత్సవములు మేలుగా జరుగుచు
నున్నవి చను మన్న నున్న డగుచు
వచ్చి పుడమిని బడి యేడ్చువానిఁ గాంచి
హరి కరుణ నీవు కట్టిన యాలయముల
వత్సరమ్మున కే మొకపదిదినములు
తప్పకుండంగ నుందు ముత్సవదినముల. ౬౧

తే. మమ్ము నాదినమ్ములఁ గను మానవులకు
దినమునకు వత్సరము నోగిఁ గనిన ఫలము
గలుగు నీ సరోవరమునఁ గాంక్షితార్థ
సిద్ధి చేకూరు సతతమ్ము సేవకులకు. ౯౨

వ. అని యానతిచ్చి యంతర్హితుం డయ్యె.

క. విమలానిలయము స్తనపీ
ఠము సింధుస్నానమున కిటం దిభులను వా
రములను గనఁ బనిలే దు
త్తమపుణ్యస్థలము ముక్తిదంబు సుఖదమున్. ౯౩

భారహము - బారువ

తే. భారహం బందు రద్దానిఁ బాండవు లటఁ
గపిలధేనువుఁ గనుఁగొని గవయ మనుచుఁ
గూల్చి విస్మృతులను బాపికొనిరి దొసఁగు
నధికఫలవృక్ష మై యొప్పు నబ్ధిదరిని. ౯౪

తే. ఎసఁగుచుండు నచ్చోట మహేంద్రతనయ
బహుపురాతనుఁ డగుహరి పాండవప్ర
తిష్ఠితం బగు లింగ మదృష్టపూర్వ
మస్థు లలరారు శిల లౌచు నందు నరయ. ౯౫

ముఖలింగక్షేత్రము

సీ. అలరును ముఖలింగ మనుమహాక్షేత్రంబు
వంశధారానదీప్రాంతమందు
మధుకేశ్వరుం డను మహితలింగం బుందు
ముఖలింగ మనినను బొలుచు నదియ

మునుపు మహారణ్యముగ నున్న నొక బోయఁ
డందలిమధుకంబు నాశ్రయించి
యిరువురుభార్యల నెనసి వసించుచుఁ
జెటిమొకవైపు నాచెట్టుఁ బంచి
యిడి పసిఁడిపూలె యొక్క తె కెపుడు దొరక
మార్చి ఫలముఁ గానక వారి మత్సరమ్ము
తీరు నని దానిఁ గత్తిచేఁ దెగ నఱికిన
దివ్యలింగంబు గననయ్యెఁ దేజరిలుచు. ౬౬

తే. అట్లు గన్పడి వారిచే నర్చితుఁ డయి
కరుణ నవ్వారి కపుడు మోక్షం బొసంగి
నిలిచె నంశధారాస్రవంతీతపఃఫ
లం బగుచుఁ దనసేవకులను మనుచుచు. ౬౭

## శ్రీకూర్మము.

తే. క్షీరనీరనిధిని మథించిన యదనునఁ
బద్మనేత్రుండు కూర్మరూపమున నందు
నిలుపఁ గూర్మేశ్వరుం డన నెగడి విష్ణు
వయ్యె రామానుజులమహాప్రాద్యమునఁ గలి. ౬౮

తే. కూర్మకుండంబు గల దందుఁ గ్రుంకు లిడినఁ
గోర్కె లీడేరు నెల్లభక్తులకు నచట
శ్వేతకేతుండు తపము సల్పినకతమున
శ్వేతగిరి యన నాగిరి చెలఁగుచుండు. ౬౯

తే. అటఁ దిలోత్తమ తపింపించి యభిమతంబు
గనుట నీనాఁటికిని ధనకామినులకుఁ

గలదు స్వాతంత్ర్య మొక కొన్ని కార్యములను
భోగమోక్షస్థలం బద్ది భూచరులకు. ౭౦

వ. అం దిప్పటికిని శివాలయత్వవ్యావర్తకంబు లనేకంబులు గన్పట్టుచున్నవి. ప్రాతః కాలమున నమకచమకాభిషేచనంబు తప్పదు.

## హర్షవల్లీక్షేత్రము

తే. హలధరుఁడు లాంగలీతీరమందు భక్తి
నించి కోటీశ్వరునిఁ బ్రతిష్ఠించువేళ
హూతుఁ డగుచు వచ్చిన పురుహూతుఁ డచటి
పురజనుల భక్తికి న్మెచ్చి పరవశుఁ డయి. ౭౧

తే. హర్షమునఁ దాను సూర్యనారాయణు నట
భక్తిమెయిఁ బ్రతిష్ఠించుటఁ బరఁగెడు నది
హర్షవల్లి యనంగఁ బాపాపహారము
క్షేత్రరాజంబు గరము ప్రసిద్ధ మగుచు. ౭౨

## సింహాచలము.

క. సింహాకృతినిఁ జెలాగుట
సింహాచలనామమునఁ బ్రసిద్ధినిఁ గనె స
ర్వాంహోనాశన మాగిరి
బంహిష్ఠఫలద్రుమంబు బహుళజలంబున్. ౭౩

క. నరుఁడును నారాయణుఁ డా
గిరిపైనిఁ దపంబు చేయఁ గిరిరూపమునన్
నరునకు హరుఁ డగపడి త
ద్వారముల నిడి యచట వెలసె వారాహాఖ్యన్. ౭౪

తే. కలవు పార్థప్రహారలింగం బటన్న
పేరు వారాహలింగ మన్పేరు నపుడు

మాఱె హరి యాచు నీశుఁ డే మహిత మహిమ
నో యిపుడు; వారికిఁ భేద ముండ చెపుడు. ౭౫

సీ. హరిభక్తి విడని ప్రహ్లాదు శిక్ష మరల్ప
హరి నరహరి యాచు నద్రియందు
జాఱిన పీతవస్త్రము సెఁగి నిజకటి
స్థలమున సవ్యహస్తమునఁ గొనుచు
నతివేగగతి వచ్చి యలసిన గరుడవా
హము నొక చేయిచే నిమురుకొనుచు
నఖిలలోకవిదిత మగు తన భక్తవ
త్సలబిరుదమ్మును నిలుపుకొనుచు
దుమికి కనకకశిపు లీలఁ దునిమి పేర్మి
భక్తుఁ బ్రహ్లాదుఁ గాపాడి వానిచేత
నటఁ బ్రతిష్ఠింపఁబడి యుండెఁ గిటి నృసింహ
మూర్తియై భక్తులకు భుక్తిముక్తు లిడుచు. ౭౬

వ. వరాహరూపమునకు నృసింహరూపమునకు భేద ముండుటను నీ రెండు రూపములు నొకమూర్తియం దుండుటకుఁ గారణ మగపడమియు నసంభవ మగుటను మఱియు గంధపుటొలుపునాఁడు మూర్తిని పరిశీలింపఁగా వరాహరూపముననే యుండుటం బట్టియుఁ బ్రహ్లాదునకు సాక్షాత్కరించిన దేవుండు నృసింహస్వామి యై యుండఁగా నా మహాత్ముండు వరాహమూర్తిని బ్రతిష్ఠించుటకు సందర్భ ముండకపోవుటను, స్వామి వరాహలింగమై యుండుటకు సందియము లేదు. ఇంతియ కాక యనేకప్రమాణములఁ జూపుచు నొక వైష్ణవోత్తముఁ డిది పూర్వమున శివక్షేత్రం బయినట్టు లుపన్యాసముఖంబున సిద్ధాంతీకరించెను.

## పిఠాపురము

క. పాదలుం బాదగయాఖ్యము
విదితము పితరుల కిడుదురు పిండము లంచున్

బరుసెనిమిదిపీఠంబులఁ
నది యొక్కటి పౌరుహూతి యందుఁ జెలంగున్. ౭౭

తే. పౌరుహూతి చతుర్భుజ పాణులందుఁ
గనకచషకంబు మాతులుంగమును డాలు
లోహదండంబుఁ బూని వెలుంగుచుండుఁ
బరఁగుఁ దత్సఖి హలంకృతి పురికిఁ దరిని. ౭౮

తే. భైరవుఁడు గోపురమ్ములపైనిఁ గాపు
చెంత నేలాప్రవంతిక చెలఁగి పాఱుఁ
గుంతి నిలిపినమాధవుల్ గోమరుమీఱు
సురలు మున్నాఁటయఱువంద్రు పఱఁగుచుంద్రు.

తే. కోఁడిపోలిక నుండుటఁ గుక్కుటేశ్వ
రాఖ్యఁ జెలఁగు లింగము స్వయంవ్యక్త మగుచు
దేవి రాజరాజేశ్వరి తేజరిల్లుఁ
గొలఁకులును బావులును బూలకోన లింపు. ౭౯

తే. కుక్కుటేశ్వరదేవుండు కూచిమంచి
తిమ్మకవిదక్షుకృతిసుతాధీనసోముఁ
డొసఁగు భోగమోక్షంబుల నెసక మెసఁగఁ
బీఠపురమున సట్టిది పృథ్వి లేదు. ౮౦

## కుమారారామము

క. పంచారామమ్ములలో
నెంచంబడుచుండు మిగుల నెన్నికఁ గనుచున్
గ్రౌంచవిదారణుఁడు ప్రతి
ష్ఠించన్ భీమేశుఁ డట్లఁ బ్రసిద్ధిగ నలరున్. ౮౧

తే. వింధ్యగిరినికటభూమికిఁ బెద్దతోడవు
వివిధఫలపుష్పవనవృక్షవిలసితంబు
వసతి నారాయణస్వామివారి కచటఁ
గొమరు మీఱంగఁ బ్రవహించుఁ గొమరువాఁక. ౧౨

## సర్పపురము

తే. తూర్పు గోదావరీసరిత్తునకుఁ దుల్య
భాగ కుత్తర ముదధికిఁ బశ్చిమమునఁ
గ్రోసులో సర్పపుర మొప్పు వాసిఁ గాంచి
భావనారాయణస్వామి పరఁగుచుండు. ౧౩

తే. అలరు నారదకుండం బనంతసరసి
ముక్తికాసార మనియెడు మూఁడుతీర్థ
ములు జగత్ప్రసిద్ధంబు లై చెలఁగువాని
కథలు చిత్రము లానందకరము లగుచు. ౧౪

తే. తల్లి కద్రువ శపియింపఁ దగ్ధు లైన
కశ్యపాత్మజు లౌ నురగములలోనఁ
దక్షకుండు నిర్భీకుఁ డై ధరఁ జరింప
శేషుఁ డగునసంతుఁడు భీతిచేత నచట. ౧౫

తే. చక్రధరుఁగూర్చి తపమును సలుప సతఁడు
పేర్మిఁ బ్రత్యక్ష మాచు నభీష్టవరము
లడుగు మన ననంతుండు నా కనవరతము
నీదుసాన్నిధ్య మిడి కరుణింపు మనుడు. ౧౬

చ. అలరితి నీవరమ్మునకు నర్భక ! నీ విఁక నాకు రమ్య మౌ
తలిమమ వై చెలంగుము సతమ్మును నీపయిఁ బవ్వళించెదన్

మలయసమీరణమ్ములు ఘుమంఘుమలాడుచు వీచుచుండు ని
చ్చలును యథేచ్ఛ భోజనము సల్పుచు నుండఁగవచ్చు నీవున్. ౮౭

తే. మఱియు నీతీర్థమును మహామహిమఁ దనరు
ముందు నే నొకకారణమున వసింప
నున్నవాఁడ నియ్యెడ నని కన్ను మొఱఁగి
నా యనంతునితోడుత నచ్యుతుండు. ౮౮

తే. అంతఁ గొంతకాలమునకు నజునిసభకు
నారదమునీంద్రుఁ డేఁగిన నళినసూతి
యచ్యుతునిమాయ గెలువ శక్యంబు గా ద
టంచు గోష్ఠీవశంబున ననిన వినుచు. ౮౯

క. నారదుఁడు లేచి సభలో
నీరజగర్భాద్యమరులు నిఖిలమునీంద్రుల్
చారణముఖులును విన ను
చ్చైరవమున నేను గెలువఁ జాలుదు ననినన్. ౯౦

క. వాంచిరి సభికులు మోములు
కాంచనగర్భుండు తగదు గర్వం బని బో
ధించెను సుతునకు నది విని
యంచితగతిఁ దండ్రి వీడి యరిగెన్ మునియున్. ౯౧

సీ. అంత నారదముని కొంతకాలమునకుఁ
దిరిగితిరిగి సర్పపురము సేరి
నిత్యకృత్యములను నెఱవేర్చుకొనఁదగు
నీరజాకరమును నెమకుచుండ
నద్భుతచరితుఁ డా నచ్యుతుం డమ్ముని
గర్వ మడంగింపఁ గడఁగి యొక్క

రమ్యమగు జలజాకరమ్మును గల్పింప
నది గని చెలఁగుచు నచటి కేఁగి
తీరమందలి మణివితర్దిక నతండు
వీణయును గమండలువును బెట్టి తాన
మాడ నచ్చెరువుగఁ బదియాఱువత్స
రముల రాకేందుముఖి యయి రహిఁ జెలంగె. ౯౨

తే. పురుషభావమ్ము తోడనే పోయెఁ గుండి
వీణెయును బ్రాగ్వివేకంబు వెలఁదితనము
తోనె మోహంబు వలువలుఁ దొడవు లలరె
రమణునిం జూచుకొనఁ జొచ్చె రమణి యంత. ౯౩

సీ. సుదతి నాఁ బేర్వడి ముదిత యట్లుండఁగఁ
జంద్రవంశజలధిచంద్రముండు
పీఠికాపురవాసి వీరబాహునిపౌత్రుఁ
డును శ్రుతకీర్తికిఁ దనుభవుండు
పుణ్యమూర్తి నికుండభూజాని వేఁటాడి
విశ్రాంతి కచ్చటివేదిపైని
గున్న మామిడినీడఁ గూర్చుండి తనవైభ
వమ్ముఁ జూచుచు నున్న వానిసొగసు
గాంచి మోహించె సుదతి యక్కాంతఁ జూచి
వలచె నాతండు నుభయులు గలిసి యేఁగి
పీఠపురమున నెమ్మి నభీష్టసుఖము
లనుభవించుచు నుండి రనంతరమున. ౯౪

తే. క్రమముగా ఘనబలపరాక్రముల నూఱ్వు
రను సుతులఁ గాంచి విశ్వంభరం బ్రకృష్ట

వైభవంబున నేలుచు బహువినోద
ములసుఖమ్ముగఁ గాలమ్ముఁ బుచ్చుచుండ. ౯౫

సీ. పశ్చిమాంబుధితీరవాసి రిపుంజయ
క్ష్మాధీశుపుత్త్రు లఖండశౌర్యు
లగు పరంతపుఁడు పరాస్కందపగవిశో
షకులు దిగ్విజయంబు సలుప వచ్చి
పూర్వాంబునిధితీరమున విడిసిన విని
కొడుకులతోడ నికుండభూమి
భర్త ససైన్యుఁడై బహుదినంబులు ఘోర
యుద్ధమ్ము సల్పి యాయుద్ధమందు
సర్వపుత్త్రసమేతుఁడై సమసిన విని
సుదతి యేతెంచి యవ్వారిఁ జూచి వగచి
క్షుత్పిపాసార్త యై యొక్క చూతఫలము
గాంచి యద్దానిఁ గోయఁగాఁ గడఁగుటయును. ౯౬

తే. అందునట్టులు కనిపించు నందకుండు
నందఁ దగుయత్న మొనరించు నంద దపుడు
నెందు నేదియుఁ గాన రా దందికొనఁగ
నంతకంతకు క్షుత్తృష్ణ లధికము లగు. ౯౭

తే. శోకమును వీడి కడుపుకై సుదతి యపుడు
సుతుల నూఱ్వుర దొంతిగా వెతకి పెట్టి
యెక్కి చే సాఁచినను బండు చిక్క దయ్యెఁ
దరమె గెలువంగ నేరి కేని దైవమాయ. ౯౮

తే. చేయునది లేక ఖిన్న యై చెట్టుక్రిందఁ
బండు విడలేక చూచుచుఁ బడఁతి యున్న

వృద్ధవిప్రునివలె వచ్చి విష్ణు వాపె
స్థితిగతుల నడుగ విసిగి చెప్పకున్న. ౯౯

తే. అమ్మ! యొంటిగా నీ యరణ్యమున నిట్టు
లున్న నీగతి నరయకయున్న నాకు
నడఁగు ధర్మంబు గావున నడుగవలసెఁ
జెప్పు నేఁ జెప్పుమాటలఁ జెవుల నిడుము. ౧౦౦

క. అని యావిప్రుఁడు సెప్పిన
విని తనవృత్తాంత మెల్ల విశదముగాఁ జె
ప్పెను సుదతియు నది విని యతఁ
డను నశుచివి నీకు నద్ది యందునె? బిడ్డా! ౧౦౧

క. చను మీత్రోవను సుదతీ!
వనజాకర మదియె కానవచ్చెడి నీకున్
మునుఁగుము తత్పావనజీ
వనముల నాదట ఫల మ్మవశ్యము దొరకున్. ౧౦౨

క. అని నుడివిన నయ్యనఘునిఁ
గొనియాడుచు సుదతి వీడుకొని చని కడఁకన్
గనుఁగొని య వ్వనజాకర
మున మునుఁగుచు నంతలోన ముని యై తనరెన్. ౧౦౩

తే. వనితకు మునిత్వ మబ్బిన వచ్చెఁ దెల్వి
తెలివి వచ్చిన జరిగిన తెఱఁగెఱింగి
సిగ్గువడి నారదుఁడు నాఁడు చేసినట్టి
తప్పునకు శిక్ష యిది యని తలఁచె నపుడు. ౧౦౪

తే. జ్ఞానమునఁ బూజ్యభావ మజ్ఞానమున న
పూజ్యభావంబు దప్పక పొడము చుండు

నెంతవారి కేనియు గర్వ మెపుడుఁ గూడ
దరయ గర్వంబుకన్న మౌఢ్యమ్ము లేదు. ౧౦౫

క. నారదముని భావించిన
నారాయణుఁ డగపడి ముని ననుఁ గావు మనన్
నేరమును సైఁచి యాతఁడు
గోరిన నట నిల్చి భక్తకోటుల మనుచున్. ౧౦౬

తే. కాన భావనారాయణాఖ్యను వహించె
స్వామి, మునిఁగిన బంధమోక్షంబు గూర్చు
కతన ముక్తికాసార మై క్రాలెఁ గొలను
నారదాజ్ఞాకరమ్ము సంతానకరము. ౧౦౭

## తుల్యభాగానది

తే. దైత్యుఁ డయ్యును బక్షపాతమ్ము విడి
దేవదానవులకుఁ దీర్పు దిద్దుచుంటఁ
దుల్యభాగాఖ్యఁ దగుమహాత్ముండు పఱపుఁ
గౌతమీశాఖ తుల్యభాగాస్రవంతి. ౧౦౮

తే. పరు నగస్త్యేశు సంగమేశ్వరుని ముక్తి
నాథు హరిహరబ్రహ్మలన్ గ్రమము మీఱఁ
దనరు తాపేశమున నబ్ధిదరిని బిల్వ
వనిని నోంకారపురిఁ గొల్చి చనిరి ముందు. ౧౦౯

## దాక్షారామము

క. దక్షారామం బలరును
దక్షుని యజ్ఞస్థలంబు దాక్షాయణికై

త్ర్యక్షుఁడు వసియించెడిది మ
హాక్షేత్రము దానిమహిమ యలవియె తెలుపన్. ౧౧౦

క. జలనిధి మథియించెడితఱి
హాలహాల ముదయించినన్ భయంపడి సురదై
త్యులు వచ్చి వేఁడ నట వా
రల కభయం బిడి శివుఁడు గరళమును మ్రింగెన్. ౧౧౧

క. సోమకళాభరణుండును
సోముఁడు గంగాధరుండు సులభుం డయ్యున్
భీమం బగుగరళంబును
భీమాకృతిఁ బూని మ్రింగి భీముం డయ్యెన్: ౧౧౨

సీ. కలశపాథోరాశిఁ గన్నవిం దొనరించి
పురదైత్యకులదైవముగఁ జెలంగి
వారి యప్రతిమానవైభవంబునకు ని
దాన మై తనరుచుఁ దత్పురములు
దార్ఢ్యంబు ప్రబలుట దైవ మట్లుండుట
దగ్ధంబు లైన నదగ్ధ మగుచు
దనుజపూజితబిల్వదళకల్పకుసుమగం
ధాక్షతాదులతోడ నచ్చెరువుగ
నందుఁ గన్పడి పంచతత్త్వాత్మకంబు
గాన రుద్రునిచేఁ బంచఖండములుగఁ
జేయఁబడి యం దొకండు తాఁ జేరె నందు
మునులు వెట్టినసుముహూర్తమునకు నెలమి. ౧౧౩

సీ. పాలకొలనునందుఁ బరఁగ శ్రీరాముండు
నిలుప రామేశుఁ డై నెగడె నొండు

సోముండు గుణుపూడిభీమవరమ్మున
నుంచభీమేశుఁ డై యొప్పె నొకఁడు
కృష్ణాతటంబున నింద్రుండు నిలిపిన
నమరేశ్వరుం డయి యమరె నొకటి
సామర్లకోటపజ్జను భీమనగరి నొ
కండు నిద్దానితోఁ గలిసి యైదు
భక్తులకు నెల్ల భుక్తియు ముక్తి నిడుచుఁ
జెలఁగు నారామములు సుప్రసిద్ధము లయి
మునులు సప్తగోదావరమును నచటికిఁ
దెచ్చుచోఁ దుల్యభాగానదీతటమున. ౧౧౪

సీ. దైత్యమునులు సప్తతంతువు సల్పుచుం
డుటయును నది మునుంగుటయుఁ గినిసి
వా రానదిని నిష్ప్రవాహ గాశపియించఁ
గాఁ దుల్యభాగ నగ్రాహ్య గాఁగ
నీరు శపించుట వీఁని వారిసి
వారించి శాపనివారణంబుఁ
దుల్యభాగుఁడు గోరఁ దుల్యభాగకు నీరు
భానువాసరములఁ బర్వములను
బుణ్యకాలంబులందును బూజ్యత నిడ
వారు నంతఃప్రవాహం బవార్యసరణి
సప్తమునిసింధువునకు నొసంగి రందు
చేత జాగయ్యెను మునులు చేరుసటికి. ౧౧౫

తే. అదనునకుఁ దానె నిర్ణీత మైనయట్టి
స్థానమున నిల్చె లింగంబు దానిఁ గాంచి

తరణి ముందుగాఁ బూజించె హరిహయుండు
జలజగర్భాదు లటుపయి సనిపి రర్చ. ౧౧౬

తే. అంత సప్తర్షు లరుదెంచి యందు నిల్చి
యున్న లింగంబు గని చింత నొందుచుండ
గగనభారతి వాక్రుచ్చెఁ గలతెఱంగు
నబ్బురంపడి మును లంత హర్ష మెసఁగ. ౧౧౭

తే. సప్తగోదావరాభిషేచనము సేసి
సక్రమంబుగఁ బూజించి స్వామి కపుడు
భీమనాథాభిధానంబు విహిత మనుచుఁ
బెట్టి పాడిరి నిజభక్తి వెలయ మిగుల. ౧౧౮

తే. అట్లు పూజించియును దృప్తి యమరకునికి
సప్తఋషులును సూర్యుండు సక్రమముగ
నష్టమూర్తుల నిల్పి రత్యంతభక్తి
నింద్రుఁ డింద్రేశ్వరుని నిల్పె నెలమి మీఱ. ౧౧౯

తే. సిద్ధులు ప్రతిష్ఠ సేసిరి సిద్ధనాథు
నందె ప్రాగ్వంశ మలరె దక్షాధ్వరమున
నమరు లమరేశుని యమేశు యముఁడు మఱియు
సనకముఖులు యోగీశ్వరేశ్వరు నిలిపిరి. ౧౨౦

తే. వీరభద్రేశు నిలిపిరి వీరభద్ర
ముఖులు వలఁగొని కుక్కుటములు భజింపఁ
గుక్కుటేశుండు వరదుఁడై కొమరుమీఱఁ
గలఁడు కాళేశ్వరుఁడు భక్తకల్పకంబు. ౧౨౧

తే. పద్మినీతీర్థ మలరును బశ్చిమమున
యజ్ఞసరసిని సతి పీడె నపఘనంబు

భైరవునిచేఁగపాలము వడినచోటు
తగఁ గపాలేశ్వరము జగత్ప్రథిత మగుచు. ౧౨౨

తే. మండవల్లి యుత్తరమున నుండు దక్షి
ణమున ఘట్టాంబ యుండుఁ బడమర గోఁగు
లమ్మ తూర్పున నుండు నూకాంబ దక్షు
వాటి నాల్గువైపుల సరోవరము లుండు. ౧౨౩

తే. ఎసఁగు రామేశ్వరుం డగస్త్యేశ్వరుండు
భైరవేశ్వరుండును గణేశ్వరుఁడు నాకు
లేశ్వరుం డను లింగంబు లేను భీమ
లింగపార్శ్వంబునందు వెలుంగు చుండు. ౧౨౪

తే. ఆస్పదము లౌచు వానికి నలరుచుండు
నైదు తీర్థమ్ము లవ్వానియందు మునుఁగ
ఘోరపాపంబు లడఁగుఁ జేకూరు సిరులు
మూలలింగంబు చెలఁగును ముఖ్య మగుచు. ౧౨౫

## పంచతీర్థములు

తే. హైమవతతీర్థ మొక్కటి యాజ్ఞతీర్థ
మొకఁడు సప్తగోదావరం బొకఁడు సోమ
నాథతీర్థం బొకం డఘనాశన మ్ము
పఱఁగునఖిలేష్టదము తీర్థపంచకంబు. ౧౨౬

## ద్వాదశతీర్థములు

సీ. ఇంద్రేశ్వరంబు సిద్ధేశ్వరంబును గుక్కు-
టేశంబు వీరభద్రేశ్వరంబు

బ్రహ్మేశ్వరంబుఁ గపాలేశ్వరమును గా
 శేశ్వరంబును శ్రీమహేశ్వరంబు
నింద్రేశ్వరంబు యమేశ్వరంబును భార్గ
 తితీర్థమును యోగితీర్థ మనెడి
ద్వాదశతీర్థముల్ తనరుచుండును దక్ష
 వాటిక వానిలోఁ బంచజనులు
స్నానదానంబు లొనరించి సకలవాంఛి
తార్థములు గాంచి మోక్షంబు నందుచుంద్రు
యమతటాకంబున న్నివాపాంజలులను
విడిచినన్ దరియింతురు పితరు లెల్ల. ౧౨౭

తే. దేవకార్యంబు హిమధరిత్రీధవుసిత
పోవిశేషంబు మేనకాపుణ్యవైభ
వంబు ప్రేరింప హరుఁ డధ్వరంబునఁ గను
మొఱఁగి తనయంద లీన యై పొలుచు సతికి. ౧౨౮

తే. ఆజ్ఞ యొసఁగిన ధవునిదేహంబువలన
వెడలి మాయాపురంబున విడిసి మాయ
క్రమముగా గిరిరాజన్యకన్య యయ్యె
నచలపతితపస్థలి యయ్యె హైమవతము. ౧౨౯

క. శ్రీమతి మాణిక్యాంబిక
భీమేశ్వరుధర్మపత్ని పీఠస్థలలోఁ
దా మాన్య యగుచు దక్షా
రామమ్మున నుండు గాఁపురమ్ము నలుపుచున్. ౧౩౦

తే. తనకు సాక్ష్యంబు తప్పక ద్వాదశాత్మ
యొక్కయాత్మ నందులకుఁ గా నుంచి యక్ష

రాజమిత్రునిఁ గొని తేర రజతగిరికి
నరిగి నంది వారించిన నతనిఁ బొగడి. ౧౩౧

తే. ఎట్టకేలకు శివుఁ గాంచి యెఱిఁగి వేఁడి
తన మనోరథమును నొగి మనవి చేసి
దక్షవాటికిఁ దరుణేందుధరుని సపరి
వారముగఁ దెచ్చె సంతోషపడిరి మునులు. ౧౩౨

తే. పూర్వజన్మంబునందలి పుట్టినిల్లు
గానఁ బార్వతి యనురక్తి గాఢమైనఁ
గాంతుఁ బ్రేరించి భీమలింగమున నిల్పి
తాను మాణిక్యతోఁ గూడి తనరుచుండె. ౧౩౩

క. మంకణముని తపము నిరా
తంకమ్ముగ నిందు సలిపి తద్దయు గౌరీ
శంకరులఁ దనిపి పడసెను
పంకజగర్భాదులైనఁ బడయనిపదమున్. ౧౩౪

## అంతర్వేది

తే. సాగరమ్మునకును వసిష్ఠకును నడుమ
నలరువేది యంతర్వేది యయ్యె నందుఁ
జెలఁగు నరసింహదేవుండు క్షేత్రపాల
కుండుగాఁ ద్రిలోచనుఁ డొప్పుచుండ నెలమి. ౧౩౫

సీ. మును హిరణ్యాక్షునితనుజుఁడు రక్తలో
చనుఁడు మహాతపంబును బొనర్ప
భవుఁడు ప్రత్యక్షమై వర మడుగు మటన్న
స్వామి! నాదేహంబువలసఁ గాఱు

శోణితమున నెన్ని రేణువుల్ తడిసెనో
యందఱు నాయట్టి రధికబలులు
పుట్టి శత్రువులను బోరిగొని మరల నా
కాయంబునం జేరఁగా వరమ్ము
నిడు మటన్నఁ దప్పక శివుం డిడెను వరము
దాన గర్వించి యందఱ దనుభవుండు
కసిమసంగుచు సకలలోకములు దిరిగి
చేరె నవ్వసిష్ఠాశ్రమసీమఁ బిదప. ౧౩౬

తే. శక్తి యను వసిష్ఠాత్మజుఁ జంపి మునుల
మ్రింగఁ బో నరుంధతి కని బెంగ లిడిన
విని వసిష్ఠుఁడు గనుఁగొని విష్ణుఁగూర్చి
ధ్యాన మొనరింప నరహరి కానిపించి. ౧౩౭

సీ. చక్రప్రయోగంబు సలిపి యా రక్కసుఁ
దునిమిన నాతని తనువు వలనఁ
గాఱురక్తమున సిక్తంబు లౌ రేణువుల్
తాదృశదనుజులై తార్క్ష్యుఁ దాఁక
మరలఁ జక్రమున నమ్మానవాదులఁ దున్మి
మునుల నోమి నృసింహమూర్తి యచట
నవ్వసిష్ఠునిచేత నపుడు ప్రతిష్ఠింపఁ
బడి భక్తజనులఁ గాపాడుచుండు
రక్కసులమేనులం గాఱురక్త మపుడు
గాల్వ యై వసిష్ఠాబ్ధిసంగమునఁ బడుట
దుష్టు లయ్యుఁ దన్మహిమను శిష్టులగతి
సద్గతినిఁ గాంచి రా రాక్షసప్రవరులు. ౧౩౮

తే. రక్తకుల్య నేఁటికి దాఁటి రారు భీతి
రాక్షసులు భూతములు బ్రహ్మరాక్షసాదు
లెట్టి దుష్టగ్రహంబు లే నెగిరిపోవు
నా నృసింహుని సేవించి రేని జనులు. ౧౩౯

## విప్రనారాయణతీర్థము

సీ. వేదపారగుఁ డనువిప్రుఁ డంతర్వేది
నలరు విద్వాంసులు నసదృశులును
గుణవంతులగు ననేకులు గొడుకులు గల
రమ్మహామహునకు నందుఁ జిన్న
వైన యానందేశుఁ డభినవగృహి శాంతుఁ
డతఁడు ముంగిట సుప్తుఁ డైనఁ జూచి
కంకాళిని యనురాకాశి యాతనిఁ గొని
గోదావరోత్తరకూలమునకుఁ
జేర్చి మేల్కొన్న నాతనిఁ జేరి యుచిత
భంగిఁ దనవృత్తమును దెల్పి వత్స! నీవు
నా నుడువురీతి నడువుము నడువ కున్న
మ్రింగుదు నటన్న భయమున లొంగి యతఁడు. ౧౪౦

తే. అమ్మ! నీ వన్నమాటకు నడుగు దాఁట
ననుడు న ల్లని మే ల్సేతు ననుచు నాపె
యతఁడు గొడుకుఁగాఁ దా నొకయమ్మ గాఁగ
మెలఁగు చుండిరి చూపఱు మెచ్చుపగిది. ౧౪౧

తే. అర్ధరాత్రంబునం దొరు లరయకుండ
స్వస్వరూపంబుతోఁ బోయి సంచరించుఁ

జరమరాత్రంబున న్వచ్చి జననియట్ల
మెలఁగు నవ్వానితోఁ గూడి కలసి మెలసి. ౧౮౨

సీ. అతఁడు బృహత్కీర్తి యనురాజు పాలించు
ధర్మనిలయపురిఁ దగ వసించుఁ
దోడిభూమిసురులతోడ గౌతమి కేఁగు
స్నానపూర్వకముగ సంధ్య వార్చు
నితఁడు నా కొడు కని యెల్లవారికిఁ జెప్పు
నాయమ్మయెడ వినయమ్ముఁ జూపు
నహామహా మికఁ బిల్చునందఱియిండ్లలో
నభ్యవహారమ్ము నాచరించు
నతనిసుగుణర్థి గని యొక యగ్రజన్మ
యలరి తనసుత నిడి వివాహమ్ము సేసి
కాఁపురమ్మున కనుప నక్కాంతఁ గాంచి
వగచుపతిఁ జూచి త్రప పీడి బాల యపుడు. ౧౮౩

సీ. నాథ ! మీ రిప్పుడు ననుఁ జూచి వగవంగఁ
గారణ మే మన్నఁ గలికి నన్నుఁ
గన్న దీయమ కాదు కంకాళిని యిది రా
కాసి నన్ను మ్రింగఁగలదు నిన్నుఁ
గూడ మ్రింగు నటంచుఁ గుంచెద నని రహ
స్యంబుగా నుడివిన నాత్మవిదులు
మీ రిట్లు చింతింప మేలె ? గోదావరి
యందును మునిఁగి నారాయణులను
ధ్యాన మొనరింపుఁ డన నతం డట్ల చేయఁ
దక్షిణంబునఁ జక్రి ప్రత్యక్ష మగుచు

రాక్షసినిఁ జంపి యట విప్రరక్ష సలిపె
విప్రనారాయణం బది విదిత మవని. ౧౪౪

## కోటితీర్థము

తే. తనరు వింధ్యాచలమునకు దక్షిణమునఁ
గోటితీర్థంబు గౌతమీకూలమందు
నెసఁగుఁ గోటీశ్వరుండు సిద్ధేశ్వరుండు
సోమనాథేశ్వరుండును సోమవాపి. ౧౪౫

సీ. కాశ్మీరమున నొప్పుకల్యాణపురమున
వృద్ధవిప్రుఁడు సుభావితుఁ డనంగఁ
దనరు నాతనిజాయ తరుణి దుర్మేధ నా
నతఁ డా పడఁతియందు నాత్మజన్ముఁ
గని సుమిత్రుని స్వర్గగతుఁ డైన దుర్మేధ
స్వైరిణి యై యిల్లుఁ బాసి పోయి
సోమప్రభాపురి సొచ్చి వేశ్యావృత్తి
నుండ నచ్చట సుమిత్రుండు పురిని

తే. విప్రడింభకులన్ గూడి వేదశాస్త్ర
పండితుం డయి స్వేచ్ఛగాఁ బత్తనములఁ
గనుచు సోమప్రభాపురమునకుఁ జేరి
పల్లవుం డయి దుర్మేధపాలఁ బడియె. ౧౪౬

తే. వారిమోహ మెట్టిదో కాని యూరుఁ బేరు
లడుగ నవకాశ మీయక యర్ధనిమిష
మట్టు లారేయి గడపిన నతనిమేన
నపు డపూర్వంబుగాఁ గుష్ఠ మగపడుటయు. ౧౪౭

సీ. అద్దాని నోరులకు నగపడనీయక
చని గోనదీస్నానమును బొనర్చి
యది గానరాకున్న నలరి దుర్మేధతో
రేలు పుచ్చుచు నిర్ఝరిణి మునుఁగుచు
నిష్కృష్టగాత్రుఁడై నిత్యంబుఁ జను జాడఁ
గని రోమశుం డనుమునివరుండు
పిలిచి యాతనియూరుఁ బేరును రేఁ జేయు
పనిఁ గనుఁగొని నీవు వచ్చునపుడు

సానియూరును బేరును సక్రమముగఁ
దెలిసికొని రమ్మనుడు నట్లు తెలిసికొనినఁ
దల్లి కొడుకు గాఁ దేలినఁ దద్ద వగచి
యిరువురును జని మౌనికి నెఱఁగి యనిరి. ౧౪౮

తే. అనఘ! యన్యకాంతలు తల్లు లంద్రు వారిఁ
గూడుటయె దోస మందులో ఘోరపాత
కంబు తల్లినిఁ గూడుట కలిగె నదియు
దీని కుండునె నిష్కృతి దీనరక్ష! ౧౪౯

తే. కొడుకుతోఁ దల్లి తల్లితోఁ గొడుకుఁ గూడు
ఘోరపాపకృత్యమునకుఁ గూడ నున్నె ?
నిష్కృతి యటంచుఁ గన్నుల నీరు పాఱ
నేడ్చుచున్న ని ట్లనియె మునీశ్వరుండు. ౧౫౦

తే. మీరు చేసినపాపంబు మిక్కుటంబ
నిష్కృతియు లేదు దీనికి నిక్క మైన
గౌతమీసత్త దెలియ శక్యంబు గాదు
తీఱు నద్దాన నయ్యది దీని వినుఁడు. ౧౫౧

తే. తల్లి గురుపత్నియును నొకతల్లికడుపు
వారె కద చందురుఁడు గురుపత్నిఁ గూడి
నట్టిపాప మీగౌతమియందు మునిఁగి
వీడి సోమేశు నిలిపె నీపీట నాఁడు. ౧౧౨

తే. దానఁ గాంచెఁ జంద్రుఁడు స్వపదంబు మరలఁ
గాన నీతీర్థమునఁ గొంతకాల ముచిత
వృత్తి మీ రున్నఁ బాపనివృత్తి యగు న
టన్న వా రట్లె కావించి యనఘు లైరి. ౧౧౩

## ఋణముక్తీశ్వరము

సీ. కోటితీర్థంబును గొలిచి శ్రీరాముండు
పుష్పకారూఢుఁ డై పోవునపుడు
కదలకుండిన నది కారణ మరయంగఁ
గపివరుల్ డిగి యటఁ గలయ నరసి
వేణుసంకీర్ణ మై పృథివీధరంబట్లు
పొలుచు చుండెడియొకపుట్టఁ గాంచి
భూజముల్ పెకలించి పుట్టఁ ద్రవ్వి కనిన
దేవాలయంబును దివ్యలింగ
మును దదంతికమున నర్ఘముకుళితాక్షి
యై జటావల్కలమ్ముల నమరఁ దాల్చి
యోగనిశ్చల యై యున్నయువిదయుఁ గనఁ
బడినఁ జని విన్నవించినఁ బ్రభుఁడు వచ్చి. ౧౧౪

క. లింగముఁ గని యలరుచుఁ బూ
జం గావించి పిదప జలజాతేక్షణ నం

దుం గని యుచితగతిం బిలు
వంగాఁ గను దెఱచి చూచి ప్రమదం బెసఁగన్. ౧౫౫

క. దేవా మీదర్శనమున
కీవిధమున నెదురుచూచు చుం దుంటి నను(ం)
బ్రోవఁగ నేఁటికి వచ్చితి
రే వాత్సల్యం బమరఁ దరించితి ననుచున్. ౧౫౬

సీ. ఉత్కళదేశమం దొప్పు పుండ్రక మను
పురి సోమశర్మ యన్మునివరునకుఁ
దనుజుఁ డై జయభద్రుఁ డనియెడిఘనునకు
జాయను నా పేరు శ్రమణి యంద్రు
నా ప్రాణనాథుండు స్నానంబునకు నేఁగఁ
గని నన్ను మొఱఁగిన ఖలుని విశ్వ
నాథుఁ డన్గంధర్వు నా విభుఁ డరుదెంచి
భూరికోపంబున బుగ్గి చేసి
కినుకఁ జండాలి నగునట్లు నను శపించి
చనిన నామామ యగుసోమశర్మ కరుణ
గౌతమీస్నానమున నన్నుఁ బూతఁ జేసి
లింగ మిద్దాని మహిమఁ గల్పించి యిచ్చి. ౧౫౭

తే. తపము సల్పుము తనయుఁ డై దశరథునకు
హరి యిటకు వచ్చువఱకు నయ్యనఘుఁ డోము
నిను ననుచు నేఁగె నాశ్రమమునకు మామ
ధన్య నైతిని నేఁటికిఁ దపము పండె. ౧౫౮

తే. అనుచు శ్రీరాముఁ డాలింగమును గుఱించి
ధ్యాన మొనరింప స్వామి ప్రత్యక్ష మైన

శ్రమణికి న్ముక్తి నొసఁగుఁడు క్షణములోన
ద్రష్టలకు మోక్ష మిం డని రాముఁ డనిన. ౧౫౯

సీ. అలరి మహాదేవుఁ డట్లె యిచ్చెద నని
యంతర్ధి నొందిన నంతలోన
శ్రమణి సాయుజ్యమోక్షమ్ము గాంచెను రాముఁ
డానందమునఁ దాను నందె నిలిపె
లింగ మాలింగమ్ముఁ ముంగల నది రామ
లింగ మన్పేర వెలుంగుచుండు
సేనలు గోరుట శ్రీరాము లోకదివ
సం బున్న నది యయ్యె సైన్యతీర్థ
మలరు ముక్తీశునకుఁ దూర్పునందు మూఁడు
వందలును రెండువేలును బశ్చిమమున
దక్షిణమ్మున మూఁడువే ల్దనరు నుత్త
రమ్మునం దైదువేలతీర్థంబు లరయ. ౧౬౦

## పుష్పగిరి (రాజమహేంద్రవరము)

సీ. దేవతలకుఁ బూర్వదేవు లోడి మయుని
శరణంబుఁ జొచ్చినఁ గరుణ నతఁడు
తనయోగబలముచేతఁ బురత్రయమును ని
ర్మించి యిచ్చిన ననిమిషుల మిగుల
వారు బాధించుచో నీరజగర్భుని
నమరులు రక్షింపు మనుఁడు నతఁడు
శివునిఁ బ్రసన్నునిఁ జేసికొం డన వారు
కైలాసమున కేఁగి గరళకంఠుఁ

దగువిధమ్మునఁ బొగడి కొండల మఱంప
వేఁడ నంగీకరించి య బ్బేసికంటి
తన పినాకంబుఁ గై కొని దనుజవరుల
నుగ్గుసేసిన నిర్జరు లుబ్బి రంత. ౧౬౧

తే. మయుఁడు కనుఁగొని తనయోగమహిమచేత
నమృతకూపంబుఁ గల్పించి యందు సమసి
నట్టియసురుల ముంచుచు నసికి మరలఁ
బంపుచుండుట నీక్షించి భవుఁడు వేగ. ౧౬౨

తే. విష్ణువును స్మరించిన వచ్చి జిష్ణు వత్సఁ
జేసికొని తాను ధేను వై చిత్రభంగి
నమృతకూపామృతము హరి యారగించెఁ
ద్రిపురములఁ గూల్చె నంతలోఁ ద్రినయనుండు. ౧౬౩

సీ. సకలలోకముల నుత్సవములు సేసిరి
బ్రహ్మావిష్ణ్వాదులు ప్రస్తుతించి
రానందపారవశ్యమున శంభుఁడు తాండ
వం బాడె హర్ష బాష్పములు వెడలి
యవని నందుం బడి యానందరససుధా
కుండ మై యలర శివుండు మెచ్చి
యిద్దానిస్పర్శంబు నెనసిన చేతనా
చేతనంబులు నాదుచెంతఁ జేరు
నని వరం బిచ్చి చనె రజతాద్రి కపుడు
శమనుఁ డద్దాని విని దానిస్పర్శ మెనయ
కుండఁ దగుతనభటులఁ గాపుండఁ జేసి
యరిగెఁ దనలోకమునకు ననంతరమున. ౧౬౪

తే. కొంతకాలమునకు భూమి ఘోరభంగి
నిర్జలం బైన యమభటుల్ నీరువట్టు
దుస్సహంబుగా నానందతోయ మాని
చనిరి తోడనె శివలోకమునకు నంత. ౧౬౫

క. ఆనందామృతకుండము
లో నీరము సులభ మయ్యె లోకుల కెల్లన్
దాన నఖిలలోకములకు
దీనత శివపదమున కురుతేజ మెసంగెన్. ౧౬౬

క. లోకాధిపతులు తమతమ
లోకమ్ముల సేగి సత్యలోకేశునకున్
వ్యాకులు లై తెలుపంగా
నాకర్ణించినవిరించి యనె నమరులతోన్. ౧౬౭

సీ. సురలార ! మీరలు క్షోణీధరముచేత
నానందరసవాపికాననంబు
గప్పి యద్దానిపైఁ గాపువెట్టితి రేనిఁ
బాయక లోకము ల్బాగుపడును
జనుఁ డని నుడివినఁ బనివిని వారలు
వామనగిరి దెచ్చి వాపిపైనిఁ
బెట్టి కాపుంచిన గట్టు కైలాసంబుఁ
జేరె రివ్వునఁ గాచువారితోడఁ
జేయుపని లేక సుర లెల్ల క్షీరసాగ
రమునఁ బవళించుచక్రిదర్శనము చేసి
మనవిచేసిన హరి కృప హనుమఁ దలఁచె
వచ్చెనతఁ డాతనికి శార్ఙ్గి పలికె నిట్లు. ౧౬౮

## పుష్పగిరి

తే. మందరునిభార్య సర్వాంగసుందరియగు
ప్రభ శివుని నన్నుఁ గూర్చి తపమ్ముఁ జేయఁ
గరుణఁ గనుపడి యడుగుము వరము లనుడుఁ
గోరె ననుపమభక్తునిఁ గొమరు నాపె. ౧౧౯

సీ. మెచ్చి యీ వరము మే మిచ్చిన ననుపముం
డుదయించె నా పెకు నొకకుమారుఁ
డతఁడు నిశ్చలచిత్తుఁ డై తపించుచునున్న
వచ్చి దుర్వాసుండు నానియెదుట
నిలిచి యాతఁడు తన్నుఁ దెలిసికొనకయున్నఁ
గుధర మగు మటంచుఁ గుపితుఁ డగుచు
శపియించి చనఁ గులక్ష్మాధరమున నద్రి
యై యుండె నీ విప్పు డతనిఁ దెచ్చి
ధవళపద్మంబ నై పుట్టి తద్ద పెఱిఁగి
హర్షరసవాపికానన మాక్రమించి
యుండునాపయి నిడి చను ముచితభంగి
ననిన నతఁ డట్ల చేసిన నచ్యుతుండు. ౧౨౦

తే. ప్రకృతిపురుషునిపగిది నాపర్వతమును
జక్రధరుఁ డాక్రమించెను శర్వుఁ డందు
వాస మొనరించె నదిమొద లా సరస్సు
గానరాక యంతర్యాత మై నిలిచెను. ౧౨౧

తే. శివుజటాగంగ గౌతమి దవ్వు సముద్రుఁ
గూడఁ బోయెడితఱిఁ బుష్పకుధర మొఱసె

హర్ష బాష్పామృతము పొంగి యపుడు దానఁ
గలిసె సహవాస మెడలినఁ జెలఁగు మైత్రి. ౧౭౨

తే. ప్రొది నానందరససుధావాపి దాని
పైని ధవళపద్మం బొచ్చఁ బరఁగుహారియు
నతనిపయి నొకపుణ్యపర్వతము దాన
హరుఁడు గౌతమి యా తీర్థ మనుపమంబు. ౧౭౩

తే. పద్మగిరి ధవళగిరి పుష్పగిరి యనెడి
పేరులన్ క్షేత్ర మయ్యది వెలయుచుండు
లక్షముప్పదితీర్థముల్ దనరు నందు
మునులకును దేవతలకును ముఖ్యపదము. ౧౭౪

సీ. శివుఁడు పార్వతిచేత శిలనుద్రొక్కించుచోఁ
దల్పదాంగుష్ఠంబు ధాత యరసి
వ్యామోహమును జెందె నపుడు తేజము డిందె
నద్దాని నలిపిన నచ్చెరువుగ
వాలఖిల్యాదులు బయలుపడిరి కని
చప్పట ల్గొట్టిరి సభ్యు లపుడు
తాత సిగ్గిలి సభ తనయాసనము డిగ్గి
పోయిన నందిచే భూతభర్త
యజునిఁ బిలిపించి యోజించి యాత్మశక్తి
భూజలమ్ములసారము ల్పొందుపఱచి
కుండియును గంగయును జేసికొను మటంచు
బ్రహ్మ కిడె దానఁ బూతుఁడై పరఁగె విధియు. ౧౭౫

తే. సతికి నర్ధదేహం బిడుసరసుఁ డగుట
గంగ రసమూర్తి యాట నపాంగవీక్ష

ణముల నుమ చూచుతఱి యూట నాఁడె వలచి
జటలలో దాఁచికొని శూలి సగము గంగ. ౧౭౬

సీ. బలిబంధనమ్మున వామనుం డంఘ్రిచే
నాకాశమార్గంబు నాక్రమింపఁ
జనియె నాపాదంబు సత్యలోకమునకు
ధాత కమండలూదకముచేత
నభిషేచనము చేసె నది కనకాద్రిపైఁ
బడి నాల్గుదెసలకుఁ బాఱె నందుఁ
బ్రాక్ప్రవాహంబు దేవతలును ఋషులును
బితరులు గ్రహియించి రతిముదమునఁ
బశ్చిమప్రవాహము చేరె బ్రహ్మకుండి
నుత్తరఝరంబు విష్ణువు గుత్తగొనియె
దక్షిణజలంబు శివుజటాస్థలి వసించె
గౌరి పూర్వమె కని దానిఁ గంటగించె. ౧౭౭

ఆ. అట్లు కంటగించి యద్రిజ విఘ్నేశు
నెట్టు లేని గంగ నీశుజడల
వీడఁ జేయు మన్న విని షణ్ముఖుని జయఁ
దోడుఁ గోర నిడియోఁ దుహినగిరిజ. ౧౭౮

సీ. ఇరువదినాల్గువత్సరములకఱ వంత
వచ్చుటయును మును బ్రహ్మ క్రతువు
జరుపుటచే బ్రహ్మగిరి యనంబడుగౌత
మాశ్రమంబును జేరి యఖిలమునులు
న య్యనఘునిచేత నాదరింపఁబడుచు
సుఖముగా నుండుట సుప్రసిద్ధి

గౌతముపా లౌటఁ గని జయాగుహాకరి
ముఖు లిది తఱి యని ముదితు లగుచు
యోగివేషమ్ములం దాల్చి యుచితరీతి
నచటిమునులలో ముఖ్యు లై యందు నందుఁ
దా ముపన్యసించుచుఁ దపోధనుల కెల్ల
స్వాశ్రమోత్కంఠఁ గల్పించి రంత వారు. ౧౭౯

తే. అందఱుం గూడికొని గౌతమాంతికమునఁ
కఱిగి సెల వడుగుచు మౌని యమ్మునులను
దగువిధమ్మున బ్రతిమాలి మగిడి యుండు
నట్లు లొనరించుకొనె నది యరసి మరల. ౧౮౦

సీ. మనల నన్నమునకుఁ గొనియెనా యిమ్మౌని
యెంతకాల మిచట నిట్టు లునికి
మనల నాపత్కాలమునఁ బ్రోచెఁ గావున
దండ మీతనియెడఁ దగదు మనకు
సామవాక్కులఁ బని సాగదు మన కేమి
దారి ముం దనుచు నందఱుగూర్చి
యైన నే నొకయుపాయముఁ జేతు మీ రట్లు
నడుతు రే! యన వారు నడుతు మనుచు
వారణాస్యందు జయ నుపహ్వారమునందు
బడుగుగో వయి గౌతమువరిని మేయు
మతఁడు నిన్నేమి యన్న బిట్టఱచి క్రిందఁ
జచ్చిచావనియట్టులు సరగఁ బడుము. ౧౮౧

క. అని నుడివి పనుపఁగా జయ
యును జని యారీతిఁ జేయ నొకపరి మౌనుల్

చనుదెంచి యకట! గోహ
త్యను బూనఁగ నాయెనే యటంచు వగచుచున్. ౧౮౨

తే. మీరు పూతతఁ గనుదాఁక మేము మీఁత
పోవనాంతరమున వాసముసు బొనర్ప
నీలు కాదు కావున బయల్ వెడలుదు మన
మునులఁ బ్రార్థించి గౌతముం డనియె నిట్లు. ౧౮౩

తే. అనఘులార! పూతత నాకు నానతీరె
మీర లీకున్న నా కేది దారి యనుడు
మునులలో ముఖ్యుఁడై యున్నమూషకాశ్వుఁ
డదను గుదిరెను నేఁ డని యనియె నిట్లు. ౧౮౪

తే. గరళగళుజటాటవి నున్నగంగఁ దెచ్చి
యిందుఁ బ్రవహింపఁజేసితి వేనిఁ బోవుఁ
బాప మనవుడు నది యెంతపని యొనర్తు
ననుచు గౌతమముని యనునంత సురలు. ౧౮౫

క. కురిసిరి పువ్వులవానలు
విరిసెను గిరిజాతవదనబిసరుహ మెలమిన్
బరిశీలించెను హేతువు
స్ఫురియించెను మౌని కపుడు మోదం బమరెన్. ౧౮౬

తే. అట్లు తెలిసియు దేవకార్యంబు గాన
నవనికి హితంబు తన కలంఘ్యంబు గానఁ
బ్రతినఁ జెల్లించుకొన నేఁగె రజతగిరికి
గౌతమమునీంద్రుఁ డప్పుడు గౌరి యలరె. ౧౮౭

తే. అట్లు కైలాసమున కేఁగి యమ్మునీంద్రుఁ

డభవు మెప్పించి తెచ్చినయది యది సుఁడీ
గౌతమి యనంగ సామాన్యయే తలఁపఁగ
దాని మాహాత్మ్యము వచింపఁ దరముకాదు. ౧౮౮

సీ. మును మృకండుం డనుముని కది యాశ్రమ
మయి వసుంధర మహాఖ్యాతిఁ గాంచె
మును మృత్యువును గెల్వఁ దనుఁ గొల్వ జముఁ దన్ని
యట మృకండతనూజు నభవుఁ డోమె
మున్ను దేవతలును మునులును లింగమ్ము
లయ్యెడ నిలిపి కృతార్థు లైరి
రాజరాజనరేంద్రుఁ డోజఁ బాలించుచు
నన్నయకృతినిఁ జేకొన్న దటనె
అందె సారంగధరునకు నాది నాంధ్ర
శబ్దశాస్త్రంబు వాగనుశాసనుండు
చేసి బోధించి మిగులఁ బ్రసిద్ధిఁ గాంచె
నిందిరకు గీము రాజమహేంద్రవరము. ౧౮౯

## పట్టిసక్షేత్రము

ఆ.వె. పట్టిసాయుధంబు భవునిఁదా మెప్పించి
తనదుపేర ధరణి తనరునట్లు
తన్ను నాయుధముగ ధరియించునట్టులు
వరము గొనుట నయ్యెఁ బట్టిస మది. ౧౯౦

## చక్రతీర్థము

సీ. మును హరి మురదనుజుని బొలియించిన
నతనిసుతుండు సురాంతకుండు

కినుక నాతనిఁ గూల్పఁ గిరిశుఁ బ్రతిష్ఠించి
పూనికమెయిఁ దపమ్మును బొనర్ప
ముల్లోకములు తల్లడిల్ల సురలు శౌరిఁ
జేరి మొఱలు వెట్టఁ జేరఁదీసి
వానిపైఁ జక్రంబుఁ బఱపిన నసురుఁ డా
లింగమ్ము భీతి నాలింగనమ్ముఁ
జేసికొని వేఁడఁ గరుణించి శివుఁడు దోఁచి
దాని మ్రింగుట, విష్ణు వద్దానికొఱకు
వేయితమ్ములఁ దన్నుఁ మెప్పింపఁ జక్ర
మతని కిడుటఁ, జక్రేశ్వరుం డయ్యె శివుఁడు. ౧౯౧

తే. అపరకుంభజుం డతిశాంతుఁ డగుదధీచి
బడబ నా గభస్తిని యనంబడు నగస్త్య
ధర్మపత్నిసహోదరి తనదుసాధ్వి
కొలువ నచ్చోటఁ దపమును సలుపుచుండ. ౧౯౨

సీ. దుష్టదనుభవాదిదుర్గంబు నుత్సృష్ట
సహజవైరసకలసత్త్వసంఘ
మగుచు నా యాశ్రమం బలర నయ్యది గాంచి,
యమరులు శత్రుజయంబునంది
తమయాయుధమ్ములు దనుజులు గొనకుండ
నందు దాఁచికొనఁగ నరుగుదెంచి
యమ్మునిఁ బ్రార్థించి యట నాయుధము లుంచి
చని యెన్నటికినిఁ గైకొనకయుంట
దనుజు లతిఘోరముగఁ దపమ్మును బొనర్చి
యత్యధికబలవిక్రము లగుచు నుంటఁ

గని దధీచి మహాముని తనదుశక్తి
జలము గావించి యఖిలశస్త్రములఁ ద్రోలె. ౧౯౩

సీ. అమరు లంతట వచ్చి యయ్యనఘుని వేఁడ
సతి సన్నిధిని లేని సమయమందుఁ
దనయోగబలమునఁ దనువును విడి వారి
కిడినఁ దచ్ఛల్యము లెలమి వార
లాయుధార్థము గొని యరిగిన నంతలో
బడబయుఁ జనుదెంచి పతిని గనక
తద్వృత్తమును వహ్ని తనకుఁ జెప్పిన నల్క
నమరుల వధియింతు ననుచు నెంచి
సురహితార్థంబు తనమనోహరుఁ డొనర్చి
నట్టిపని కిట్లు చేయు టనర్హ మనుచు
దానిఁ జాలించి గర్భంబుఁ దాల్చుకతన
భర్తృసహగమన ప్రతిబంధ మగుటను. ౧౯౪

తే. కుక్షి భేదించి శిశువును గొని కరంబు
దుఃఖపడి పెంపఁ బిప్పలద్రుమముల కిడి
ప్రజ్వలద్వహ్నిముఖమునఁ బ్రమద మెసఁగ
సాధ్వి ప్రాణేశ్వరునితోడ సహగమించె. ౧౯౫

తే. తమ కధీశ్వరుఁ డైనచంద్రముని వేఁడి
పిప్పలంబులు సుధఁ గొని పెనుప శిశువు
దినదినంబును బెరుఁగుచుఁ దెల్వి గాంచి
సృష్టిపరిశీలనమ్మును జేయఁ దొడఁగె. ౧౯౬

తే. అట్లు పరిశీలనముఁ జేసి యతఁడు తనదు
పుట్టువునుగూర్చి యడుగఁగాఁ జెట్టులు గల

తెఱఁగు దెలిపినఁ గరము చింతించి కినుక
సురలఁ బరిమార్చుమార్గంబు సరయుచుండె. ౧౯౭

సీ. రావు లీస్థితి ద్విజరాజున కెఱిఁగింప
బోధించి బాలుని బుజ్జగించి
ఫలము గాన కతని ప్రతిబంధమున శశి
చక్రేశుఁ గొలువుము సరగఁ గార్య
సిద్ధి నీ కగు ననఁ జెలఁగుచు నతఁ డేఁగి
యద్దేవుఁ గొలువఁ బ్రత్యక్ష మగుచు
నఖిలాదితేయసంహరణశక్తినిఁ గోర
ఫాలాక్షుమును జూడఁ జాలునాఁడు
నీకు నది లభియించును బో కుమార!
యనుచు నంతర్హితుం డైన నతఁడు దాని
కొఱకు బహువత్సరమ్ములు ఘోరతపము
సలుప వికచఫాలాక్షునర్చనము కలిగె. ౧౯౮

క. బాలుం డలరుచుఁ బొగడుచు
ఫాలాక్షుముఁ గని నిఖిలసుపర్వులఁ గూల్పం
జాలెడిశక్తి నడుగ నా
భీలమ్ముగ దాన శక్తి వెడలె బడబ యై. ౧౯౯

తే. భీషణానలగర్భ యై భీషణముగ
బడబ యేతెంచి ప్రసవించి బాడబంబు
వివృతఘోరాస్య యై వాని వెంబడింప
వేల్పులను మ్రింగు మనవుడు విడిచి యతని. ౨౦౦

తే. దేవతల నెల్ల మిగుల బాధించుచున్న
వారు చక్రేశుసన్నిధిం జేరి వేఁడఁ

గరుణ నిచటి కామడ నలుగడల కవల
బడబ బాడబం బుండ నేర్పఱచి శివుఁడు. ౨౦౧

తే. అమరు లెల్లరు నిర్భయు లగుచు నిందు
నుండుఁ డని వీరభద్రుఁ గాపుండఁ జేసె
నతనిశూలఘాతమ్మున నయ్యె భద్ర
కుండి సుర లెల్ల నిచ్చట నుండి రపుడు. ౨౦౨

తే. అట్లు కొంతకాలం బుండి యమరు లెల్ల
నెంతకాల మిం దుందు మం చెంచి యభవు
వేఁడికొన బాలు మీరలు వేఁడికొనుఁ డ
టన్న సుర లెల్లఁ దగురీతి నతనిఁ బొగడి. ౨౦౩

తే. పితరు లపు డాతనికిఁ గనిపించునట్లు
పైప్పలం బనఁ దీర్థంబు పరఁగునట్లు
పిప్పలమ్ములు పూజ్యత వెలయునట్లు
లతఁడు పిప్పలాదుం డగున ట్లొనర్చె. ౨౦౪

తే. మరియు నాతండు గోరినవరము లొసఁగి
బడబ శాంతింపఁ జేయవే! బాలక యన
నేను జాల నందుల కెట్లొ దాని మీరె
వేఁడికొనుఁ డనవుడు వారు వేఁడికొనిన. ౨౦౫

తే. అందఱివి మ్రింగఁ బొడమినయట్టి మాకు
నన్నము రుచించునే యన నట్లె చేయ
వచ్చు మేము చూపించినవాని నెల్లఁ
గాని భుజింపుఁడు భుక్తికిఁ గొదవ రాదు. ౨౦౬

తే. అనిన బడబయు నద్దాని కనుమతించి
వారు చెప్పినరీతి గోవాహినీజ

లముల నది యయి క్రుంకుజనము లొసంగు
మృత్తు నిడనివారిఫలము మెసఁగుచుండు. ౨౦౭

తే. స్వర్ణపాత్రమం దిడి సరస్వతి కరమ్ము
యమున మున్నగునదులసాహాయ్య మొంది
వార్ధికిం దన్నుఁ జేర్చిన బాడబంబు
నందు సుఖముగా నివసించె నమరు లలర. ౨౦౮

తే. సర్వదేవాత్మకుని నమస్కారుని సురలు,
శివుఁడు నడువుట నటఁ బ్రతిష్ఠించి కష్ట
కాల మట్లట్లు నేర్పుగాఁ గడపుకొనిరి
కాన నందు సూర్యుం డుండుఁ గాఁపురంబు. ౨౦౯

సీ. సురలయానతి మునీశ్వరుమెయిం జీరిన
పాపంబు గోవులు పాయుచోటు
బ్రాహ్మణాస్థులు పట్టు పాపంబు దేవతల్
పోఁగొట్టుకొనినట్టి పుణ్యభూమి
కశ్మలంబు లగుచుఁ గాయంబులో నుండు
నస్థులు విమలంబు లైనతావు
గోదావరీనదీకూలవిరాజమా
నంబు లై సుప్రసిద్ధంబు లగుచుఁ
బరఁగుచుండును బుడమిలోఁ బాపనాశ
నంబు పావనంబు పితృతీర్థంబు నల్లె
యలరు గోతీర్థమును జగత్ఖ్యాత మగుచు
నహాహా ! గౌతమీమాహాత్మ్య మబ్బురంబు. ౨౧౦

భద్రాద్రి

సీ. మేరువు భార్యాసమేతుఁ డై యంభోజ
భవునిఁగూర్చి మహాతపం బొనర్చి

హరిపదాంబుజభక్తిభరితుఁ డౌసుతు భద్రుఁ
బడసినన చలుఁ డై కడుఁ దపంబు
సలుపుచు నతఁ డుండ జానకీలక్ష్మణ
సహితుఁ డై రాముఁ డచ్చటికి వచ్చి
వత్స! భక్తాగ్రణి! వర మీయవచ్చితి
వేఁడుము నావుడు వినతుఁ డగుచు
దేవ! మీరలు సతము నాపై వసించి
నన్నుఁ దరియింపఁ జేయరే! యన్న వారు
పశ్చిమాభిముఖమ్ముగా వఱలిరి గిరి
దక్షిణాభిముఖముగ గౌతమి చెలంగ. ౨౧౧

## దుర్గాచలము

తే. కనకదుర్గాంబికకుఁ గట్టు నునికిపట్టు
మల్లికార్జునస్వామికి మనికిపట్టు
కవ్వడితపమ్మునకుఁ బట్టు గలవు మెట్లు
గిరికి దక్షిణమ్ముగఁ బాఱుఁ గృష్ణ యొఱసి. ౨౧౨

సీ. బ్రహ్మచే విష్ణుండు ప్రార్థింపఁబడి పేర్మి
సృజియించెఁ దొలుదొల్త నేస్రవంతి
జలమయి యయి మహి వెలయువిష్ణునిమూర్తి
యగుటచే నెయ్యది యయ్యెఁ గృష్ణ
ధర్మంబు కృష్ణుఁ డై ధాతృలోకమునుండి
యేద్వీపవతిని దా నిలకుఁ దెచ్చె
నఘముల హరియించి యఖిలవిధమ్ముల
నేనది ప్రజలకు హిత మొసంగుఁ

దన్నుఁ గూర్చి చలింపక తపము సేయు
సహ్యగిరిశృంగమున నెద్ది జాలువాఱె
నట్టిలోకైకపావని యైనకృష్ణ
సకలశైవలినీవతంస మయి తనరు. ౨౧౩

తే. వఱలు నుత్తరశృంగంబు బ్రహ్మగిరిగ
దక్షిణంబు వేదాద్రిగాఁ దనరు సహ్య
గిరికి రెండింటినడుమను బరఁగు తీర్థ
మామలక మన వేణ్యుదయస్థలంబు. ౨౧౪

తే. వేణిఁ గృష్ణునియాజ్ఞచే విధి సృజించెఁ
గృష్ణ యశ్వత్థమూలంబు నెనసి విష్ణు
తీర్థముననుండి పాఱెనీ ద్వీపవతులు
కలిసి కృష్ణవేణి యనంగఁ గరముఁ జెలఁగు. ౨౧౫

సీ. శిఖరదర్శనకరస్థిరముక్తి వితరణ
బద్ధకంకణము శ్రీపర్వతంబు
సకలమునీశమోక్షప్రదానవిదిత
ముక్తీశనిలయంబు ముక్తితీర్థ
మమరలోకాధీశసుమనఃప్రతిష్ఠితో
మేశ్వరం బగునమరేశ్వరంబు
నేకరాత్రప్రసన్నేశ్వరకాకుళే
శాకరం బైనశ్రీకాకుళంబు
మొదలుగాఁ గలతీర్థముల్ పొదలు నుభయ
తీరములఁ బ్రకాశించునాదివ్యతటిని
ఘోరకిల్బిషనాశనకారణంబు
మహికి హారంబు కృష్ణ సామాన్య కాదు. ౨౧౬

సీ. దుర్జయుం డై జగద్ద్రోహంబు గావించు
దుర్గమాసురు నందు దుర్గ కూల్చి
స్తుతిపూర్వకమ్ముగ సురలు దన్నట నుండ
వేఁడిన నా గిరి న్వేలసి యుండె
నందు నందుఁ గనక మగపడుచుండుటఁ
గనకాఖ్య నాగిరి ఖ్యాతిఁ గాంచె
నసురజయస్థాన మగుటచే నయ్యది
జయవాటికాహ్వచే జానుమీాఱె
విజయుఁడు తపించుటం జేసి విజయవాటి
కలరితినిఁ జెలఁగుటఁ గిలగిరియు
నన్యోన్య య్యద్రిచేయుపుణ్యంబుఁ జెప్ప
నలవియే! నాల్గుమోములయయ్యకైన. ౨౧౭

మంగళగిర్యాదులు

సీ. క్రౌంచపర్వతమునఁ గలఁడమరేశుండు
చాముండికేశుఁడు శంకరుండు
మంగళగిరిపైని మహిమఁ జెన్నలరారు
పానకాలనృసింహపతి మురారి
కొలిచినభక్తుల కొంగుబంగారమ్ము
కోటీశ్వరస్వామి కొండ నుండుఁ
జేజర్లలో వెలసెను గపోతేశుండు
శివవరదుఁడు చంద్రశేఖరుండు

శ్రీశైలము

తపముఁ జేసి శిలాదర్షి తన్ను నందిఁ
బుత్త్రులనుగఁ గొనినఁ దపంబును బొనర్చి.

శిఖరితను శివాస్పదతను శిఖరదర్శి
ముక్తిదత్వంబుఁ గైకొన్న భక్తిశాలి. ౨౧౮

క. శ్రీశైలంబు ప్రసిద్ధం
బే శైలంబులును దాని కెనగా వనిశం
బా శావసనుఁడు ప్రమథుల
తో శైలజతోడ సుతులతో నం దుండున్. ౨౧౯

చ. వసుమతిపేర నొక్కమునివర్యునిపుత్త్రి ధరిత్రి నొప్పు నా
బిసరుహపత్త్రనేత్ర కడుఁబెద్దతపం బొనరింపఁ బ్రీతుఁడై
బిసరుహసూతి కానఁబడి వేఁడిన నేవర మైన నీకు నే
నొసఁగుదు నన్న శ్రీ యనెడియుత్తమనామము వేఁడె వేఁడినన్.

క. సరసీరుహసంభవుఁ డా
వర మిడి యంతర్ధి నొందెఁ బాయక శ్రీ యా
గిరిపై నిశముం గొలుచుచుఁ
బరఁగుట శ్రీగిరి యన నది ప్రథితం బయ్యెన్. ౨౨౧

గీ. స్వర్గులకు భ్రమరముగ సాక్షాత్కరించి
యరుణుఁ ద్రుంచుట భ్రమరాంబ యయ్యె గిరిజ
మల్లికల నర్జునతఁ గాంచి మల్లికార్జు
నాఖ్య నందెను జంద్రవత్యర్చ శివుఁడు. ౨౨౨

సీ. ముప్పదియోజనంబులు వెడలుపు పొడ
వును యోజనం బెత్తు దనరు నాల్గు
నలరు మహాద్వారములును బక్షద్వార
ములు నాలు గెనిమిది చెలఁగు శృంగ
ములు పదాఱు గవాక్షములు ప్రతిశిఖరమం
దుండు మూఁడేసి తీర్థోత్తమములు

శక్తులు లింగముల్ శతకోటిసాహస్ర
ముల్ స్పర్శవేదియు భూతిగిరులు
బిల్వవనములు రుద్రాక్షవిటపివనులు
తపనశుభ్రాంశుతారకాతాళవనులు
దివ్యసంజీవినులును జ్యోతిష్మతులును
నమరు శ్రీశైలమున నభీష్టార్థదములు. ౧౧౩

తే. ప్రాచిఁ ద్రిపురాంతకం బుండు వజ్రి యందుఁ
జెలఁగు వైదూర్యమణిమయశిఖర మందుఁ
దీర్థము లరుణియును భారతియును జారు
ఘోష యనునవి యయ్యెడఁ గాఱలుచుండు. ౧౧౪

తే. ఎసఁగు ననలాశ స్కందసోమేశ్వరంబు
చెలఁగు గుహుఁ డందు రౌక్మంబు శృంగ మందు
నలరుచుండు విచిత్ర జాహ్నవియుఁ దామ్ర
యనెడిపేరులఁ దీర్థంబు లనుపమములు. ౧౧౫

తే. దక్షిణద్వార మొప్పు సిద్ధవట మటనె
పుష్పశైలంబు సిద్ధకింపురుషముఖులు
చెలఁగుచుందురు విద్రుమశృంగ మందు
శుక్లయును క్షేమ యుత్సవ సొబగుమీఱు ౧౧౬

తే. నిరృతిదిశ నహోబల మన నెగడు నచట
మాధవుం డుండు శిఖరమ్ము మారకతము
గోమతియు మంగళయుఁ గీర్తిఁ గులుకుచుండు
తీర్థరత్నంబు లయ్యెడఁ దేజరిలుచు. ౧౧౭

తే ప్రబలుఁ బడమర బ్రహ్మేశ్వరంబు విధి వ
సించు నచ్చట హరిసిలశిఖర మందు

భద్రయును విపులయు రమ్య పరఁగుచుండు
తీర్థరాజమ్ము లద్దానఁ దేజరిలుచు. ౨౨౮

తే. అనిలకోణంబునం దుండునదియె నంది
మండలం బందు నందీశుఁ డుండు వజ్ర
మయము శిఖరము జయయు విజయయు జ్యోతి
యనెడితీర్థంబు లయ్యెడ నమరియుండు. ౨౨౯

తే. ఉత్తరమున మాహేశ్వర మూర్వశీము
ఖాప్సరోవాసము మణిమయశిఖరంబు
నలరు నర్చిష్మతీపృథువులును వక్ర
యనెడితీర్థంబు లం దుండు నధికమహిమ. ౨౩౦

తే. ఎనయు నీశాన్యమందు నేలేశ్వరమున
నీశ్వరుం డుండు రౌప్యంబు శృంగ మందు
నెగడు నానందియును నందినియును శుక్ల
యనెడితీర్థమ్ము లభిలషితార్థదములు. ౨౩౧

తే. భూతిగిరులును రుద్రాక్షభూజవనులు
కృతకభూమీధరంబులుఁ గేళివనులు
గాఁగఁ జిత్రంబులను జూచి కరము సంత
సించుచుందురు సాధకుల్ శ్రీనగమున, ౨౩౨

సీ. ఒకయోషధినిఁ గొని యొరులకుఁ గనరాక
చిత్రంబులను జూచి చెలఁగు ధన్యు
లొంకొకయోషధి నెఱిఁగి కన్పడనివ
స్తువు లెల్లఁ గాంచెడిసుకృతవంతు
లొనసి వేఱొకయోషధిని గామగమనులై
యెల్లలోకంబుల కేఁగుఘనులు

మఱియొకయోషధిమహిమచే వాయ్వగ్ని
సలిలసంస్తంభముల్ సలుపుధీను
లమరవంద్యులై యా యద్రియందుఁ జెలఁగు
చుందు రయ్యావి యచ్చోట నుండుకతన
నేమి సెప్పుదు నేనింక నిన్నిమహిమ
లెందుఁ గానరా వా యద్రియందుఁ దక్క. ౨౩౩

మహానంద్యాదులు

సీ. సతతస్రవజ్జలఝురచక్రవాళక
మంజుళం బగునందిమండలంబుఁ
గందరాబహుదూరగతిలభ్యసందర్శ
నోద్యన్నృసింహ మహాబిలంబు
గోళకూలంకషామూల ప్రతిష్ఠిత
బ్రహ్మేశ్వరము జగత్ప్రథితతమము
సకలపిశాచమోచనవిదితము విదు
రాశ్వత్థవగము మహాస్థలంబు
నెదురుగా రెండుకొండల నెలమి మీఱ
నాంజనేయులు నరసింహు లలరుచుండ
నమరుఁఘటికావనీధర మనఘు జూచు
నెసఁగు శ్రీతిరుత్తనిఁగుమారు డిష్టసుంను.

శ్రీకాళహస్తి

సీ. చవిచూచి మంచిమాంసము శివునకుఁ బెట్టి
కన్నప్ప ముక్తిని గన్నచోటు
జ్ఞానప్రసూనాంబ పూనిక శివునితో
భక్తులఁ బేర్మిఁ గాపాడుపట్టు

శ్రీయుఁ గాళంబు హస్తియు భక్తి శివపూజఁ
గావించి ధన్యతఁ గన్నతావు
భారతీజలజసంభవరమాగరుడధ్వ
జులు సలిపినతపస్సులకు నెలవు
శ్రీయుతము దేవదానవసిద్ధసాధ్య
గరుడగంధర్వకిన్నరనరనిషేవి
తంబు భుక్తిముక్తి ఫలప్రదంబు కాళ
హస్తి దక్షిణకైలాస మంద్రు దాని. ౧౩౫

తే. పుత్త్రశోకంబునం బాక్క ముక్తికోఱకు
నట వసిష్ఠుండు తపియింప నభవుఁ డపుడు
కరుణఁ బ్రత్యక్ష మగుచు మోక్షం బొసంగి
యలరె ఫణిలింగ మగుచుఁ దత్ప్రార్థనమున. ౧౩౬

సీ. తన పెండ్లికి సమస్తప్రపంచము సేర
నుత్తరదిశ గ్రుంగి యూర్ధ్వమునకు
దక్షిణం బెగయ నద్దానిఁ జక్కం జేయఁ
దన కాజ్ఞ శివుఁ డీడఁ దా నవటికి
నరుదెంచి ఘటసూతి హస్తిలింగముఁ గొల్చి
నది లేమిఁ జూచి యయ్యది ఘటింప
నసురాళి నటకు నాల్గామడదూరమం
దద్రిపైఁ దపియింప నభవుఁ డజునిఁ
బంపి ద్యోగంగ నిడ నది స్వర్ణవర్ణ
యగుచు ముఖర మై వచ్చుట నయ్యె స్వర్ణ
ముఖరి యాచ్చోట నది యుదఙ్ముఖి యగుచును
బాఱుఁ గాశి భాగీరథిపగిది నెపుడు. ౧౩౭

తే. అంబర శ్రీముఖమ్ము ముద్దాము గోపు
రములు గోటలు గల మందిరమున స్వర్ణ
ముఖరిప్రాకృతిఁ దగుఁ దూము పోల్కిఁ గాళ
హాస్తి వాయులింగము దక్షిణాభిముఖము. ౨౩౮

సీ. ఊర్ణనాభుండు నా నొప్పెడుసురశిల్పి
పుత్త్రుండు విద్యలఁ బోలరించి
సృష్టికిఁ బ్రతిసృష్టి చేసిన విధి యూర్ణ
నాభి గా శపియించి, నమ్రుఁ డగుచుఁ
గడు వేడఁ గరుణించి తన్నాస్థలి శ్రీ యను
పేర నీశ్వరుని సేవింపు నీకు
ముక్తి కల్గు నటన్నఁ బురువయి పుట్టి వ
సిష్ఠలింగమునకుఁ జిత్రభంగి
నిజశరీరనిర్యత్తంతునిచయఘటిత
మంజుళాలయప్రాకారమంటపుఁ డయి
కొల్చుచో నవి గాలినఁ గూలె నగ్గి
మెచ్చి శివుఁడు దానికి మోక్ష మిచ్చె నపుడు. ౨౩౯

సీ. ఏకాంతమునఁ గాంతు నెనసి పార్వతి యుండ
వచ్చిన హాస్తి య న్ప్రమథమణిని
శివుఁ డలంకృతి కాజ్ఞ సేసిన రామిఁ దా
తాళకాంతాలోలకాళభోగి
నలిగి పర్వతపుత్త్రి యభవుండు శపియింప
హాస్తి యై సర్ప మై యవనిఁ బొడమి
కాళఫణి మణులఁ గరి బిల్వదళముల
వేఱుగాఁ బూజ గావించుచుండి

యొకరి దొకరికి రుచియింపకునికిఁ బోరి
చచ్చి రుభయులు వారికి మెచ్చి యప్పు
డిచ్చి ముక్తి శ్రీకాళహస్తీశ్వరాఖ్యుఁ
డయ్యెను వసిష్ఠముక్తిదుండైన శివుఁడు. ౨౮౦

సీ. పార్థుండు శివుఁ బాశుపతము మోక్షము వేఁడ
నస్త్రంబు నిడి బంధుహంత వగుట
ముక్తి యిప్పుడు రాదు ముంగు బోయండవై
భక్తి న న్నొప్పించి పడయు మనుట
నా యర్జునుఁడు తిన్నఁడై పుట్టి శ్రీకాళ
హస్తీశునకు భక్తి యలర నొక్క
కేల మాంస మిఁకొక్క కేలఁ బత్తిరి నోట
సలిలంబు లూని నిచ్చలును వచ్చి
కాలిచెప్పునఁ దలపత్రిఁ గడకుఁ ద్రోసి
క్రమముగాఁ బూజ సలుపుచుఁ గన్ను లొసఁగి
శివుని లోఁగొని తత్కృప క్షితితలమున
బోయకన్నప్ప నాఁబడి ముక్తిఁ గొనియె. ౨౮౧

తే. తాను బూజారి కిడినపద్యంబు తప్పు
టన్న నత్కీరకవికి హృద్యముగ నచ్చఁ
జెప్పి వినకున్న శపియించి శివుఁడు వాని
శ్విత్ర మా రూప్యగిరిఁ బాపె వేఁడికొనిన. ౨౮౨

తే. భవుఁడు సతత మం దుంటఁ బార్వతియు వచ్చి
నిలిచె రజతాద్రియును వచ్చె నెమకికొనుచు
మేరువును వచ్చె దానితో మిత్ర మగుచు
స్వాంశముల దుర్వచము కాళహస్తిమహిమ. ౨౮౩

సీ. కైలాసభూభృత్తు కన్నప్పకొండ దు
ర్గాగిరి కనకధరాధరంబు
విద్యాశిఖరి క్రౌంచవిధ్వంసిశైలంబు
పురమధ్యవర్తి యగు వరదరాజు
పశువిశసనమును బాహువిచ్ఛేదంబు
విద్యావిశోధంబు వీరభూమి
మృత్యుంజయమ్ము వల్మీకమ్ము మంగళా
యనము మాయూరమ్ము హారహారమ్ము
నొప్పు విజ్ఞానసిద్ధిసద్యోపవర్గ
దములును సహస్రలింగముఖములు క్షేత్ర
ములు మహాతీర్థములు వజ్రమూన్విష్ణు
విజయలక్ష్మజపాదులు వెలయుచుండు. ౨౪౪

## తిరుమల

సీ. తిరుమల దక్షిణదిశను బ్రహ్మయు మల్లి
కార్జునుం డుత్తరమందు వారి
నడుమ నహోబలనరసింహులు వసింప
బ్రహ్మ శివునిఁ జూడ రాఁ గుమారుఁ
డీ వెవ్వఁడ వనుడు నే సర్వవేదశా
స్త్రములకు మూల మా బ్రహ్మ ననఁగఁ
గోపించి విధిఁ గారకుం బంపె శైలాది
స్రష్ట నిట్టులు చేయఁ జన దటన్న
గుహుఁడు బ్రహ్మకుఁ దోడుగాఁ గూర్తు నిన్న
టన్న వెఱఁగంది యేమేమొ యనుచు నెట్లొ
నంది తప్పించుకొని యేఁగె నళినగర్భ
స్థానమునఁ బ్రవేశించి సేనాని యుండె. ౨౪౫

తే. స్థలపురాణంబు లోకకొన్ని చాటుచు గిటి
మూర్తి క్షేత్రపాలకునిఁగఁ గార్తికేయు
స్వామి గా జనమేజయుఁ పాలనమున
జంగమార్చన బోధించు శాసనములు. ౨౪౬

తే. మూర్తికిన్ జటామండలంబును గుడిచెయి
క్రింద లింగ మున్నది కాన నంద బిల్వ
పూజ నేఁటికి నుదయపుఁబూట జరుగు
సర్వసురవాచి వేంక టేశ్వరపదంబు. ౨౪౭

తే. పార్వతీప్రియ మగుసింహవాహమునకు
జరుగు నభ్యంజనాద్యుపచారవిధులు
శుక్రవాసరమునఁ, గలిం జక్రి యయ్యొ
వేల్పు రామానుజుని శేషవేషకలన. ౨౪౮

సీ. భృగుముని తన్నునట్ట భీతిల్లి సిరి హరి
వక్షస్థలమ్మును వదలి వచ్చి
ధరఁ జిరుతానూరఁ దా నలమేల్మంగ
నాఁ బ్రవేశించి యున్నతటిని హరి
విరహాసహిష్ణు వై వెదకుచు జాడలు
గని తత్తరమున నా క్ష్మాధరమున
దుమికి యాపెఁ గలిసి తో నుండుటకు నాపె
యొల్లకున్న నటనె యుండి యతఁడు
ప్రతినిశయునచ్చటికిఁ బోయి వచ్చుచుండుఁ
గొండదిగువనె జనమేజయుండు నిలుప
వఱలు కోదండరాములవారి దివ్య
మందిరమ్ములు గనులకు విందుసేయు. ౨౪౯

సీ. కుంచము దలక్రింద నుంచికొనిన యుప
ధాన మై తద్దయుఁ దనరుచుండ
శ్రీదేవి భూదేవి చెఱియొండు చేకొని
యొప్పుగాఁ బదముల నొత్తుచుండఁ
బూర్వదిక్కున కభిముఖముగా దక్కిన
మునఁ దల యిడికొని కనుల మోడ్చి
దేదీప్యమాన మా దివ్యమందిరమునఁ
బండుగోవిందరాట్స్వామి యలరు
నప్పురం బంటుశిఖరమ్ము లొప్పుగోపు
రంబు కోవెలకును గోపురమున కంత
రమున శ్రీపాదతీర్థరాజము చెలంగు
స్తంభ మొం డొప్పుచుండును దాని నడుమ. ౨౫౧

తిరువళ్లూరు

క. తిరువళ్లూ రన నొప్పును
బరమక్షేత్రంబు దాన వాలాయముఁ బు
ష్కరిణీ గుడముఁ విడుతురు
పరఁగును శ్రీవీరరాఘవస్వామి యటన్. ౨౫౧

కాంచి

తే. కాంచి భూమిదేవికి రత్నకాంచి యగుచుఁ
గాంచి యన్మంచిపేరును గాంచి మించుఁ
గాంచియే తీఱవలెఁ గను ల్గాంచి దానిఁ
గాంచినన్ భుక్తిముక్తులు గాంచు నరుఁడు. ౨౫౨

క. పదియొండంతస్తుల నిరు
వదిరెండౌ ద్వారములను వఱలు, గుడికి నా

ట్లవెసలఁ గలగోపురములు
పొదలును బురి బహువిశాలమును రమ్యం బై. ౨౫౩

తే. అదియె సత్యవ్రతక్షేత్ర మభవుకనుల
మూసి దాన సురల కుపవాస ముగుచుఁ
బాప మద్దానఁ బొడమినఁ బార్వతి యటఁ
దపసు గావించి వీడ్కొనె దాని మున్ను. ౨౫౪

క. ఏకామ్రము క్రిందఁ దపం
బేకాగ్ర మనస్క యగుచు నెలమి సలుప గౌ
రీకమలముఖికి నగపడి
యేకామ్రేశ్వరుఁడన నట నీశుఁడు వెలసెన్. ౨౫౫

తే. చోరవేషమ్మున న్వచ్చి గౌరి ధైర్య
మపహరింపగ లేక యయ్యారె! నిన్ను
మెచ్చితిని గృతకృత్య వై మించితి వని
శివుఁడు పార్వతిం గౌఁగిటఁ జేర్చుకతన. ౨౫౬

క. చోరేశ్వరలింగంబును
గౌరీకుచకమలకోరకస్ఫురదంగం
బై రాజిలునేకామ్ర
క్ష్మారుహలింగంబు వెలసెఁ గడు రమ్యములై. ౨౫౭

క. ఏకాంతక్షేత్రం బది
యేకామ్రేశుండె యగు మహీమయలింగం
బాకోవెల కగ్నిదిశన్
శ్రీకామాక్ష్యాలయంబు చెలఁగుచునుండున్ ౨౫౮

తే. పావుక్రో సట కటకును బరఁగు నదియు
నొండుపీఠంబు చక్కఁగా నొప్పుసూత

యెడఁద వెలఁ గొల్పుఁ గామాక్షి గుడికి వెనుకఁ
బంచతీర్థంబు ప్రథితమై వఱలుచుండు. ౨౫౯

తే. అందుఁ బ్రతిశుక్రవాసరమందుఁ దాన
మాడుచుండెద రందఱు నచటి యమ్మ
వారిగుడి నగ్ని దిక్కున వఱలు నాగ
లోకమార్గమ్ము బిలము పాల్వోతు రందు. ౨౬౦

తే. గుడికి నాలుగుదెసలను గొప్పగోపు
రములు చెలువొందు లక్ష్మిసరస్వతు లొగిఁ
జామరగ్రాహిణు లగుచు జానుమీఱ
నలరు నుత్సవమూర్తి యేలాలకాంబ. ౨౬౧

సీ. పార్వతియున్ లక్ష్మి భారతి మధ్యస్థ
గాఁ దమవిభులయుత్కర్షములకు
వాదించుకొనుచు నెవ్వరు నెఱుంగని కథ
లెవరు సెప్పిన వారె యెక్కు డనుచు
నిశ్చయించుకొనుచు నీలగళునివల్ల
విని తత్కథల గౌరి తనకుఁ జెప్ప
వేళ నియ్యది మున్ను విన్నదియే యని
తత్కథాశేషముల్ దాను జెప్పె
నుగ్రు సహచారి నైగమేయుఁడు వచింప
విని తనకు భర్త చెప్పిన వినుచు లక్ష్మి
ముప్పదియురెండుదివసమ్ము లప్పగిదినిఁ
జనుడు గౌరి శంకరునితో ననియె నిట్లు. ౨౬౨

తే. ఎవ్వ రెఱుఁగని సత్కథ లేను జెప్ప
మన్న లక్ష్మికిఁ దెలిసిన యట్టికథలె

చెప్పితిరి కాదె యన విని శివుఁడు యోగ
దృష్టి శ్రీలోలునికపటవృత్తి నెఱిఁగి. ౨౬౩

తే. నైగమేయుండు లేకుండ నాఁటికథను
శివుఁడు సెప్పఁగా విని గౌరి చెప్పుకథను
లక్ష్మి పూరింపలేమిని లజ్జపడియె
నెఱిఁగి నుడువమి వాణియు నెనసె సిగ్గు. ౨౬౪

తే. మున్ను దాఁ జేసిన శపథమునకు సరిగ
నిందిరాదేవి చామరం బెనసి యుండె
వాణి తనయపరాధమ్ముఁ బాపికొనఁగఁ
దాను నొకప్రక్కఁ జామరం బూని యలరె. ౨౬౫

తే. కినుక హరినైగమేయుల ననుభవులుగ
గౌరి శపియింప నరుఁ డయ్యె శౌరి క్షేమ
కవి యగుచు నైగమేయుఁ డా కథలఁ దా బృ
హత్కథామంజరిం జేసి యలరె మిగుల. ౨౬౬

తే. ఆ బృహత్కథామంజరియందు రక్తుల
గుచు నఖిల మానవులును వ్యాసకర్తృ
కంబు లౌ పురాణంబులఁ గట్టిపెట్ట
విశ్వనాథుని వ్యాసుఁడు వేఁడికొనుచు. ౨౬౭

తే. హరుఁడు మణికర్ణికాకుండమందు దానిఁ
బాఱవేయించి దానికి బదులుగాఁ బ
రిగ్రహించెను మహిమ ననుగ్రహించి
తత్కథాసమసంఖ్యపద్యములు గలిమి. ౨౬౮

తే. అనుచుఁ గేదారఖండంబునందు నున్న
దచటియేలాలకాంబిక యాకథ నిజ

మనుచు బోధించుచుండుఁ ద న్ననునరులకు
లలితనామముర్ దానినే బలపరిచెడి. ౨౯౯

సీ. మున్ను కామాక్షి యాపురి నిశీథమ్మున
యోగినీవృత యయి యోలి నరులఁ
దినుచున్న నొకకాలమునకు శ్రీశంకరు
లచటికి నరుదెంచి యాత్మమహిమ
నారాత్రిఁ దత్కాళి లాహరించిన నరుల్
పావక యందఱుఁ జక్కనున్న
పౌరులు సంతోషభరితులై సంతతం
బిట్టు లుండఁగఁ జేయవే కృపాబ్ధి!
యనుడు దయ సహస్రఘటంబులందుఁ గొన్ని
తత్కాళల నిల్పి కొందఱు తన్నిదర్శ
నమును గోరఁ దత్కాలకోదకమును మూక
బాలకునిపైనిఁ జిల్క విద్వాంసుఁ డయ్యె. ౨౨౦

తే. అతని కవనంబ యమృత మా నతఁడె మూక
పంచశతిఁ జేసె నది జగత్ప్రథితమ కద
నాఁడు మొదలు కామాక్షి యీనాఁటిదనుక
శాంత మై సేవకులకు నొసంగు సిరులు. ౨౨౧

తే. కలవు నూఁటయెన్మిది శివస్థలములుఁ బదు
నెన్మిదా కేశవస్థలు లెన్న నటకు
దక్షిణమ్ముగఁ గ్రోసులోఁ దనరు విష్ణు
కాంచి వరదరాజస్వామి కలఁడు దాన. ౨౨౨

తే. కోవెలలును బ్రాకారముల్ గోపురములుఁ
దద్దఁ దనరును షోడశ స్తంభ మంట

పమునఁ గపివాహనము గజవాహనంబుఁ
బసిఁడిపల్లకి జాళువాపక్కిఱేఁడు. ౨౭౩

తే. తనరు నష్టోత్తరశతపాదము సహస్ర
పాద మన్మంటపములు నశ్వత్థకుజముఁ
బుట్టయు ననంతసరసియుఁ బొలుపుమీఱి
వైష్ణవోత్తముల్ సత్కవుల్ వఱలుచుండ్రు. ౨౭౪

సీ. శ్రీభక్తులుఁ భారతీభక్తులౌ మునుల్
తమదైవతముల యుత్కర్షములకు
వాదించికొని పద్మభవు నడిగిన నతం
డబ్ధిపుత్త్రియ యెక్కు డనుడు బ్రాహ్మ
నదులలో నేనియు నన్నధికను జేయుఁ
దన గంగకన్న నీ వధిక వగుదె?
యన భారతీదేవి యవమతిని సరస్వ
తీనది నంతర్ధి యైన బ్రహ్మ
కరము చలచిత్తుఁ డైన నాకాశవాణి
హరినిఁ గూరిచి పదినూఱు లశ్వమేధ
ముల నొనర్చినఁ జపలత వోవు నన్న
నజుఁడు నేఁ జేయనేర్తునే యన్ని యనుడు. ౨౭౫

తే. పుడమి సత్యవ్రతక్షేత్రమున నొకండు
సేసినఁ గల్గుఁ దత్ఫలసిద్ధి యందుఁ
గరిగిరిం జేయు మనిన నక్కమలభవుఁడు
దా వసిష్ఠు రప్పించి యత్నం బొనర్చి. ౨౭౬

సీ. మునివరా! యిప్పుడు పోయి సరస్వతి
కీనానువృత్తాంత మెల్లఁ జెప్పి

యెమ్మెయి నేనియు నిచటికిఁ గొనిరమ్ము
పిమ్మట నశ్వమేధమ్ము జరుగు
నావుడు నతఁ డేఁగి నానావిధమ్ముల
రమ్మని బోధింప రా నటన్న
వచ్చి వసిష్ఠుండు బ్రహ్మకు నెఱిఁగించి
భానుజ సావిత్రిఁ బరిణయంబుఁ
జేసి యశ్వమేధమ్మును జేయఁ జేసె
శ్రద్ధ మొద లుపభార్యలు బద్ధరాగ
లయి భజింప సావిత్రితో నబ్జసూతి
యశ్వమేధంబు సేసెడి యవసరమున. ౨౭౭

సీ. దానవుల్ కొందఱు తాపసవేషు లై
చని ఖిన్ను లై సరస్వతినిఁ గాంచి
యమ్మ! నీ పక్షంబు నవలంబనము సేయు
కతన యజ్ఞంబునఁ గాలు మోఁప
నీక నిందించి మ మ్మిట్టులు వెడలించి
రనుడు నే నిట నున్న నచట యజ్ఞ
మెట్లు చేసెడి నన్న నే మని నుడువుదు
మవ్వసిష్ఠునిమంత్ర మట్లు పాటె
భానుపుత్త్రి సావిత్రినిఁ బరిణయంబు
సేసికొని యశ్వమేధంబు సేయుచుండె
నన్న నారార! యేమేమి! యట్టు లయ్యెఁ
గా! యటంచు సరస్వతి కరముఁ గినిసి. ౨౭౮

మ. ఇదిగోఁ జూపెద నాప్రభావ మని తా నెంతే విజృంభించినన్
ముదమారంగ జని రా నిశాటులు నభమ్మున్ భూమి వ్యాపించి సు

స్యదమై దుస్సహఘోరఘోషమున బ్రహ్మాండంబు భంగించుచున్
గదలెన్ సహ్యధరాధరాధిగురుశృంగమ్మున్ విలంఘించుచున్.

సీ. ప్రళయసముద్రమ్ముభంగి వచ్చెడిసర
స్వతిఁ గని వెఱఁగంది బ్రహ్మ హరినిఁ
బ్రార్థింపఁగా దిగంబరుఁ డయి నది కడ్డు
గాఁ బండఁ గను లజ్జఁ గాంచి చేయు
పని లేమిఁ గంపయుఁ బంపయుఁ గనకయు
స్రంసయు ననపుంజనయును జండ
వేగ శు క్తిక యనుపేరుల నేడుగాఁ
జాయ లై చయ్యనఁ జాసి పోవఁ
బద్మగర్భుఁ డాదట వేగవతికి సర్వ
నిమ్నగా శ్రేష్ఠతను గరుణించి యజ్ఞ
శేషమును బూర్తి సేసిన శేషశాయి
మెచ్చి యజునకు వరముల నిచ్చెఁ గాన. ౨౮౦

తే. వరదరాజాఖ్య స్వామికి వఱలుచుండుఁ
గరిశిఖరి గాన నెత్తుగాఁ గానిపించుఁ
గాంచి మించినక్షేత్రంబు గానరాదు
సప్తపురములలో నది చాటఁబడియె. ౨౮౧

పక్షితీర్థము

సీ. మును కృతయుగమున నెనమండ్రు మునివరుల్
చిరకాలము తపంబుఁ జేయ శివుఁడు
ప్రత్యక్ష మై పేర్మి వర మడుగుఁ డటన్న
వారలు తమ భోగవాంఛ విడిచి

ముక్తి నిం డనుడు మీ భోగేచ్ఛ నెఱుఁగుదుఁ
ప్రతియుగమ్మున మీరు పశువు లగుచు
నిద్ద ఱిద్దఱు గూడి యెలమి గంగాస్నాన
మును సేతుమజ్జనంబును సలుపుచు
నన్ను నిచ్చలుఁ గొల్చుచు నాప్రసాద
మును భుజింపుచు నుండుఁడు ముక్తి నిడుదు
నే ననుచుఁ జెప్పి రుద్రకోటీశ్వరుఁ డన
వేదగిరిశిఖరమ్మున వెలసి యుండె. ౨౫౨

సీ. ఐధాత పూషయు నలరును గృతమునఁ
త్రేతయందును సాంపతియు జటాయు
వా ద్వాపరమ్మున నగు శంభుగుప్త మ
హాగుప్తయును గలియందుఁ జెలఁగు
శంబర యనునది శంబరారియు రెండు
యామంబులకు నవి యనుదినంబు
వాలాయముగ వచ్చి స్వామిని సేవించి
తత్ప్రసాదమ్మును దగ భుజించి
పోవుచుండును ప్రత్యక్షముగ ననంత
రమునఁ బూజకుల్ తత్ప్రసాదము నొసంగ
స్వామి సేవించి యుత్కంఠ వచ్చి యున్న
తైర్థికులు గ్రహింతురు సముత్సాహపడుచు. ౨౫౩

సీ. స్థానాధికారికిఁ దప్పక పదిరెండు
వత్సరమ్ముల కొకపాటి స్వప్న
మందును గోచర మై నిరీక్షింపుచు
నున్న నాపఱుదిన మొక్క మంచి

శబ్దంబు విన నయి శంఖతీర్థమ్మున
నరసిన నొకశంఖ మబ్బు దాని
నెలమి నూరేఁగించి యా వేదగిరిదేవు
సన్నిధి నిడి పూజ సలుపుచుండ్రు
దాన నద్దాని శంఖతీర్థం బటందు
రట్లు ద్వాదశవర్షంబు లగుడు ఫాల్గు
నమున నొకగిన మాకస్మికముగ నుఱిమి
ధ్వజమునకు దక్షిణమ్మునఁ బడు వెలుంగు. ౨౮౪

తే. అట్లు పడి గుడిలోనికి నతిరయమునఁ
జని ప్రదక్షిణముగ వచ్చి కనుమొఱఁగును
ధ్వజముకడ దానినిం బురందరునిపూజ
యందు రది యొకచిత్రమై యమరు భువిని. ౨౮౫

తే. వర్తకునికన్య చొక్కమ్మ భవునిఁ గూర్చి
తపము గావించి మెప్పించి తనకుఁ బతిగఁ
జేసికొనినను గోపించి పాసి కొండ
డిగువఁ ద్రిపురసుందరి యుండె ధీర యగుచు. ౨౮౬

తే. స్వామిపంపున భక్తుండు పార్శ్వమందు
నుండు దేవికిఁ దోడుగా నొలి స్వామి
పదిదినములకు నచటికి వచ్చు నంద్రు
భక్తవత్సలుఁ డొకచోటఁ బఱఁగుచుండు. ౨౮౭

క. వత్సరమున కొకపరి బ్ర
హ్మోత్సవమున గిరికిఁ జుట్టు నూరేఁగుచు నుం
డ్రుత్సవదేవత లెల్లఁ
వత్సరముఖమాసమందు వాలాయముగాన్. ౨౮౮

తే. అన్ని యోషధులకు నది యాటపట్టు
కాన వానలఁ గరఁగిన దానిమట్టి
మేన నాలేపనము సేయుమానవులకుఁ
గొట్టు బ్రహ్మహత్యాదులఁ గుష్ఠములను. ౨౮౯

## తిరువణ్ణామల (అరుణాచలము)

క. అరుణాచలమునఁ దైజస
మరుణాచలనాథలింగ మలరుచు నుండున్
నరులకు నపవర్గమ్మును
స్మరణంబునఁ గూర్చు దానిసరి లేదెందున్. ౨౯౦

తే. కృతయుగమునందు నగ్నిపర్వతము త్రేత
యందు మణిగిరి ద్వాపరమందుఁ గనక
శిఖరి కలి శిలామయ మయి చెలఁగి శోణ
గిరి యనంగను దేజోనగర మనఁ దగు. ౨౯౧

తే. కాంతిశాలికలాధరాఖ్యులఁ బ్రసిద్ధి
వఱలువిద్యాధరు లిల దుర్వాసునాశ్ర
మమునఁ బుష్పములను గోసి మౌనిశాప
కలనఁ గస్తూరికాహాయము లయి యుండ. ౨౯౨

సీ. ఈశ్వరు నెదిరించి యింద్రుండు వజ్రాంగ
దుం డనుపాండ్యనాథుఁ డయి పొడమి
మృగయార్థ మా యశ్వ మెక్కి యా కస్తూరి
కామృగంబును గూల్పఁ గడఁగి తఱుము
నరుణాద్రి చుట్టును దిరిగి యయ్యదియు న
శ్వంబును డస్సి భూస్థలినిఁ గూలి

స్వస్వరూపము లంది వసుమతిం బడి కుందు
విభునితోఁ దనపూర్వవృత్త మెల్లఁ
దెలిపి హయ మెక్కి గిరిచుట్టుఁ దిరుగుకతన
నిట్టి కష్టంబుపా లైతి వీ గిరీశుఁ
గొలువఁ దరియింపఁగల వని పలికి చనిన
నధిపుఁ డాశ్చర్యరసమగ్నుఁ డగుచు నపుడు. ౨౯౩

తే. ఆత్మజాతుఁ డై యలరురత్నాంగదునకు
రాజ్య మిడి స్వామికైంకర్యరక్తుఁ డగుచు
నందె యుండినఁ గరుణించి యంగజారి
స్వపద మొసఁగినఁ జనియెఁ దా స్వర్గమునకు. ౨౯౪

సీ. అగ్నికులోద్భవుం డైన భల్లాణుండు
తనుజులు లేమికిఁ దద్ద వగచి
యెవ రేది కోరిన నిచ్చెద నని చాటి
దానధ్వజం బెత్తఁ దద్వ్రతంబుఁ
బరిశీలన మొనర్ప భవుఁడు జంగముఁ డౌచు
గణికల నెల్ల నాకట్టి విభుని
కడ కేఁగి మంచిభోగస్త్రీనిఁ గోరిన
నరసి యేయెడ నది యమర కునికి
వగచుపతిభావమును గని భార్య లపుడు
తమ్ముఁ బంపింపుఁ డనవు డత్యంత మలరి
చిన్నిపడఁతిని నియమింపఁ జెలఁగి యందె
శిశు వగుచు వారి నోమెను శివుఁడు పేర్మి. ౨౯౫

తే. బ్రహ్మవిష్ణుల కాధిక్యవాదవేళ
నడుమఁ దేజశ్శిఖరి గఁ గన్పడిన దదియ

పోరు తీఱినపిదప నవ్వారు వేడఁ
జిన్నిపర్వతముగ నిట్లు చెలఁగుచుండె. ౨౯౬

తే. కార్తికంబునఁ గృత్తిక గ్రాలురాత్రి
శిఖరమునఁ దేజ మొప్పారు చెలఁగు దానిఁ
గనినవారలు వారినిఁ గనినవారు
వరుసగఁ దరింతు రా గిరీశ్వరునికరుణ. ౨౯౭

తే. భక్తవత్సలుఁ డౌటచే భవుఁడు శిఖరి
మూలమున లింగరూపుఁడై పొలుచుచుండెఁ
గలవు మున్నూఱుతీర్థముల్ కనిన నందు
భూసురులు సురల్ కల్పముల్ భూరుహములు. ౨౯౮

గౌరీమయూరము – తిరువందుఱౌరు

తే. అలరు గౌరీమయూరాఖ్యమందు నేక
వీర దేవి యై తగు నొక్కపీఠ మదియు
భక్తు లెందఱో సేవించి భుక్తిముక్తు
లందుచుండ్రు వర్ణింప శక్యంబె దాని. ౨౯౯

సీ. కావేరిశాఖకు గౌరీమయూరంబు
దక్షిణదిక్కునఁ దనరుచుండు
నందు మాయూరేశుఁ డభయాంబికాదేవి
యలరుచుందురు కుమారాదిదేవు
లుత్తరకావేరి యొడ్డున శ్రీపరి
మళరంగనాయకు లలరు వారి
పదమున శశి నాభిపద్మంబునను బ్రహ్మ
శిరమున భానుండు చెలఁగుచుండ్రు

చేతు లలరును నాలుగు శ్రీయు భూమి
గంగ కావేరి మూర్తులై గ్రాలుచుంద్రు
పుష్పవనములు గోపురంబులును గుళ్ళు
వైష్ణవోత్తముల్ పండితుల్ వఱలుచుంద్రు. 300

చంపకారణ్యము-(రాజమన్నారుగుడి)

తే. దక్షిణద్వారకాప్రథఁ దనరుచుండు
చంపకారణ్య మద్దానఁ జంపకరమ
రాజమన్నారు నుత్సవుల్ రాజిలుదురు
శ్రీయుఁ బరవాసుదేవులు స్థిరు లగుచును. 301

తే. రజతధేనువు పంచభైరవులు శేష
శాయి సంతానగోపాలచారుమూర్తి
స్వామి కిరుప్రక్కలను శ్రీయు తాయ్యియుఁ జెలఁగు
చుందు రాళ్వారుముఖులు గన్పించఁగాను. 302

తే. మున్ను గోపిలుఁ డటఁ దపమ్మును బొనర్ప
శౌరి గన్పడి వరములఁ గోరు మనుడు
ద్వారకం జేయులీలల న్ద్వారక యిట
సలుపుచుండు మీ వంతియ చాలు ననిన. 303

తే. భక్తవత్సలుఁ డాటచే స్వామి యట్లు
వర మొసఁగి యుండె నద్దానఁ బరఁగె నద్ది
దక్షిణద్వారక యనంగఁ దన్ను నెత్తి
కొనిన సంతతి నిడుచుండు గోపశిశువు. 304

తే. క్రోసునర నిడివి కలిగి కోవిదు లగు
బ్రాహ్మణుల వైష్ణవుల నది వఱలుచుండు

తీర్థములు హరిద్రాదులు తేజరిల్లఁ
దొమ్మి దవ్వానిలో మున్గుదురు మనుజులు. ౩౦౫

### కమలాలయము

సీ. జననంబునను ముక్తి జంతువులకు నిఁకఁ
గమలాలయక్షేత్ర మమరుఁ గ్రోశ
పంచకం బాలయప్రాకారమునకు లో
పల నూఁటయెన్మిది పరఁగు గుళ్ళు
వల్మీకనాథుండు వఱలుచుండును సోమ
కుండలాంబాదేవి కొమరుమీఱు
త్యాగరాజును గమలాంబ నీలోత్పలాం
బయు నుత్సవు లగుచుఁ బరఁగుచుంద్రు.
చిత్తచాంచల్యహర మాచుఁ జెలఁగుచుండు
నట సరస్వతీతీర్థ ముత్కటము మున్ను
తపము దుర్వాసుఁ డొనరించి ధన్యుఁ డయ్యె
నొప్పు నవప్యానిగుడి యందు నుజ్జ్వల మయి. ౩౦౬

తే. ఘట్టములు మంటపము లసంఖ్యములు నాల్గు
గోపురములు చెలఁగు మూఁడు కోట లలరు
వేయికాళ్ల మండప మొండు వెలయుచుండు
మొదటిప్రహరిలో నద్దానిఁ బోల వెవియు. ౩౦౭

తే. త్యాగరాజేంద్రుపూజలో నలరువేల్పు
పేర్మి నద్దేవు ముచికుందవిభున కింద్రుఁ
డిడిన నతఁ డటఁ గదుభక్తి మెసఁగ నిలిపి
తగువిధమ్మున సేవించి ధన్యుఁ డయ్యె. ౩౦౮

తే. అటకుఁ గ్రోసుదూరములోన నభవుదెసను
దనరు సూతాశ్రమం బందు దక్షిణగయ
యని ప్రసిద్ధి వహించినయట్టిరాము
క్షేత్ర మలరును హాటకక్షేత్రగతము. ౩౦౯

## చిదంబరము

సీ. వ్యాఘ్రపురము బిల్వవన మభ్రసభ పుండ
రీకపురం బని లోకవిదిత
మైన చిదంబరం బను మహాక్షేత్రంబు
దనరు విరాట్పురిదహార మగుచు
గోపురములు నాల్గుఁ గోట లైదును జ్ఞాన
సభ హేమసభ యను సంజ్ఞ నలరుఁ
జిత్సభ నడికోటఁ జెలఁగుచుండును దాని
యస్థిభారం బేఁబ దక్కరములు
పెద్దకంబముల్ నాలుగు వేదములును
శాస్త్రషట్కంబుఁ జిన్న వౌ స్తంభములును
దత్త్వములు తొంబదాఱు వాతాయనములు
నగు శివాగమంబులు నిర్వదాఱు పీఠి. ౩౧౦

తే. కమ్మ లఱువదినాలుగు కళలు మీఁది
పలకలగును లోకమ్ములు పదియు నాల్గు
మెట్లు పంచాక్షరమ్ములు మీఁదికలశ
ము లగు నవశక్తులు న్మేకు లలరునాల్గు. ౩౧౧

తే. అమరు నా సభలో దక్షిణాభిముఖము
గాఁ జిదంబరతాండవకర్తృమూర్తి

యమ్మ శివకామసుందరి యరయుచుండఁ
దాండవమ్మును గ్రేగంటఁ దద్ద రక్తి. ౩౧౨

తే. స్వర్ణమయి దేవి యామెకు స్వర్ణభైర
వుండు పూర్వునఁ జెలఁగుచు నుండు స్వామి
వారికిం బడమర నుదగ్భవనభిత్తి
స్వర్ణమయచక్రముఖరహస్యములు గలవు. ౩౧౩

తే. బాలగోవిందరాజస్వామివారు మఱియుఁ
బుండరీకవల్లీదేవి పొలుచుచుండ్రు
స్వామిసాన్నిధ్యమందును బ్రాఙ్ముఖముగ
స్ఫటికలింగము మరకతనటవిభుండు. ౩౧౪

తే. కనకసదసిస్థలమున షట్కాలములను
వ్యాఘ్రపాదపతంజలివ్యక్తసూత్ర
పద్ధతిఁ బూజలు జరుగును పరఁగు నాట్య
సదసిలో నూర్ధ్వతాండవేశ్వరునిమూర్తి. ౩౧౫

క. అంబరమయ మయి తగు లిం
గం బది తీర్థము లట శివగంగాదులు గీ
ర్తిం బరఁగు చున్నయవి దా
నిం బోలినతీర్థ మదియ నిక్కము పుడమిన్. ౩౧౬

కుంభఘోణము

సీ. కుంభఘోణంబునఁ గుంభేశ్వరుఁడు మంగ
ళాంబ చతుర్భుజ యలరుచుండ్రు
విష్ణ్వాలయంబులు వెలయు నాలుగు శివా
లయము లెన్మిదియుఁ జెలంగుచుండు

మూఁడు రే లటనున్నఁ బొసగు నాప్రళయంబు
బ్రహ్మలోకమునందు వాస మందు
భక్తి లక్ష్మీసరోవరమున మున్గి యే
మిచ్చినఁ జిత్తముక్తి యొసక మెసఁగు
నటఁ దప మ్మొనరించి యే యభిమతములు
గనిరి షట్చక్రవర్తులున్ గ్రహము లెల్ల
దానిఁ బొగడంగఁ దరమె వాగ్జాని కేని
సిద్ధిదం బైన క్షేత్ర మై చెలఁగు నవని. ౩౧౭

చియ్యాళి

సీ. బ్రహ్మాలయము పరేశ్వరు దేవళమ్మును
త్రిపురసుందరిగుడి తేజరిల్లు
బ్రహ్మకుండం బొప్పు బహుదేవభవనముల్
లింగముల్ గుడిచుట్టు రంగు మీఱు
భక్తవిగ్రహములు పరఁగును గుడికి ను
త్తరమునఁ గల మెట్లదారి నెక్క
ప్రాగ్దక్షిణం బేఁగ వఱలు నుమామహే
శ్వరవిగ్రహంబులు ప్రాంశువులయి
సపరివారంబుగా నందు సాఁగి పశ్చి
మముగఁ గొన్ని మెట్టుల నెక్క మఱియు నరుగ
శరభనాథుండు గన్పించు సలుపుచుండు
వాహనాలంకరణవైభవములు మెండు. ౩౧౮

తే. శరభవిభునకు శుక్రవాసరములందుఁ
బునుఁగు జవ్వాజులం భక్తిపూర్వకముగ

నియమముగ నభిషేకంబు నెఱపుచుండు
రహహా! యానాఁటి వైభవం బబ్బురంబు. ౩౧౯

## వైద్యనాథము

సీ. వైద్యనాథంబున వైద్యనాథస్వామి
కోవెలకు న్నాఁడు కోట లలరు
గోపురములు నాల్గు కొమరారు రెండుకో
టలచుట్టు మందిరంబులు వెలుంగుఁ
బశ్చిమముఖముగా స్వామియు దక్షిణ
ముఖముగా దేవియుఁ బొలుచుచుండు
రచటికి నెదురుగా నలరు జటాయువు
దహనకుండము ప్రసిద్ధము కరమ్ము
కార్తికేయున క చ్చోటఁ గార్తికమునఁ
గృత్తిక న్గొప్పయుత్సవ మెపుడు జరుగుఁ
గలదు సిద్ధామృతం బను ఘనసరస్సు
భక్తు లెల్ల నభీష్టముల్ వడయుచుండ్రు. ౩౨౦

## శ్రీరంగము

సీ. ఆదివిష్ణువువల్ల నంభోజభవునకు
నాతనివలన మన్వంతరాది
నిక్ష్వాకువిభునకు నిక్ష్వాకువువలనఁ
గ్రమముగా దశరథరామునకును
సంప్రాప్త మై విభీషణునకుఁ ద్రేతలో
శ్రీరాముఁ డొసఁగినఁ జెలఁగి యతఁడు

తనలంకకున్ దీసికొనిపోవుతఱి విప్ర
వేషంబునన్ దన్ను వెంబడించు
విఘ్నపతిచేతి కిడి శౌచవిధినిఁ దీర్చి
వచ్చులోపల గణపతి వాని మూఁడు
సార్లు పిలిచిన రాకున్న సంపుటమును
బుడమిపై నిడి కనరాక పోయె నపుడు. ౩౨౧

ఉ. వచ్చి విభీషణుండు తనబాహుబలమ్మున సజ్జ నెత్తినన్
బొచ్చెము సంభవిల్ల నది భూమిని వీడక యున్నఁ బె న్వగన్
బెచ్చుగ మొట్టవెట్టికొనఁ బేరిమి నాతనితోడ స్వామి వా
క్రుచ్చె విభీషణా! మదినిఁ గొంకకు లంకకు నాకు ద వ్వఁకన్.

తే. గంగకన్న నుత్కర్షంబుఁ గాంచుకొఱకుఁ
దపముఁ గావించెఁ గావేరి దాని కిపుడు
వర మొసంగుటకుం దగు తరుణ మయ్యెఁ
గాన నిచ్చోటుననె యెల్లకాల ముందు. ౩౨౩

తే. చనుము లంకకు నటనుండి దినదినంబు
వచ్చి ననుఁ గనుఁగొనుచుండు వగవకు మిఁక
నచటి కిచటికి నీ కొక్క యడుగ కాదె
యని విభీషణు నంపి తా నచట నుండె. ౩౨౪

సీ. ఏడుకోటలమధ్య నెలదమ్మిమొగడ నా
నలరు విమానమ్మునందుఁ జెలఁగు
ఫణిరాజమృదుతమపర్యంకతలమునఁ
గటిశిరఃపార్శ్వసంఘటితహస్తుఁ
డై భూరమాదేవు లంఘ్రిపద్మంబుల
నుత్సంగముల నిడి యొత్తుచుండ

లంకకై తిరిగి యలంకారములతోడఁ
బశ్చిమశీర్షుఁడై పవ్వళించి
యిరుకెలంకులఁ గావేరి యెలమి ఘనత
రంగచామరముల వీవ రంగు మీఱ
నయనములు మోడ్చు శ్రీరంగనాయకుండు
భక్తులకు నెల్లరకు భుక్తిముక్తు లిడును. ౩౨౫

తే. పంచమం బగు ప్రహారిలోపలనె మహియు
శ్రీయు రంగనాయికయును జెలఁగుచుంద్రు
స్వామి యాజానుబాహువు స్వర్ణకలశ
మండితము విమానం బతిమంజుళంబు. ౩౨౬

## భాస్కరక్షేత్రము(తిరుచునాపల్లి)

ఆ. పాండ్యదేశమందు భాస్కరక్షేత్రంబు
పరఁగుచుండు నందు వఱలు మాతృ
భూతవిభుఁడు ప్రజల మాత నాఁ బోషించు
స్వామిఁ గనఁ బునర్భవం బడంగు. ౩౨౭

## జంబుకేశ్వరము

తే. రమణ జంబుకేశ్వరము శ్రీరంగమునకుఁ
దూర్పుగా నగ్నికోణమందు నొకక్రోసు
దూరమున నుండు లింగంబు తోయమయము
గోపురంబులు నాలుగుకోట లలరు. ౩౨౮

తే. దేవి యఖిలాండనాయిక దేవుఁ డలరు
జంబుకేశ్వరుఁ డన ముందు జననిఁ గాంచి

జంబుకేశునిఁ గనుట యాచార మచటఁ
గల వగస్త్యతీర్థాదులు కలుషహరములు. 3౨౯

సీ. వెండికొండ వెలయుచుండు నెత్తమ్మున
సంజవేళ జడలజంగమయ్య
వేల్పు లెల్ల నలరు పేరోలగమ్మునఁ
జిలువలతొడవులు చెలువు మీఱఁ
బచ్చిగోనుఁగుతోలు పైబట్ట యొగురంగ
గంగమ్మ సిగపైని గంతు లిడఁగ
డెసలె వల్వ లగుచుఁ దేజరిల్లఁగ నాడ
గట్టులదొరపట్టి కరము నవ్వ
దాన దోసము వాటిల్ల దాని వీడ
రెండుకావేరుల నడుమ దండకమను
నడవిలో నందుఁ గనుబత్తి యడర నిసుక
నొక్కలింగయ్య నొనరించి యోర్పు మీఱ. 33౦

తే. తనకు లక్ష్యంబుగాఁ జేసికొని తపమ్ము
సలుపుచుం గొల్చుచున్నంత సరభసముగ
నుభయకావేరు లేక మౌచున్న లింగ
మునకు సాఁగిలఁబడి వేఁడఁ బురహరుండు. 33౧

తే. మెచ్చి యా లింగముననె తా నచ్చుపడుచు
ముప్పుఁ దొలఁగించి యా యుమున్ బ్రోచి యెలమి
నుభయులుం గూడి యచ్చోట నున్నవారు
వారిఁ గొలిచినఁ గోర్కు లీడేరుచుండు. 33౨

తే. జంబుకవనంబునం దుంట జంబుకేశ్వ
రుం డనంగ దేవుం డొప్పుచుండు శివుని

పేర్మి నఖిలాండనాయిక పేరు గాంచెఁ
జైత్రపూర్ణిమఁ బండుగ జరుగుచుండు. ౩౩౩

తే. రాగభోగంబులకుఁ జోళరాజు తగిన
భూము లర్పించి గోపురంబులును గుళ్లుఁ
బ్రహరు లేర్పాటు గావించి ప్రథితుఁ డయ్యెఁ
బుడమిఁ గృతకృత్యజనులలో ముఖ్యుఁ డగుచు. ౩౩౪

సీ. గజ మొకం డవ్వేల్పుకరుణ ముక్తిఁ గనుట
నది గజారణ్య మై యలరె నందు
నొకముని తపియించుచున్న నేరెడుపండు
ప్రతిదిన మచ్చోటఁ బడుచునున్న
నద్దాని దేవున కర్పించి యూతండు
తినుచున్న నొకనాఁడు దేవుఁ డలరి
సాక్షాత్కరించి తాఁ జయ్యన నతఁ డిడ్డ
పం డారగించి య ప్పంటిగింజ
నుమియ శివుఁడు వారించిన నోడ కతఁడు
దానిఁ గనుల నద్దుచుఁ బ్రసాద మని తినిన
నిగ్రహానుగ్రహంబుల నీలకంఠుఁ
డతనితోడుత సరీతి ననియె నపుడు. ౩౩౫

తే. ఔర! నా యాన మీఱితే వైన భక్తి
యధిక మా నీకు నాయెడ నహహా! నీదు
పొట్టలోపల నేరేడుచెట్టు పుట్టి
యుదియ నీ వయి జాములో నలరు మిందు. ౩౩౬

తే. అనిన నమ్మునిపుంగవుం డట్లె యచట
నుండుటం గూడ నా వేలు పొప్పుచుండు

జంబుకేశ్వరుఁ డనుపేర సత్య మిద్ది
యసదృశము దాని వర్ణింప నలవి కాదు. 332

పళని

క. అలరును సుబ్రహ్మణ్య
స్థలమన నొకఁ డందు నెపుడు జరుగుచు నుండున్
దొలి నెలపున్నమ కుత్సవ
ములు పెల్లుగ వచ్చు దుగ్ధములు ప్రతిదినమున్. 333

మధుర

సీ. పుడమిఁ బుణ్యక్షేత్రములు లేనియెడ నందు
లీల లింగమును గల్పించి పిదపఁ
బార్వతీసహితుఁ డై ప్రమథులతో జగ
త్సందర్శనార్థ మచ్చటికి వచ్చి
భవుఁడు గణములచేఁ బ్రార్థింపఁబడి లింగ
మున కగ్నిదిశఁ దీర్థమును బొనర్చె
నయ్యది శివతీర్థ మాదితీర్థము హేమ
పద్మాకరం బనఁ బరఁగుచుండుఁ
బొలుచు నదియ జీవన్ముక్తిపురము కన్య
కానగరము సమష్టివిద్యానగరము
మధుర హాలాస్య మనుపేళ్ల మహితలమున
దొరకు నందు జీవన్ముక్తి నరుల కెల్ల. 334

తే. పూర్వదిక్కున మధురకుఁ బుష్పవనము
దక్షిణమున సుబ్రహ్మణ్యధరణిధరముఁ

బశ్చిమమున శ్రీపతిశ్రీకాపత్తనంబు
నుత్తరమున వృషాచల మొప్పుచుండు. ౩౪౦

తే. శాస్త తూర్పునఁ బడమర శార్ఙ్గపాణి
తనరుదురు సప్తమాతృకల్ దక్షిణమున
భద్రకాళి యుత్తరమునఁ బరఁగు మధుర
సుందరేశుండు మీనాక్షి యుందు రందు. ౩౪౧

సీ. గోత్రవైరి సుధర్మ గ్రొత్తగా రహి నధి
ష్ఠించిన మునులు దీవించి రంతఁ
దార్యత్రికము దేవతలు సల్పు నెడఁ దిలో
త్తమ తా జగన్మోహనముగఁ దనదు
విద్యఁ జూపించుచో వేయికన్నుల వేల్పు
పరవశుఁ డై యుండ గురుఁడు వచ్చి
తనుఁ జూచి గౌరవమును జేయ లే దని
యంతర్ధి నొందె ననంతరమున
నుచితముగ మునివిబుధుల నోలి గౌర
వించి తగఁ దిలోత్తమకు నిప్పించె దివ్య
మణిమయాభరణములు సమ్మదముతోడ
నెల్లవారలు సనిరి మహేంద్రుఁ డపుడు. ౩౪౨

సీ. గురుఁడు గన్పడ కుంటకుం గారణము దివ్య
దృష్టిఁ గన్గొని గురునింటి కేఁగ
నతఁ డగపడమి నత్యంతదుఃఖితుఁ డౌచుఁ
జని తనదుభవనమున వసింపఁ
గ్రమముగా బలము విక్రమముఁ గోల్పోయి రా
క్షసులచేఁ గష్టఁ బరాజయము నొంది

యజుని వేఁడిన గురుత్యాగదోషం బింత
కగుఁ గారణము త్వష్ట్రనాత్మజన్ము
విశ్వరూపుని గురునిఁ గావించుకొనినఁ
గలుగు శుభ మన్న నతఁ డట్లు సలిపి గురుఁడు
సెప్పు శివకవచముఁ బఠించి జయమంది
స్వర్గసామ్రాజ్యసుఖమును బడయుచున్న ౩౨౩

తే. సురలకుఁ బురోహితుఁడు రాక్షసులకు భాగి
నేయుఁడౌ విశ్వరూపుఁడు సేయుమోస
మెఱిఁగి కోపపరీతుఁ డై యింద్రుఁ డపుడు
తచ్ఛిరస్త్రయి నఱికె శస్త్రంబుచేత. ౩౨౪

తే. సోమపానంబు సేయుట సురను గొనుట
నన్నదానంబు సలుపుట నయ్యెఁ గముజు
నూఁబిచ్చుక తీతువయును శిరములు
బ్రహ్మహత్య యింద్రునివెంటఁ బడి కలంచె. ౩౨౫

తే. చాటుగా హవిర్భాగముల్ సర్వదైత్యు
లకు నొసంగుటచేఁ గద యకట విశ్వ
రూపు వధియించి చేకొంటిఁ గ్రూరహత్య
దీని విడుటకు నాకేమి తెఱువటంచు. ౩౨౬

తే. గురువు గనరామి నిక్కట్లు కొంతకాల
మనుభవించి యెట్లో యొకరి నాశ్రయించి
జయము గాంచియు మరల నిట్లయితి ముందు
హత్యఁ దొలఁగించుకొనుట కార్యం బటంచు. ౩౨౭

తే. హత్య నాల్గుగా భాగించి యవని యందుఁ
జెట్లయందును జలముల స్త్రీలయందు

నుంచి పూడుటయును బునరుద్భవంబుఁ
దఱుగమియుఁ గామవృద్ధియుఁ దగ నొసంగ. ౩౪౮

తే. తనయుఁ జంపిన యింద్రుపైఁ ద్వష్ట యలిగి
హోమమును జేయఁగా వృత్రుఁ డుదయమంది
వేఁచ హరి వజ్ర మార్జించి వెంటఁ బడిన
నబ్ధిలో డాఁగె భీతి వృత్రాసురుండు. ౩౪౯

తే. అపు డగస్త్యునిఁ బ్రార్థింప నబ్ధిఁ ద్రావె
నంత వృత్రుని వధియించె హరిహయుండు
బ్రహ్మహత్య వెన్నంటినఁ బాఱి యీశు
కాష్ఠయం దున్నరుద్రలోకమ్ముఁ జేరి. ౩౫౦

తే. అబ్జనాళంబులో డాఁగి యశరణుఁ డయి
గురుని ధ్యానించుచుండెను సురల కపుడు
పాలకుం డయి నహుషుండు బ్రహ్మరథముఁ
బట్ట మునుల వేఁచిన ఘటభవుఁడు గినిసి. ౩౫౧

తే. సర్ప మై భువిఁ బడునట్లు శాప మిడియె
నంత నట గురుఁడు ప్రసన్నుఁ డగుచు బ్రహ్మ
హత్యఁ బుడమిలో నున్నమహాస్థలముల
హరసమర్చల నశియించు నని నుడివిన. ౩౫౨

తే. స్వర్గమున కేఁగి శక్రుఁ డుచ్చైఃశ్రవంబు
నెక్కి సురగురుయుతుఁ డౌచు నిలఁ దనర్చు
క్షేత్రముల వేఁటనెపమునఁ జేరి భవు స
మర్చ సద్భక్తి సలుపుచు నరిగి యరిగి. ౩౫౩

తే. కడకు నచటికిఁ జేర జఘాంస బ్రహ్మ
హత్య వెనుకాడఁ గారణ మరయ సురలఁ

బనుప వారొక కొలనుఁ దద్వాయుదిశను
గడిమితోఁటయు నందు లింగంబు మఱియు. ౩౫౪

తే. చిత్రవర్ణంబు లై యొప్పుపత్రరథము
లభవుశుభనామపఠన మత్యంతరక్తి
సలుపుచుంటయుఁ గాంచి విస్మయముఁ జెంది
శక్రునకుఁ జెప్ప వచ్చి యాశ్చర్య మొదవ. ౩౫౫

తే. కాంచి గురునితో నా కిటఁ గర్జ మెదియొ
యాన తిం డన జిష్ణున కనియె గురుఁడు
బ్రహ్మహత్య నశించె నిప్పటికి నిందు
స్వామికిం గుడిఁ గట్టింపవలయు ముందు. ౩౫౬

తే. అనుడు శివతీర్థమున స్నాన మాచరించి
గుడికి సంకల్ప మొనరించి కుశలుఁ డైన
విశ్వకర్మను నియమించి యీశ్వరునకు
భక్తిఁ దనయాతపత్రంబుఁ బట్టె వజ్రి. ౩౫౭

తే. అంత గుడి విమానము పూర్తి యైన వరణ
పంచకము దేవిగుడి మంటపములు గోపు
రములు పరివారదేవతాప్రతిమ లాది
తీర్థసోపానములు గట్టె దివ్యశిల్పి. ౩౫౮

తే. ఇంద్రు నాజ్ఞఁ బుష్పమ్ముల కేఁగి సురలు
వచ్చి యెందును లే వన్న స్వర్గమునకు
మరలఁ బుత్తెంచి తానును దిరిగి వనిని
వేయికన్నుల గాలించె విరులకొఱకు. ౩౫౯

తే. ఎందుఁ గానక వేసారి యింద్రుఁ డపుడు
పూర్వతీర్థమ్ముఁ జేరి యపూర్వదృష్ట

హేమపద్మంబు లటఁ జూచి యెలమిఁ బొంగి
యన్నిటిం గోసి శివుకడ కరిగె నంత. ౩౬౦

తే. అమరులున్ స్వర్గమునుండి యనుపమాన
దివ్యమణిభూషణాంబరనవ్యకల్ప
కుసుమములు దెచ్చినం గని కుతుక మొప్ప
శివుల సపరివారము ప్రతిష్ఠించి భక్తి. ౩౬౧

తే. సురమునిసహితుఁ డై రుద్రసూక్తములను
జెప్పి యభిషేక మొనరించి చిత్త మలరఁ
బూజ గావించి కాయంబు పులకరింపఁ
బ్రస్తుతించిన భక్తికి భవుఁడు మెచ్చి. ౩౬౨

తే. సహజసౌందర్యుఁ డై యుమాసహితుఁ డగుచుఁ
సరగఁ బ్రత్యక్షమై కోరు వర మనవుడు
సోమసుందరుఁ డనుపేర సుప్రసిద్ధిఁ
జెంది నిత్యసేవను దయచేయు మనుడు. ౩౬౩

తే. చిత్తతోఁ గూడుపూర్ణిమ చిత్తమునకు
నచ్చుఁ గావునఁ దప్పక వచ్చి నన్ను
దానఁ బూజించుచుండుము త్వన్మనోర
థములు సమకూరు ననుచు నంతర్ధి నొందె. ౩౬౪

తే. యుగమునకుఁ బదియాఱు గా నోలి నన్ని
యుగములకుఁ జతుష్షష్టిచిత్రోరులీల
లను గటాక్షించె సేవకులను దరింపఁ
జేయ సోమసుందరుఁ డవి చెప్పఁ దరమె. ౩౬౫

సీ. కల్యాణపురవాసి ఘనుఁడు ధనంజయుం
డనువర్తకుఁడు లింగి యనుపముండు

పశ్చిమదిశకు వ్యాపారంబునకుఁ జని
వచ్చుతఱిఁ గదంబవనము సేరి
భానుండు గ్రుంక దిగ్భ్రాంతి నొంది యదృష్ట
మున గుడియంతికమునకు వచ్చి
యొకచోటఁ గూర్చున్న నురువైభవమ్మున
నమరుల లింగార్చనములు సాఁగఁ
దనకు దేవుండు దివ్యదృష్టిని నొసంగఁ
గన్నులార నావిభవము గనుచు లింగ
పూజ నొనరించుకొనుచు నుప్పొంగి తెల్ల
వాఱ మూర్తులు గుళ్లై కన్పడినఁ గొలిచి. ౩౬౬

తే. అబ్బురంపడి తన మార్గ మరసి యేఁగి
స్వపురమును జేరియం దుండి పాండ్యదేశ
మేలు కులశేఖరున కిది యెల్లఁ దెలిపె
రాజు నాశ్చర్య మొందె నా రాత్రి దొరకు. ౩౬౭

తే. స్వప్నమున నొక సిద్ధుండు వచ్చి మా క
దంబవనమున నొకపత్తనంబు గట్టి
దాన నుండు మీ వనుచు నంతర్ధి నొందఁ
దెల్లవాఱ మంత్రుల కిది తెలిపి విభుఁడు. ౩౬౮

తే. సపరివారంబుగా వచ్చి స్వామిగుళ్లు
హేమపద్మాకరముఁ గని యెలమి మీఱ
నెందు నగరము నిర్మించు కొందమనుచు
నాత్మమంత్రులతో విభుం డరయునపుడు ౩౬౯

తే. స్వప్నదృష్టసిద్ధుఁడు వచ్చి పత్తనమునఁ
కిదియ నెల వని చూపి యదృశ్యుఁ డయ్యె

నట్లు పురిఁ గట్టి రాజు దేవాలయమున
కీశుదెస హర్మ్యముల వసియించె నెలమి. ౩౭౦

సీ. ఆపాండ్యరాజాన్వయమునందుఁ బొడమిన
మలయధ్వజునకు నాత్మజులు లేమిఁ
బుత్రకామేష్టినిఁ బొనరింప మీనాక్షి
త్రిస్తని యగుచుఁ బుత్రిగ జనించి
తల్లిదండ్రులయనంతరమునఁ బాండ్యదే
శము నేలి దిగ్విజయమును గూర్చి
యఖిలదేశము లేఁగి యందఱను జయించి
కైలాసమున కేఁగి కలనియందు
గణముల జయించి నందినిఁ గాందిశీకుఁ
జేయ నతఁ డీశుకడ కేఁగ సిద్ధపడుచు
నంతలో మూలలింగంబునందునుండి
సుందరేశుండు విచ్చేయఁ జూచి యలరె. ౩౭౧

తే. అంత నాతటాతకయు నయ్యభవుతోడ
యుద్ధ మొనరింప నేతెంచి యురమునందు
వికృతి యడఁగిన లజ్జించి ప్రకృతిపురుష
బోధఁ దద్వివాహాద్యమమును బొనర్చె. ౩౭౨

తే. ఆ తటాతకఁ బెండ్లాడి యనుపమాన
దివ్యవిక్రమవైభవదీప్యమానుఁ
డగుచు సోమసుందరవిభుం డచల నేలె
నవని కానాఁటివైభవం బబ్బ దెపుడు. ౩౭౩

సీ. అంతట సుందరేశాంశజులగు రాజు
లెందఱో వసుమతి నేలి రపుడు

భూతల మెల్ల నంభోరాశి యగుడు నీ
హాలాస్య మక్షయ మగుచు నిలిచెఁ
గ్రమముగా నన్నియుఁ గననాయె సూర్యచం
ద్రాన్వయజులు విభు లలరి రందు
శశిశేఖరవిభుఁడు స్వామిగుడికిఁ జుట్టుఁ
బట్టణంబును గట్టి పాలనంబుఁ
జేయుచు వసించి పెరుఁగుటచేత జనుల
కిఱుకుగా నున్నఁ బత్తనం బెచ్చుచేయఁ
దలఁచుచో స్వామి దొరకుఁ బ్రత్యక్ష మగుచు
బ్రణతులను గొని యాతనిభావ మెఱిఁగి 324

తే. పురికి హ ద్దిడ నాకల్పభుజగమునకు
నాజ్ఞ యొసఁగిన నేను హాలాస్య మగుటఁ
బురికి నా పేరె యిడుఁ డని మ్రొక్కి స్వామి
చుట్టు యోజనావధి గల్గఁ జూపె సీమ. 325

తే. కాన హాలాస్య మందు రద్దాని జిహ్మ
గమనదర్శిత మగుట వంకరగఁ గోట
కాననగు సోమసుందరేశానరుచిర
మౌళిశశిసుధాసంగతి మధుర యయ్యె. 326

## శ్రీరామసింహాసనము

తే. నలవినిర్మితసింహాసనంబుఁ జూచు
ననఘులకు నబ్బు ముక్తిసింహాసనంబు
మనుజవేషమ్ము వేసిన మాధవునకు
నాసనం బయ్యె దానిపుణ్యంబు కొలఁదియె. 327

రైక్వముని నిజఘనతపః ప్రాభవమున
గంగను గయను యమున నాకర్షణంబుఁ
జేసి కృతకృత్యుఁ డయ్యె నాక్షేత్రమందుఁ
జిత్తశుద్ధిదంబు లగుచుఁ జెలఁగు నవ్వి. ౩౮౭

సీ. గాలవమునిని రాక్షసుఁడు పట్టిన వానిఁ
జదిపెఁ జక్రి మదియుఁ జక్రతీర్థ
మగ్నిప్రవేశనానంతరమున సీత
తానమాడినది సీతాసరస్సు
రావణునిం గూల్చి రాముండు గడిగె జ
టల నెందు నదియ జటాసరస్సు
మున్ను కుబేరుండు మునిఁగి నిధీశుఁ డై
నదియ లక్ష్మీతీర్థ మయి చెలంగు
జానకీశోధనమునకు స్వామి యొందు
నగ్ని నావాహనము సేసె నగ్నితీర్థ
మయ్యె నయ్యది ధాత మిథ్యాప్రసక్త
పాపమును బాసినట్టిది బ్రహ్మసరసి. ౩౮౮

తే. మును మనోజ్ఞుం డవనిఁ గోల్పోయి మూఁడు
మాసములు స్నాన మొనరించి మరల లబ్ధ
రాజ్యుఁ డయ్యె మంగళతీర్థరాజ మందు
మంగళములు సేవకుల కొసంగు నద్ది.

తే. అభవునకు నగస్త్య భ్రాత యర్చ సల్పి
యమృతమును గాంచినట్టిది యమృతవాపి
రామతీర్థమునన్ ధర్మరాజు మజ్జ
నమ్ముఁ గావించి యనృతదోషమ్ము వాసె. ౩౮౯

తే. కాంతిమతి యను గాలవు కన్నె వలచి
యతఁడు శపియింప బేతాళుఁ డైె సుదర్శ
నాఖ్యుఁ డెయ్యది సేవించి యరిగె దివికి
వఱలు నయ్యది బేతాళవరద మనఁగ. ౩౯౦

తే. సుమతి వేదోపదేశంబు శూద్రుఁ డైన
దృఢమతికిఁ జేసి జన్మంబు లెల్ల నెత్తి
విప్రుఁ డగుచు బ్రహ్మగ్రహాపీడ వీడె
నంద్య మలరును బాపవినాశనంబు. ౩౯౧

తే. హలధరుఁడు నైమిశంబున కరిగి సూతుఁ
జంపి యోగబలమున జీవింపఁజేసి
యెందు మునిఁగి తత్పాపంబు డిందఁజేసె
నదియ లక్ష్మణతీర్థ మై యలరు చుండు. ౩౯౨

సీ. సాంగమ్ముగా వేద మధ్యయనము సేసి
గురుమూర్తి యగు సుదంకుని పనుపునఁ
గక్షివంతుఁ డేగి నగ్నిస్తీర్థమ్మునఁ
దాన మాడుచుఁ ద్రివత్సరము లుండి
య ద్దాన వెలువడినట్టి చతుర్దంత
గజము నధిష్ఠించి కదలి మధుర
నేలెడి స్వనయభూమీశ్వరు నీక్షించి
యతనిచే వందితుం డగుచు నతని
యాత్మజ న్మనోరమను బెండ్లాడి ధరణి
యంద స్వర్గభోగమ్ముల ననుభవించి
యపరదేవేంద్రుఁడో యని యఖిలజనులు
దన్ను నూహించునట్టులు తనరె మిగుల. ౩౯౩

సీ. కైలాసమున కేఁగి కష్టించి తెచ్చిన
తన లింగమునకు వ్యర్థత ఘటిల్లె
నని యంగలార్చెడి హనుమకు రాముండు
ముందు సిద్ధానియున్మూలనంబు
సేయు మిచ్చుట నీదు శివలింగమును బ్రతి
ష్ఠింతు నావుడు సంతసించి తనదు
తోఁక దానికిఁ జుట్టి తూఁగాడి దూఁకుచు
దూసి దూరమ్ముగాఁ దోలఁగఁబడిన
యవనియే హనుమత్కుండ మయ్యె వాల
కర్షవళులు గన్పడును లింగమున కిపుడుఁ
బుత్రకామేష్టి నటఁ జేసి పూర్వమందుఁ
దనయులం గని తరియించె ధర్మసఖుఁడు. ౩౯౪

తే. అభవుఁగూర్చి తపించు జాత్యంధుఁ డైన
సుచరితునకుఁ బ్రసన్నుఁ డై శూలపాణి
సర్వతీర్థమ్ములను మనశ్శక్తిఁ గూర్చె
మానసం బది తరియించె మాని దాస. ౩౯౫

తే. దశరథసుతుండు గంధమాదనగిరిని వి
భీషణుండు పరాగమనవిభీతి వేడఁ
గూల్చె సేతువుఁ గృప ధనుష్కోటి నయ్యె
నది ధనుష్కోటి బహుళపుణ్యప్రదంబు. ౩౯౬

తే. రామనాథాభిషేకతీర్థమునుగూర్చి
తనధనుష్కోటి రాముండు ధరణిఁ జీల్చెఁ
గోటితీర్థ మయ్యది యందుఁ గ్రుంకు లిడుచు
మగుడవలయును దైర్థికుల్ తగదు నిల్వ. ౩౯౭

తే. బ్రహ్మహత్యావిమోచనప్రాంతమందుఁ
గల బిలమ్మున నాహత్య నిలిపి పైనిఁ
గాలభైరవు రక్షకై కాపువెట్టెఁ
గాన నయ్యది కృశియించి దాన నడఁగె. ౩౯౮

తే. మ్రోల వహ్నియు దక్షిణమునను గౌరి
పార్శ్వములఁ బ్రొద్దు నెలయు దిక్పతులు చుట్టు
స్వామికిం దరిఁ గరిముఖప్రముఖు లుండ్రు
పెద్దనందియు నచ్చోట వెలయుచుండు. ౩౯౯

సీ. శంకరపాండ్యభూజాని వేఁటాడుచుఁ
బర్వతగుహాయందు వ్యాఘ్రకృత్తిఁ
బైఁ గప్పికొనుచుఁ దపంబు గావించు శా
కల్యమునీశు వ్యాఘ్రం బటంచు
బాణమ్మునన్ గొట్టఁ బత్నితో నాతండు
సమసినఁ బుత్రుండు జాంగలుండు
వగచి తద్దేహముల్ వహ్ని నునిచి యమ్మ
హాస్థలిఁ జేరి తదూర్ధ్వదైహి
కములఁ జేసి వారలకు మోక్షము ఘటించె
శంకరవిభుండు నమ్మహాస్థలమునందె
బ్రహ్మహత్యావిముక్తినిఁ బడసి మరలఁ
బాండ్యదేశమ్ముఁ బాలించెఁ బరిఢవమున. ౪౦౦

తే. ఎచ్చ టెచ్చట నే మేమి యెట్టు లెట్లు
సలుప వలయునో యా రీతి సత్యవతియు
భర్తతోఁ గలావతితోడఁ బైసమస్త
తీర్థములఁ గృత్యములనెల్లఁ దీర్చివెడలి. ౪౦౧

## తోతాద్రి మొదలగునవి

సీ. బంగారుతేరున రంగారుతోతాద్రి
నరసింహవిభు నర్చనంబు సేసి
యఖిలజనావనఖ్యాతిఁ గాంచు జనార్ద
నస్వామిని జనార్దనమునఁ గొలిచి
యలయనంతశయనమందును వెలసిన
పద్మనాభస్వామి భజన సేసి
వింధ్యారిమహిమచే విష్ణుండు శివుఁడైన
కృత్తాల విభునకుఁ గేలు మోడ్చి
యాదిలింగమ్ముఁ గృష్ణుఁ గన్యాకుమారి
దేవిఁ బూజించి జలనిధితీరమందు
మూఁడుక్రోసుల కొకటి గాఁ బొలుచులింగ
ములను గొలుచుచు గోకర్ణమునకు వెడలి. ౪౦౨

తే. పశ్చిమసముద్రతీరవిభాసురమును
మధ్వగురుమూలపురుష జన్మస్థల మగు
నుడిపిఁ జెలఁగు సుబ్రహ్మణ్యుఁ గడఁదిభక్తి
దనరఁ సేవించి గోకర్ణమునకుఁ జేరి. ౪౦౩

## గోకర్ణక్షేత్రము

తే. ఉదధిఁ గోటితీర్థంబున నుచితరీతి
స్నాన మొనరించి గోకర్ణనాథు విశ్వ
నాథుఁ దక్కుదైవంబులం దగ భజించి
కతిపయదినంబు లం దుండి కదలి చనుచు. ౪౦౪

## మైసూరు మొదలగునవి

సీ. మహిషపురావాసమహితు నంజుండేశుఁ
జాముండికేశు నర్చనము చేసి

కావేరి పాడముట ఘనతఁ గాంచినచోట
స్నానమ్ము చేసి పూజల నొనర్చి
పాండురంగక్షేత్రపతి విట్ఠలేశ్వరు
దర్శనమునఁ గృతార్థత వహించి
తుంగభద్రం గూడి రంగారుకడ శృంగ
గిరివిశేషముల వీక్షించి వెడలి
శూర్పణఖముక్కుఁ గోసినచోటుఁ బంచ
వటిని నాసికాత్ర్యంబకభవ్యతీర్థ
ములను సేవించి గౌతమీపుణ్యతటిని
వోవుమార్గమ్ముఁ గైకొని పోయి పోయి. ౪౦౫

## ధర్మపురి

తే. పుణ్యపరిపాకసమకాలమునకు నొక్క
మంజుళారామమందు ధర్మపురి చెలఁగు
తావున న్నెమ్మి విడిసి కృత్యములు తీర్చి
పవలు రేయిని భవుఁ గొల్చి పండితెలమి. ౪౦౬

క. ఇవటూరి బసవనారా
ధ్యవినుత యంబన్నగురుసమర్చిత విద్వ
త్కవి వీరబసవ చిన్నబ
సవసన్నుతరామలింగ సద్విభుసంగా ! ౪౦౭

క. సురుచిరతక్రపురీప్రభు
వర సంస్థానాభరణ విపశ్చిన్మ్రుగరా
ణ్నరహరిగురుమూర్త్యాహ్వాయ
గురుహృదయగ! రామలింగ! కోవిదసంగా! ౪౦౮

క. బసవేశ్వర తత్సుతహృ
ద్బిసరుహరుచిరాంతరాళవిహరణ విద్వ

ద్భసల! పతితపావనపద
కిసలా! శ్రీరామలింగ! కితవవిభంగా! ౪౦౯

తే. కని రహిఁ బెంచుకొను నాదు కవితఁ గన్నె
నీకు నిచ్చితి నోయన్న నెనరుతోడ
నెట్లు పెంచెదవో చుమీ యేమఱకుము
మమ్ము సంతోషపెట్టు నమస్కరింతు. ౪౧౦

సీసము

హారితగోత్రోద్భవుం డైన మల్లమపల్లి యత్తయగురునకు నగ్రిమాత్మజుండు
గణాచార్యవ్రతస్థుఁడు సాధు వౌ వీరమల్లయాఖ్యారాధ్యతల్లజునకు
భ్రమరాంబకును దనూభవుఁడ విద్వత్సింహుఁ డౌ రామ
లింగయ కవరజుండ మల్లికార్జునుఁడ శ్రీమల్లికార్జున
కృపాయత్తకవిత్వుండ నైన నాదు సత్యవత్యు
పాఖ్యానసంజ్ఞ ప్రబంధమందునన్ జతు
ర్థాశ్వాస మమర నిట్లు ముగిసె
నాచంద్రతారకముగఁ దనర్చు
నట్లు సేయుత దీనిఁ
జంద్రార్ధమౌళి.



శ్రీరస్తు

# సత్యవత్యుపాఖ్యానము

## పంచమాశ్వాసము

శ్రీ మల్ల్యంబాతన్వా
రామానవరతవిహారరసికా ! విబుధ
స్తోమస్తుత నిజసుచరిత
భూమా ! శ్రీరామలింగ ! భూతిసితాంగా ! ౧

క. అస్మన్మాతృకులాభర
ణాస్మయసాంబాగ్రజవినయాంచన్నాగే
శస్మరణవిషయ రూపజితస్మర !
శ్రీరామలింగ ! ధరణీరథాంగా. ౨

తే. అవధరింపుము మాయన్న యవలికథను
గౌతమసుధాంబునిధినుండి కదలు సుధను
ఘోరదురితాద్రిభంజనకులిశవిధను
నిహపరానందపరవశీకృతవిబుధను. 3

వ. అంత, సత్యవతి బ్రాహ్మముహూర్తంబున లేచి కళావతీ నిజపతి సహాయతైర్థికసంఘమ్ములతో గౌతమీజలమ్ముల స్నానాద్యనుష్ఠానమ్ములం దీర్చి భాస్కరు నారాధించి శ్రోత్రపేయంబుగా విపంచి మీటుచు భగవత్సంకీర్తనంబుఁ గావించుచుండ.

### సత్యవతీపరీక్షకు మాయావటుఁడు వచ్చుట

సీ. ఎదుటఁ గాముని గెల్చి యేఁగిన నయ్యుమ
మెవ్వాని దపముల నెనసియుండెఁ

పరమపావని యయ్యు భాగీరథీదేవి
యేసుందరునిఁ బొంది యెలమి నుండె
దమము శమము గల్గి దారుకావనసతు
ల్వలచి యెవ్వనివెంటఁ బడి వెడలిరి
పురుషుఁ డయ్యు నెవనిఁబొందున కాసించి
పురుషోత్తముఁడు పువ్వుఁబోఁడి యయ్యె
నట్టిశతకోటిగుణమన్మథాకృతి ప్ర
శస్తసౌందర్యమూర్తి శ్రీశంభుమూర్తి
సత్యవతిపతిభక్తిఁ గాంచంగ వచ్చె
క్షత్రియబ్రహ్మచారివేషమ్ముతోడ. ౪

క. వచ్చినఁ గని యచ్చెరువున
నచ్చటివా రెల్ల లేచి యతివినయమునన్
జెచ్చెర నర్ఘ్యాసనముల
నిచ్చినఁ గైకొనుచు మెచ్చి యిటు లనె వటుఁడున్. ౫

శా. ఏ మీగానము రూప మేమి వినయం బే మీవివేకం బదే
మీ మే మెన్నఁడుఁ జూడమైతి మహహా! మేదిన్యధీశాన్వయ
శ్రీ మాకుం బొడగట్టెఁ గట్టెదుట నిన్నీ! క్రూరసర్పంబ! యీ
భూమిశాత్మజ కిమ్మహోగ్రభుజగంపుంబొత్తు చిత్రమ్మగున్. ౬

తే. అడుగకయె మాకుఁ దెలిసిన నడుగ వేఁడు
కయ్యె నీ లున్న నుడువు మోయబ్జవదన!
యీ యపరజగన్మోహిని యే ధరాధి
నాథుకన్యయో యీ భోగినాథుఁ డెవరో? ౭

వటువచనములకుఁ గళావతి సమాధాన మిచ్చుట

తే. అని కలావతి నడుగ న య్యబ్జవదన
వినయపూర్వకముగ నిట్లు విన్నవించె

రాజశేఖర! మీరు సర్వజ్ఞు లగుదు
రేను మీకుఁ జెప్పఁగ నేర్తునే మహాత్మ! ౮

ఉ. మీ మృదుభాష లన్నియును మిథ్య యనం దగ వైన దేవ! మా
స్వామి భుజంగనాథుఁడు కృపాజలరాశి సహస్రభానుపూ
జామహితాత్ముఁ డార్యజనసంస్తవనీయచరిత్రుఁ డేలొకో?
భూమిభృదన్వవాయమునఁ బుట్టె భుజంగమరూపధారి వై. ౯

క. మన మనుకొనియెడి నుడు లె
ల్లను విని విననట్టు లుండు లలనామణి య
య్యనఘునిసొ మ్మయ్యరువుర
కును సేవకురాల నేను గొమ్మ సతి సుండీ! ౧౦

వ. అనిన నాక్షత్రియబ్రహ్మచారి మరలఁ గళావతి కిట్టు లనియె.

చ. సతికి భుజంగసంగతికిఁ జాల విరోధము నీవు చెప్పుసం
గతి యతిచిత్ర మోయతివ! కానఁగ రా దిటువంటి దెందు నా
మతి చెడె నీయదృశ్యతమమధ్యమకుం గలయట్టినామ మే
సతి యని యేమొ యట్లయిన సంతసమే యగు నంచు నిట్లనున్.

మ. సతియే యీ కొమ కానసేచుమి మనస్సంభ్రాంతి కాకున్న మా
మతి యెన్నండును సంభ్రమింప దవునౌ మాకోర్కు లీడేరె మీ
పతియున్ మాకు నభీష్టుఁ డై చెలఁగెడిన్ బాగయ్యె మీ రింక నీ
గతిఁ గష్టంపడ నేల? రండు కడుసౌఖ్య మ్మబ్బు మావెంబడిన్.

శా. ఏమో చెప్పితి నంచు నెంచకుఁడు మీ రెల్లేని మాతోడ మా
గీముం జేరిన వెండిమేడలపయిన్ గ్రీడింపఁగా వచ్చు మా
తో మా చైత్రరథం బనం దనరుపూఁదోఁటన్ యథేచ్ఛావిహా
రామోదమ్మును జెందవచ్చు నట నిత్యానంద మెవ్వారికేన్. ౧౩

తే. పరమహంసవినిర్మలపావనోరు
మానసంబన దేదీప్యమాన మగుచుఁ
గనకకమలాకరం బొండు గలదు సుండి
యచటిజలకేళిసుఖ మిట్టి దన వశంబె? ౧౪

తే. తప్తకాంచనమును గేరుతనువు గల్గు
గౌరి నా నొప్పునీచాన కట్టుపుట్ట
మకట! వల్కలంబా! యట్టు లైన నలరు
వికృతియును సుందరులకుఁ దెప్పించు సొగసు. ౧౫

తే. ఇట్టిసౌందర్యజలరాశి కింక రత్న
భూషణమ్ములును దుకూలములె యమరిన
నెట్టు లుండునొ యిఁక నది యెంత నాదు
కరమునకె రత్నములును బంగరును గలవు. ౧౬

తే. ఇట్టు లారాజవంశుఁడు దా గుట్టు సెడని
యట్టు లున్నది యున్నట్టు లనుచు శక్తి
కొలఁదిఁ దత్సతిచిత్తనిశ్చలత తొలఁగ
యత్న మొనరించుచుండె నయ్యవసరమున. ౧౭

సీ. ధగధగద్ధగ యని తనరారు మొల నున్న
కత్తినిఁ గనులారఁ గాంచువారు
వెడఁదయొమ్మున వ్రేలు వెలలేని మంచిము
త్యాలహారముతీరు నరయువారు
క్రొత్తక్రొత్తగ నడ్డి కొనసాగుమీసాల
కుదిరిక నే కనుఁ గొనెడువారు
వంకరపాగయు వలగొని మెడఁబడు
చికురములజిగి నీక్షించువారు

కనులవిలుకానితూపులకన్న వాఁడి
గలుగుచూపులమొనపులం గనెడువారు
బ్రహ్మ యియ్యమ కీతనిఁ బతి నొనర్పఁ
డయ్యె ననువారె యెవ్వారు నరసిచూడ. ౧౮

క. కుహనావటువచనములకు
నహిపతి యర్థ మ్మెఱింగి యలుగక తద్వి
గ్రహమున్ గాంచుచుఁ బ్రణమా
మ్యహ మనుగతి భక్తిఁ గాననగుఁ జిత్రముగన్. ౧౯

క. అటు లావటుఁ డనుచుండన్
గుటిలాలక మోము వాంచి కోపారుణదృ
క్పుటులప్రసారణంబుల
నిటు చెలిచేత ననిపించె మృదుమధురముగాన్. ౨౦

ఉ. రాజవతంసు లీర లగు రాజకుమారిక మా వయస్య వి
భ్రాజదశేషసద్గుణవిరాజితమూర్తులు మీర లిర్వు రం
భోజభవుండు దా మఱచిపోయి ఘటింపకపోయె మిమ్ము మా
రాజుతపంబు పండె నిట రాగముఁ జెందకుఁ డయ్య మీ రికన్.

చ. సతికి భుజంగసంగతికిఁ జాలవిరోధ మటంటి రెట్టులో
పతియె భుజంగుఁ డైనయెడ భార్యసతీత్వము సెల్లకుండునే ?
మతి చెడె నంటి రయ్యదియె మాకును దోఁచెడి నింక నీపయిన్
జతురతఁ జూపకున్న సరసంబుగ నుండు నటంచు నెంచెదన్. ౨౨

తే. వెండిమేడలుం గొప్పలే ? పృథ్వి నెందు
నరయ సువర్ణమయము లయ్యవి యటంద్రు
కరమునవె కాని మీకు బంగారుమేడలు
మాపురం బెల్ల మణిభర్మమయము సుండి. ౨౩

తే. గౌరి యనిమెడునొకనేఁతిబీఱకాయ
యుపమ దొరకెనె మా చెలి కూరకుండఁ
డఖిలలోకైకవంద్య యయ్యమ శరీర
కాంతి నియ్యమకీను రాఁగలదె? చెప్పుఁడీ. ౨౪

తే. మణిమయాభరణంబులు మంచివిలువ
గలదుకూలమ్ములును లేకకాదు మాకు
యాత్రలందున నవి యుండ నగునె? యనుచు
విడిచి వచ్చితిమే కాని వేఱు గాదు. ౨౫

తే. చైత్రరథ మనఁ దగునొకచిత్ర మైన
తోఁట గల దంటి రాపాటితోఁట యే జ
గమ్మునను లేదె? యద్దానికన్న నలరు
నలరుఁదోఁటలు మాకును గలవు వేలు. ౨౬

క. తామరపూలే కనకం
బా మానసమునఁగ నెంత యంతకు హెచ్చౌ
శ్రీ మించుకొలఁకులుం గల
వో మోహనభవ్యభావ! యుజ్జ్వలవేషా! ౨౭

ఉ. ఏనును రాజశేఖరుఁడనే యని మీరలు శ్లేషభంగి మా
తో నను జెల్ల స్పష్టముగఁ దోఁచెను మాకు మహానుభావులే
మీ నుడు లెల్లఁ జిత్రములు మీ కెటు లేనియు పీలె యట్లు మా
చానకు పీలు కాదు పదిసారులు చెప్పఁగ నేల యింకిటన్. ౨౮

చ. సతి యని మా సఖి న్నుడువఁ జయ్యన రాజశిఖామణిత్వ మీ
గతి నిలువంగఁ బెట్టుకొని కామితసిద్ధిఁ గనంగ నెంతురే?
సతి యనకున్న నప్పటికిఁ జాయ యెదో పొడఁగట్టదే భుజం
గతతిగతుల్ భుజంగులకుఁ గాక యెఱుంగ వశంబె? యేరికేన్.

శా. చాలుంజాలును గట్టిపెట్టుఁ డిఁక మీ చాతుర్యముల్ సత్కథా
కాలక్షేపము వీటఁబుచ్చితిరి చుల్కంజేసి మమ్మిమ్మెయిన్
వేళాకోళము సేయసాఁగితిరి పృథ్వీభర్త గోపించు నిం
కీలాగైన వినంగ మీకుఁ గుతుకం బేని న్వినుం డీపయిన్. 30

క. అని నుడువుచుఁ దన చెలిఁ గనుఁ
గొని కనుగొలిపిన నెలంత గొంకుచు వీణన్
గొని కథ మొదలిడి యేమో
యనువటుఁ గనుఁగొనుచు లేచి యరిగెడివేళన్. 3౧

## ఈశ్వరసాక్షాత్కారము

సీ. బాలచంద్రమునితో భాగీరథీదేవి
పొంగుచు సిగపైనఁ బొలుచుచుండ
ముసిముసినవ్వుతో మూఁడుకన్నులమోము
నయనంబులకు విందొనర్చుచుండఁ
గాలకూటమ్ముతోఁ గాకోదరస్వామి
గళమున వలగొని క్రాలుచుండ
హస్తిచర్మంబుతో నంసోన్నతస్థలు
లురగకుండలముల నొరయుచుండ
వ్యాళయజ్ఞోపవీతముల్ వ్యాఘ్రకృత్తి
యభయహస్తంబుఁ బరశువు హరిణశిశువు
వరద మలరంగ నిలు నిలు హరుఁడ హరుఁడ
ననుచు సాక్షాత్కరించె నాయమకు శివుఁడు. 3౨

క. అబ్బురపడి నిలువంబడి
గొబ్బునఁ దత్రత్యు లెల్ల గురుతరభక్తిన్
లిబ్బులదొర చెలికానికి
నుబ్బుచుఁ గరములను మోడ్చి యొనరిచిరి నుతుల్. 33

వ. సత్యవతి సాశ్చర్యసంభ్రమానందంబుగ నంజలిం ఘటించి.

శా. దేవా! మీరలె ? కావ వచ్చితిరె! నా దీనస్థితిన్ గాంచి మో
హావేశమ్మున నెవ్వరో యిపుడె యన్యాయంబుగా నన్ను నే
వేఁపో యంచుఁ గలంచసాఁగ వినలే కే నేఁగుచుంటిన్ గృపా
శ్రీవారాన్నిధు లైన మీ రిటు కటాక్షింపన్ భయమ్మేటికిన్. ౩౪

శా. మా పుణ్యంబులు పండె నేఁటికి జగన్మాన్యత్వముం గాంచి మే
మీపై వర్ధిలుచుంటిమో యనఁ గన్పడియె భోగేంద్రుండు యుష్మత్కృపా
శ్రీపూర్ణుం డయి మానవుం డగు యశశ్శ్రీ మమ్ము సేవించు మీ
శ్రీపాదమ్ములసేవ నిత్య మిడి రక్షింపంగదే యీశ్వరా ! ౩౫

వ. ఇట్లు ప్రార్థించి సానూయంబుగా క్షత్రియవటున్ వెదకి యొందు
నుం గానరామికి మిగుల నానందించుచుండఁ బరమేశ్వరుండు మఱి
యుం బరీక్షించువాఁడై చిఱునగవుతో నాయమ కిట్లులనియె.

మ. ఇపుడైనన్ నను నీ వెరింగితివె నేనే చుమ్మి యా రీతిగాఁ
గపటంపున్వటువేష మూనితి నినుం గామించి యీ గడ్డ మీ
యపహాస్యాస్పద మైనజుట్టుముడి ఫాలాక్షుంబుఁ దోల్గుడ్డలున్
విపరీతమ్ములు మెచ్చ వంచు నిఁక నీ స్నేహమ్మె చూపందగున్.

ఉ. నీ పతి మంచివాఁడె యతనిం దలపైఁ బువుభంగి మోవఁగా
నోపుదు నేను నీకు భయ ముండదు పార్వతి గంగ యేనియున్
నీపయిఁ గోపగింప రిది నిక్కము నమ్ము వయస్య వీడఁగా
నోపవ యేనిఁ దోడుగనె యుండును దానికి లోపముండునే? ౩౭

క. తడవేటికి నడునడుమో
పడఁతి! వృషభమ్ము నెక్కు భయమేటి కనన్
గడగడ యొడలు వడఁక నుడి
తడఁబడఁగా నుడువఁ దొడఁగెఁ దద్దయు వినతిన్. ౩౮

శా. దేవా! దేవర భక్తురాలిపతిభక్తిన్ గాంచ నేతెంచి యే
వేవో చెప్పుచు నున్నవారలు నిజంబే యట్లు కాకున్నచో
శ్రీవారెక్కడ నేనదెక్కడ ననున్ స్నేహింతురే యో మహా
దేవా! యీగతిఁ బట్టుఁబట్ట కిఁక వే దీనన్ గటాక్షింపవే ౩౯

మ. రమణుల్ మీరలు మీరలే రమణు లర్థాంగ మీపొత్తు కా
ని మనం బెందులకో రొయుడంబడదు మన్నింపుండు నా తప్పులో
కములో సత్యవతిన్ బతివ్రతల కత్యున్ మీఱుగా నీకుఁడీ!
మిము సేవింతుము వేగఁ బ్రోవఁగదె సామీ! భక్తచింతామణీ!

వ. ఇట్లు సత్యవతి బహుప్రకారంబుల సకరుణంబుగా నీశ్వరుం బ్రా
ర్థించుచుండ.

## పార్వతీసాక్షాత్కారము

సీ. అభ్రమధ్యమ్మున నబ్బురంబుగ నిల్చి
మేఖలావిద్యుత్తు మెఱయుచుండ
నరుణాంబరంబున నణఁగి యుండక పయో
ధరములు పైపైకిఁ దనరుచుండఁ
గంధరోచ్చైఃపదకలనంబున న్మించి
హారమధ్యమణీంద్ర మలరుచుండ
నాసేచనక మగునాస్యాంబుజంబుపై
భ్రమరకంబులు రహిన్ బరఁగుచుండఁ
గుండలాకృతి రవిశశిమండలంబు
లలర నలరుచు నద్రిరా! యనుచు వచ్చి
నిలిచెఁ బతిమ్రోల గిరిసుత నిర్భరప్ర
మోదు లై యందఱుఁ గరాబ్జములను మొడువ. ౪౧

వ. అట్లు నిలిచి

శా. సామీ! యెందుల కింక నీయమఁ బరీక్షం జేయు టీ చంద మే
సీమం గానఁగరాదు దేవర కృపన్ శ్రీఘ్రమ్మె యీభోగికిం
గామాతీతమనోహరాకృతి నొసంగం జెల్లు నీ చానకున్
భూమిన్ స్వర్గసుఖం బొసంగి యటుపై మోక్షమ్ము నీయందగున్.

తే. అనుచు గిరిరాజకన్య యాయమను గూర్చి
ప్రాణనాథునితో నన నా కృపాబ్ధి
యెలమి మీఱి మానసమున నిముడకునికి
నెల్లవారును వినునట్టు లిట్టు లనియె. ౪౩

శా. ఔరా! యింతటిదానవా! హరివిరించ్యంభోజనాభాదికో
టీరాంచన్మణిపుంజ మంజు పదపీఠ వైభవ శ్రీగురు
క్షీరాంభోధుల నైనమమ్ము శమశ్రీ మించితే మేలు మా
కారుణ్యమ్మును జూఱఁగొంటివి కదే! కన్గొన్ము నీవల్లభున్. ౪౪

భోగినాథునకు మనుష్యరూపంబు వచ్చుట

క. అన విని సత్యవతీసతిఁ
దనపతిఁ గనుఁగొనుఁడు సర్పతనువు విడుచుచున్
మునుపటిక్షత్రియవటుఁ డై
కనఁబడెఁ జిత్రముగ మణిశిఖామణి యయ్యెన్. ౪౫

శా. ఆలోఁ గూఁతురు నల్లుఁడున్ గలిసి యాత్రార్థంబుగా నేఁగిన
ట్లేలాగో కనిపట్టి పట్టి యగుభోగీశానుఁడున్ గోడ లిం
కేలా రా రని మంత్రిసత్తములయందే భారము ల్మోపి యా
వేళ న్వారలతల్లిదండ్రులు సమావేశించి రచ్చోటికిన్. ౪౬

తే. అచటివారలు వీరలు నబ్బురపడి
యంజలులు సేసి భక్తిమై నాపురాణ

దంపతులఁ గాంచుచుండఁ గందర్పజష్ణుఁ
డైన యహిరాజు సాంజలి యై స్తుతించె. ౭౮

## దండకము

శ్రీ చంద్రరేఖావతంసోల్లసన్మౌళులారా! సరస్మందహాస స్ఫురచ్చంద్రికా భాసమానాస్య పూర్ణేందులారా! కృపాశ్రీపయోరాసులారా! యుమాశంభులారా! శ్రితాభీష్టచింతామణు ల్మీర లీ రీతి మాపైఁ గృపం జూపినారే! సురేశాబ్జజాతాబ్జనాభాదులు న్మీపదాబ్జమ్ములం జూడఁగా లేరు వీక్షింపఁగాఁగల్గె మాకున్ ఫణీంద్రుండునున్ మిమ్ముఁ గీర్తింపఁగాఁ జాలఁడే రీతిఁ గీర్తింతు మోదేవరా! దేవి! మీరే కదా తల్లిదండ్రుల్ జగమ్మంతకున్ జెంతకున్వచ్చి మా చింతలం దీర్చి మీ రింతగా మాకు సంతోషమున్ గూర్చినా రింతకన్నన్ మహా వైభవం బుండునే కుండలిత్వంబునం దల్లికిం దండ్రికిన్ బుట్టి యే రీతినో యీ సరోజాననన్ బెండ్లియై కన్నులం గాంచుమే లేనియుం బట్ట కెన్నేండ్లలో లోనఁ జింతించుచున్ గుట్టుగా నుండి యెట్లెట్లొ యిమ్మానవాంభోజపత్రేక్షణా రత్నముం గాంచి యయ్యయ్యొ! యీ యభ్రమధ్యామనోవాంఛ సి తుచ్ఛపున్ సర్పదేహంబుతో నెట్లు నేఁ దీర్తు నంచున్ విచారించు చీ సైకతశ్రోణి సద్భక్తిమైఁ జేయుసంసేవలం దేలుచున్ రక్తిగా వీఁశియ స్మిటుచుం బాడు మం నన్ను సంతోషవారాన్నిధిం దేల్పఁగాఁ దేలు చంతఃపురస్త్రీ సహస్రంబుతో నెంతయో కాలముం బుచ్చి యే తత్సఖీరత్నసాహాయ్యముం జెంది యిమ్మందయానావతంసంబు తీర్థంబులెల్లన్ క్రమం బొప్ప సేవింప సేవించుచు న్నేఁటికీ తీర్థరాజమ్మునన్ మీకటాక్షంబునన్ జంతితార్థమ్ము సిద్ధించు టన్నేను నా తల్లియుం దండ్రియుం భార్యయు మ్మంత్రియుం జేటు లెల్లన్ గృతార్థత్వముం జెందినా మేమి పాపంబులుం బూర్వజన్మంబులన్ మేము గావించి

నామో మెఱింగింపరే! మాకు సర్వేశ్వరుల్ మీకుఁ గేల్మోడ్పులం
గూర్తు మెల్లప్పుడున్ దేవ! దేవీ! నమోవాం నమోవామ్.

క. అని ఫణిపతి నుతియించిన
విని పశుపతి దయ దలిర్ప విశదముగా ని
ట్లనఁ దొడఁగను నరదేవులు
వినఁ దొడఁగిరి యచటివారు వీను లలరఁగన్. ౪౮

తే. పూర్వభవమున రాజవై పొలఁతితోడ
వనవిహారమ్ము సలుపుచుఁ బాముఁ గట్టి
మీఁట నది మునిపైఁ బడ మెలఁత నగిన
నలిగి యాతండు శపియింప నైతి రిట్లు. ౪౯

క. నీ తలిదండ్రులకున్ వి
ఖ్యాతిని విని యొకఁడు నాకు నహిభూషకుఁ గాఁ
జేతులు సాఁచిన మేలం
బాతనితో నాడఁబుట్టి తహిరూపమునన్. ౫౦

క. నీ సూర్యోపాసనఫల మీ
సౌందర్యంబు సాధ్వి యిల్లా లగుటన్
వాసిం గాంచితివి సుఖ
శ్రీ సమకూరెడిని ముక్తి సేకుఱు మీకున్. ౫౧

తే. భుక్తిముక్తిప్రదం బయి పుడమి మిగులఁ
దనరు నీ స్థలి నాగతీర్థం బనంగ
మీకథయు సేవకుల కెల్ల మేలొసఁగుచుఁ
జెలఁగు బ్రహ్మపురాణప్రసిద్ధ మగుచు.

క. అని యీశుఁడు పార్వతితోఁ
గను మొరఁగిన నచటివారు గని సంతోష

మ్మునఁ బరవశు లై సత్యవ
తినిఁగొనియాడిరి తమతమ ధీవిభవములన్. ౫౨

వ. అంత సత్యవతీభోగిభూమీంద్రులు తత్రత్యవృద్ధజనానుమతంబున యథావిధిఁ దమతల్లిదండ్రులు తమకుఁ బునస్సంధానంబుగావించిన నమందానంద కందళితహృదయారవిందులై యనిర్వచనీయసౌఖ్యమ్ములం దేలుచుఁ దక్కుంగల తీర్థమ్ముల సేవించుచుఁ గతిపయ ప్రయాణంబుల సపరివారంబుగఁ దమ తల్లిదండ్రులతో స్వఃపురంబునుం బోలు స్వపురంబునకుం జేరి సర్వజనులరంజింపుచు సుఖంబుండిరి, రత్నాంగదుండును బత్నీయుతంబుగ స్వపరివారంబుతోఁ గనకాపురమ్మునఁ గొంతకాలముండి సన్మానితుం డై నిజపురంబునకుం జని సుఖంబుగ నుండె.

క. కోరాడరామచంద్ర
శ్రీరఘునాథజ్ఞహృత్కుశేశయభృంగా!
శ్రీరామలింగ! కరుణా
శ్రీరంగ స్వాంతరంగ! జితకామాంగా! ౫౩

క. ఇవటూరికులజలధిసం
భవనుత యేలేటిపాడువాస! కృపాబ్ధీ!
కవిమోదకవనయోషి
న్నవమన్మథ! రామలింగ! నందితురంగా! ౫౪

చ. అనఘ! శివప్రసాదసచివార్యసుసంస్తుత! యీశ్వరప్పమం
త్రినుత! మహాప్రభావ జగతీభరితోరు యశస్క! వీరభ
ద్రనతినుతిస్ఫురద్విషయ! తత్పితృయోగినుతాదిలక్ష్మికా
ఘనబసవేశమంత్రి కరకంజసమర్చిత రామలింగయా ౫౫

తే. కని రహింనిఁ బెంచుకొనునాడుకవితఁగన్నె
నీకు నిచ్చితి నో యన్న నెనరుతోడ

నెట్లు పెంచెదవో చుమీ యేమరకుము
మమ్ము సంతోషపెట్టు నమస్కరింతు. ౨౬.

తే. తప్పులను బేర్మి సైరించి తప్పకుండ
నీ ప్రబంధరాజంబున నెసఁగుచున్న
నామకులుగలవారికి నాకు నిహముఁ
బర మొసంగుము తగురీతి భవ్యచరిత ! ౨౭

క. దీనిం జదివిన విసిన మ
హానరులకునిహముఁ బరము నపవర్గము గౌ
రీనాథుఁ డొసఁగు సకలాం
హోనాశసమిష్టిచరిత ముంఘనె యెందున్ ౨౮

## సీసము

హారితగోత్రోద్భవుం డైన మల్లమపల్లి యత్తుయగురునకు నగ్రిమాత్మజుండు
గణాగ్ర్యావ్రతస్థుఁడు సాధు వౌ వీరమల్లయాఖ్యాగాధ్యతల్లజునకు
భ్రమరాంబకును దనూభవుఁడ విద్వత్సింహుఁ డౌ రామ
లింగయ కవరజుండ మల్లికార్జునుఁడ శ్రీమల్లికార్జున
కృపాయత్తకవిత్వుండ నైన నాదు సత్యవత్యు
పాఖ్యానసంజ్ఞ ప్రబంధమందునన్ బంచ
మాశ్వాస మమర నిట్లు ముగిసె
నాచంద్రతారకముగఁ దనర్చు
నట్లు సేయుత దీనిఁ
జంద్రార్ధమౌళి.

# శుద్ధపత్రిక.

---

| తప్పు | ఒప్పు | పేజి | పంక్తి |
|---|---|---|---|
| బూరుగ | బూరుగు | 27 | 10 |
| యశ్వనీ | అశ్వినీ | 28 | 13 |
| లేలీహాన రాజు | లేలీహానపఙ్క్తి | ,, | 24 |
| నిమూలితాక్షుడై | నిమీలితాక్షుఁడై | 34 | 5 |
| ర__గాఁ | రక్తిగా | 66 | 6 |
| కంఠ్లుకదలికల నె యులరు, చాంచల్యంబు కనుల నలరు | | 73 | 22 |
| నిందు | నందు | 77 | 10 |
| నింకు | నందు | 85 | 6 |
| శిరోభాగ మిద్ది | శిరోభాగ మద్ది | 86 | 4 |
| స్నానమున కిటం | స్నానమున కటం | 92 | 7 |
| నీవున్ | నివునున్ | 98 | 2 |
| సభికులు | సభ్యులు | ,, | 15 |
| ధక్షుఁని | దక్షుని | 102 | 22 |
| మధియించెడి | మథియించెడి | 103 | 3 |
| పాధోరాశి | పాథోరాశి | ,, | 11 |
| నిద్దానింశో | నద్దానింశో | 104 | 6 |
| చెరుసఃకి | చేరువఅరు | ,, | 22 |
| జగత్ప్రిధిత | జగత్ప్రథిత | 106 | 2 |
| గోగు | గోఁగు | ,, | 4 |

భూతికి సైతము తోడ్పడుచున్నది. కావున నీయారాధ్యకవివరుం డితోధికశ్రద్ధాగరిమం బెక్కులు సరసకావ్యంబులు రచించి యాంధ్రలోకంబున కుపకరించుఁగాక! కాకినాడ 24-12-19.

బ్రహ్మశ్రీ కవిరాజు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు:--

బ్రహ్మశ్రీ మల్లంపల్లి మల్లికార్జునశాస్త్రిగారిచే రచింపఁబడిన "సత్యవత్యుపాఖ్యాన" మను నైదాశ్వాసముల ప్రబంధమును నేను చదివి మిక్కిలి యానందించితిని. నాకు వీరియందును వీరిపాండిత్యమందును వీరికవిత్వమందును మంచియభిప్రాయము కలదు. తొల్లి వీరు రచించిన భోగేశ్వరమాహాత్మ్యముఁ జూచినపుడు నాకుఁ గలిగిన యానందమును వారికిఁ గృతజ్ఞతాపూర్వకముగా వ్రాసిపంపించియుంటిని. ఇపు డీపుస్తకము మఱింతయానందమును గల్గించిన దని చెప్పుట యతిశయోక్తి కాదు. వీరి కవిత్వము బమ్మెర పోతరాజు కవిత్వమువలె నఖండధారాప్రవాహమై యుండును. ఉభయభాషాసాహిత్యము గల వీరు సత్యవత్యుపాఖ్యానములో వ్రాసిన పెక్కు పద్యము లమృతప్రాయములై యున్నవని చెప్పుచు గ్రంథమంతయు మనోహరమై నిర్దుష్టమై యున్నదని చెప్పుచున్నాఁడను. ఆంధ్రపత్రికాధిపతులగు బ్రహ్మశ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారీ గ్రంథము నాదరించి ముద్రించి ప్రకటించుటయే నా యభిప్రాయమును బలపఱచుచున్నది. శ్రీమల్లికార్జునశాస్త్రులవారు చిరంజీవులై యిట్టి గ్రంథరాజములను మఱికొన్ని రచించి మనయాంధ్రలోకమునకు వన్నెఁదెత్తురుగాక యని కోరుచున్నాను. రాజమండ్రి [illegible]-12-1919.

బ్రహ్మశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు, సంస్కృత ధర్మశాస్త్రశాల, తెనాలి:—

ఉ. *సుమనసమెన్న, రమ్యపదగుంభసరంబుల మెన్న, భక్తిస
త్ప్రతిభకు మెచ్చ, భవ్యతరధర్మపు సొంపు, సుశీలచంద్రికా
విసరము ప్రోవు, చిజ్జడవివేకము తా విది గాంచినంత నే
రసికులు సంతసింపరె! గుణగ్రహణైకపరాయణుల్ బుధుల్.

మ. కృతికన్యామణికిన్ రమానాథుఁ డలముక్తిశ్రీమహోదాత్తి, యీ
కృతికిం బోషకుఁ డాంధ్రలోకవిభుఁ డీశ్వ్యుండు నాగేశుఁ డీ
కృతికిన్ గర్త కవీంద్రసన్నుతుఁడు మల్లేశుండు సౌమ్యుండు, సా
ర్వస్తుకులం గానమె! వేనవేలిటులు కల్మిన్ గంటి నే నుండెదన్.

సీ. పతిదేవత నొకర్తఁ బ్రస్తుతంబుగఁ జేసి తెలిపితి విట క్షేత్రతీర్థపటలిఁ
కృతికర్తృవంశసత్కీర్తనం బను పేర నిడితి యశము బంధుబృందమునకుఁ
గావ్యైకనిర్మాణకౌశలంబున నిందుఁ బ్రకటించితివి ధర్మరాశి నెల్లఁ
గృతి నొందు బుధజనకీర్తితంబుగఁ జేసి యందితి సుకృతం బనంతముగను

గీ. సహృదయ హృదయనిచయవిస్మయవిధాయ
కాశయామేయ వాఙ్మయ హర్షణీయ
భవ్యకావ్యక్రియామయాభయవిధేయ !
మల్లికార్జున! కవిజనమాననీయ !

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు :—

మీరు ముందు ముద్రించిన భోగేశ్వరమాహాత్మ్యమును నిప్పుడు ముద్రించుచున్న సత్యవత్యుపాఖ్యానమును జదివితిని. మనగురువులు శ్రీతిరుపతి వేంకటేశ్వరులు మెచ్చిన మీకవితాధారనుగూర్చి నేను ప్రశంసించుట సిద్ధసాధనము. అక్లిష్టమై తేటఁగాఁ దియ్యఁగా మీశైలి మేలిల్లుచున్నది. మీగ్రంథములు లోకమున మంచివ్యాప్తిని బొందఁగలవు. శ్రీతిరుపతివేంకటేశ్వరుల శిష్యులలో మీరొక రత్నము.—చెన్నపురి 1-10-1919.

బ్రహ్మశ్రీ శిష్ట్లా హనుమచ్ఛాస్త్రిగారు:—

తాము పంపిన సత్యవత్యుపాఖ్యానమును జూచినాను. భోగేశ్వరముకంటె నియ్యది రసవత్పదబంధురమై ధారాశుద్ధిగల సెక్కపద్యములతోఁ గూడి పాఠకులకు విసువుపుట్టింపనికథ గలదై యున్నది. ఇప్పటి హైస్కూళ్లలోఁ బఠనీయగ్రంథములుగా వచ్చువానిలో నిదియు బృహత్సహాయసంపద్విశేషముచే రాణింపవచ్చును. తమరు సంస్కారులు. మీవాణి క్షుణ్ణమార్గసంచారిణి యై రాజిల్లుచున్నది.— గుంటూరు 14-11-1919.

బ్రహ్మశ్రీ॥ నాదెళ్ల పురుషోత్తమకవి గారు :—

క. చదివితి మొదలిడి తుదవఱ । కద నొదవించికొని మల్లికార్జునకవి రా
జుదయాను బలిచిన ధర్మాం । గదుస్నుష సత్యవతి చరితఁ గల వివరములన్.

క. కవియడఁకువ లక్ష్యము నా । కవియోపిక ముద మమాయికత్వము హితమున్
జవిగలకవితను దవిలియుఁ । బ్రవిమలచిహ్నములఁ గానఁబడియెడిఁ దెలియన్.

క. ఇప్పటిరుచికై చేర్చిన । చొప్పుల టుండంగఁ గవిత సొబ గెన్నిక యై
యొప్పెడిఁ బూర్వకవీశులు । చెప్పినకబ్బముల వద్ది చేయుంబడఁగన్.

బందరు, 26-11-1919.

బ్రహ్మశ్రీ॥ మాదెళ్ల దక్షిణామూర్తిశాస్త్రులు గారు:—

శా. మల్లంపల్లికులోదయా! సుకృతిరంభాకల్పనాత్యంతసం
ఫుల్లప్రాజ్ఞగపజ్ఞ లోకహృదయాంభోజాత! మా కెంతయో
యుల్లాసంబును గూర్చె సత్యవతి సర్వోత్కృష్టతీర్థావనీ
భృల్లాలిత్యలసన్మహోస్థలకథాభివ్యంగదత్వంబునన్.

ఉ. వీనుల కింపు నింపెడి కవిత్వపు పెంపున సత్యకథ్యుపా
ఖ్యానము పాముపాటకథ యైన ముదంబిడు మల్లికార్జునా
ఖ్యానకవీ! నిసర్గమధురామృతసంగము ప్రాప్తమైన నె
ద్దానికిఁ గల్గితీరు రుచి తద్దయు నీయెద మీ చరిత్రమున్.

బందరు 16-11-19.

బ్రహ్మశ్రీ॥ ములుగు చంద్రమౌళీశ్వర శాస్త్రి గారు:—

సీ. అమలప్రసాదగుణాభిరామం బగు మీసత్యవతి శుభావాస మనఁగ
బహుళసువర్ణసంపన్మాత్రసృహ మగు మీదుసత్యవతి రుక్మిణి యనంగఁ
ప్రకటమాధుర్యభద్రరసాలతరు వగు మీసత్యవతిసవామృతముకన్మ
నతిసౌకుమార్యమోహక్రియారంభ మగు మీసత్యవతి సుదనాశభాతి.

తే. గీ. పరయనేవారికేని హృదయాంతరముల
రాగమును గూర్చి పెంచు నౌరా ప్రశస్త
బహురసాలవాలము సత్యవతి చరిత్ర
మల్లికార్జునకవివర్య మాన్యచర్య.

తే. గీ. కందకచబృంద మత్తేభమందగమన
చంపకఘ్రాణసహృదయ శ్లాఘ్యగీతి
యాటవెలఁదుల నలరించునట్టి దిట్టి
దరయ నెందును మీకృతి యనఘవృత్త.

తెనాలి 14-11-19 9.

Printed at the Andhra Patrika Paess, Madras—1920.